# శ్రీ మదాంధ్ర

# రామాయణము

బాల కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము



ప్రణీతము

**పోచిరాజు కామేశ్వర రావు**

# శ్రీమదాంధ్ర రామాయణము

(మూలము: శ్రీవాల్మీకి రామాయణము)

ఉపోద్ఘాతము.

సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడైన శ్రీరామ చంద్రున కంకితముగా శ్రీవాల్మీకి మహర్షి విరచిత రామాయణమునకు సంపూర్ణ నిర్వచ నాంధ్రీకరణ కావ్యముగ **శ్రీమదాంధ్ర రామాయణమును** రచింప సంకల్పించి సీతా సమేత శ్రీరామచంద్రుని దయార్ద్ర వీక్షణముల సకల సవ్యాకరణ శాస్త్ర కోవిదుఁ డాంజనేయుని కృపా వృష్టి భగవానుని శ్రీ వాల్మీకి మహర్షి దివ్యాశీర్వచన ప్రాభవమున నేను గృతకృత్యుఁడ నైతిని. శ్రీమదాంధ్ర రామాయణమున నాఱు కాండములు నైదువందల ముప్పది యేడు సర్గములు షోడశ సహస్రాధిక పద్యములు విరాజిల్లుచున్నవి.
కేవల మాంధ్ర భాషలో మాత్రము విలసిల్లు నర్ధ భేద సంయు తార్ధానుస్వారములను విస్మరింపక, నాధునిక కాలమున ననాదరమునకు గుఱి యగుచున్న వ్యాకరణమున కుచిత స్థానము కల్పించి ముఖ్యముగా విసంధి ద్రుత సంధి రాహిత్యాది దోష ముల విసర్జించి ముందు తరముల వారికి నమ లాంధ్ర భాషా మకరందము నందఁ జేయ నెంచి శ్రమించి చేసిన యీ బృహత్కార్యమును బండితు లాదరింతురని నా దృఢ విశ్వాసము.
లక్షణములకు నీ కావ్యము లక్ష్యముగా భాసిల్లఁ గలదని నా నమ్మకము.

మానవమాత్రులకుఁ బ్రమాదము లతి సహజములు దుర్నివార్యములు గనుక ననేక పర్యాయములు క్షుణ్ణముగాఁ బరిశీలించి పరిష్కరించినను కొన్ని మదీయ దృష్టిపథమ్ము నేమఱించి యవశేషము లైనవి గోచర మైనఁ బాఠక మహాశయులను నాకుఁ దెలియఁ జేయ మని మనవి చేసికొనుచున్నాను. వానిఁ బరిశీలించి తదనుగుణముగా సవరింపఁ గలవాఁడను.

విబుధజన విధేయుఁడు
పోచిరాజు కామేశ్వర రావు
గ్రంధకర్త.

రాయపూర్.
29 -9 – 2023.

# శ్రీమదాంధ్ర రామాయణము

(మూలము: శ్రీవాల్మీకి రామాయణము)

## అవతారిక

ఇష్ట దేవతా ప్రార్థనము:

శా. శ్రీకైవల్య విలగ్న మానసుఁడ నై చింతింతు శ్రీరాఘువుం
లోకోద్ధారుని నిత్యసత్య సువచో రోచిష్ణు యాగావనుం
గైకేయీ వచ నానుకర్ముఁ బితృ వా క్సాఫల్య వాంఛాత్మునిన్
శ్రీకాంతా హరణార్తి రావణ శిరశ్ఛేదైక కార్యోన్ముఖున్ 1.

శా. విఘ్నారణ్య కుఠార! భక్తజన దుర్భే దావనీ వాస పా
పఘ్నా! నిర్జర పూజితాంఘ్రి యుగ! దుర్వా రోగ్ర దుర్దాంత శ
త్రుఘ్నోదార దయా రసామృత మహోత్తుంగాత్మ! షడ్వక్త్ర గ
ర్వఘ్నా! విఘ్నపతీ! నుతింతు మదినిన్ వారింప విఘ్నావళిన్ 2.

ఉ. పద్మ సుఖాస నాంబురుహ భావ విధాతృ సరస్వతీ ధవుం
బద్మ దళాక్ష తామరస ఫాండ జగత్రయ నిత్య రక్షకుం
బద్మభ వాంగ కోద్భవ శివప్రద చండ దశైక రుద్రులం
బద్మ సు వర్ణ నామ ముని వంద్య సురేశులఁ గొల్తు ముక్తికై 3.

చం. వనజ దళాయతాక్షి నిజ భక్తజనావన సత్క్రియా రతై
క నిజ మనోరథప్రకరఁ గంజ ముఖాంబుజ వారిరాశి సం
జనిత రమాభిధాన విలసల్లలితాంబుజ హస్త హస్తి భా
జన జల భాసమాన శిరఁ జక్రధరాంగన లక్ష్మిఁ దల్చెదన్ 4.

శా. కైలాసాగమ వాస వామ సు తటీ గాత్రార్ధ భాగప్రభా
లీలావాస విలాస హాస! కర వల్లీ శూల సంధాయినీ!
కాళీ నామ విశేష సంచరిత భక్తాభక్త దైత్యాలి దృ
గ్వాలేందు ప్రళయాంత కాభ  వదనా! పాలింపు కాత్యాయనీ! 5.

ఉ. విద్యల కెల్ల దేవతవు వేద గిరార్చిత మాతృ మూర్తివే
హృద్య ఫలాశ నాక్ష కుసు మేప్సిత పుస్తక యుక్త పాణివే
చోద్య విపంచికా స్వర యశో భరి తాఖిల లోక వేదసం
వేద్య సురాళి పూజ్య పద విశ్వస్ప డంగన నిల్వు వాక్కులన్ 6.

కం. అనిలాత్మజున్ మహాబలు
హనుమన్నామప్రసిద్ధు నర్కజు మంత్రిన్
ఘనునిన్ సీతాన్వేషిన్
మనోజవున్ రామ భక్త మాన్యుం దలఁతున్ 7.

కం. వల్మీకాంతర్గత తను
దాల్మి ముఖామర గణ వినుత ముని వరేణ్యా
కల్మష విరహిత చిత్తా
వాల్మీకి కవీంద్ర నాదు ప్రణతులు గొనుమా 8.

పూర్వాధునిక కవి కీర్తనము.

చం. తలఁతుఁ గవిత్రయమ్ము మదిఁ దల్చెద నా కవిసార్వభౌము నేఁ
దలఁతును బోతనం గవి పితామహు పెద్దన నన్న సత్క వీం
ద్రుల నుతియింతు సంస్కృత గురుప్రవరాళి స్మరింతు నెమ్మినిన్
లలితుల నేఁటి మేటి కవిరాజుల మెచ్చి వచింతు నింపుగన్ 9.

కృతిపతి నిర్ణయము.

కం. ఈ రామాయణము దయా
పారావార రఘురామ భద్రున కెలమిన్
ధారా దత్తము సేయుచు
ధారా బద్ధ మొనరింతు ధరణిజ కరుణన్ 10.

కృతికర్తృ వంశ వర్ణనము.

శా. శ్రీ లక్ష్మీ సతి నాథు కూర్మిసుత సచ్ఛీ లాన్వ యాంభోధికిం 11.

ద్రైలోక్యాధిపుఁడై వెలుంగు హరు మూర్ధావాసునిం బోలుచున్
మేలౌ కౌశిక గోత్రుఁడై బుధ జనా మేయాభిమానుండునై
వేలా హీనము వోచిరాజ వనధిన్ వెల్గొందె పేర్రాజనన్

ఉ. వానికిఁ బుట్టె నాత్మజుఁడు పన్నగ శేషయ నామధేయుఁడై
వానికిఁ గల్గి రింపుగను వత్సులు నల్గురు పేరరా జిఁకన్
మానిత రామచంద్రుఁడును మాన్యులు లచ్చన సుబ్బరాయులున్
సూనులఁ జిన్నవాఁడు నగు సుబ్బ వరాఖ్యుఁడు గాంచె నల్వురన్ 12.

తే.గీ. రమ్య నందన వరులఁ బేర్రాజు శేష
గిరియు గోపాలకృష్ణుఁ డవరజుఁ డెల్ల
రకును నరసింహమూర్తి వర తనయుండు
వెలదిఁ గాంచెను నరసమ్మఁ బేర్మి సుతను 13.

తే.గీ. అగ్రజుండు పేర్రాజున కాత్మజులము
మానితముగ సుబ్బారావు నేను మఱియు
రామ మోహన రావును సోమశంక
రుండు పుత్రిక లైదుగురు కలుగంగ 14.

తే.గీ. తరళ సాధ్వీ లలామ శుద్ధచరిత సుగు
ణచయ విభ్రాజమాన వినమ్ర లలన
సంతత ప్రియ భాషిణి చారు శీల
సత్యసుందరి మాతల్లి ముత్య మెంచ 15.

శా. సత్యాధ్యాత్మిక చింతనా కలిత భాస్వద్జ్ఞాన సంభావ్యుఁడున్
నిత్యోద్దీపిత పద్య కీర్తిత మహానీలాంగ విష్ణుండు నౌ
న్నత్యభ్రాజిత వర్తనుండు స్వపురీ నాథత్వ ధౌరేయుఁ డా
రాత్యామ్నాయ విహీనునిం గొలుతుఁ బేర్రాజాఖ్య విఖ్యాతునిన్ 16.

ఉ. మాన ధనుండు గ్రామ జన మండిత తత్త్వ విశోధకుండు స
త్సూనృత గీతసార పరిశోధిత మానస భాసమానుఁడున్
మానిత వేద సూక్త పరిమాణ మహోదయ కావ్య రాజ సం
ధానుఁడు సత్యవంత వర దార చరిత్ర మనంగ ధాత్రినిన్ 17.

తే.గీ. మీఱి వేంకట రామలక్ష్మి సతి కాఁగ
నలరి హిమబిందు సౌజన్య లనఁగఁ బుత్రి
కా ద్వయము గాంచి రాజశేఖరుఁ డనంగ
నందనునిఁ గంటిని గుణరత్న నిధు లనఁగ 18.

ఉ. సేవిత బంధు సంచయ వశీకర వేంకట రామ యుక్త ల
క్ష్మీవర నామ భూషిత సుకీర్తిత సద్గుణ భక్తి భావ సం
ఘావృత శీల సంతత నిజాత్మ విభూన్నత సక్త చిత్త సం
భావిత నిత్య దాన గుణ భాసిత కోమలి నాదు భార్యయే 19.

కం. ద్వ్యక్షర పద క్షయీకృత
కుక్షి క్షేమంకర వర గోత్ర క్షిప్త
త్ర్యక్షర వాచ్య క్షి త్యా
భ క్షాంత మనో రుచి ప్రభావిత సతియే

[ద్వ్యక్షరపదములు: “నాస్తి, ఈర్ష్య, కామ, క్రోధ, లోభ, మోహ మద ” ఇత్యాది దుర్గుణములు.
త్ర్యక్షర వాచ్యములు: “కరుణ, అర్పణ, సంయతి, ప్రశాంతి” ఇత్యాది సద్గుణములు.

పద విభజనము:
వర గోత్ర క్షిప్త, ద్వక్షర పద క్షయీకృత, కుక్షి క్షేమంకర, త్ర్యక్షర వాచ్య, క్షితి ఆభ క్షాంత ,మనో రుచి ప్రభావిత సతియే

తాత్పర్యము:
మంచి గోత్రమున నుంచబడిన ( వివాహమైన), అడిగిన లేదనుట, ఈర్ష్య మొదలగు రెండక్షర పదములను నశింప జేసినట్టి, కడుపునకు శుభము కూర్చునట్టి ( మంచి యాహారముతో), కరుణ మొదలగు మూడక్షరముల వాచ్యములు కలిగినదియు, క్షమయందు భూసమానమైనదియు (మున్నగు సద్గుణములతోటి) మనస్సు యొక్క కాంతి చేత ప్రభావితమైన యట్టి యామె నా భార్యయే] 20.

సీ. నేర్చితి ఛందమ్ము నర్చించి భీమ శంకరు వ్రాసితిని శతకమ్ము నొకటి
పౌగండ మందు యౌవన మెల్ల కుక్ష్యర్థ మడరంగ నుద్యోగ మందు నిందు
భాత్ప చోదన మంత భాసిల్ల శంకరాభరణ సమస్యా కవనము లల్ల
రతి వేంకటేశ్వర రామచంద్ర మఱియుఁ బోచిరాజ శతకము లలరించి
తే.గీ. వ్రాసి పద్మావతీ శ్రీనివాసము ద్విప
దమ్ము సుందర కాండ మంత రచియించి
తిని తెనుఁగు భగవద్గీత తెల్లముగను
వెలయ నారాయణీయము నలరె నెలమి 21.

తే.గీ. శ్రీ గణేశ శంకర రామ రాగ నుతులు
శ్రీద బ్రతుకమ్మ పాటయు హృద్యముగను
గూర్చి దైవత శ్లోకము లర్చ నార్థ
గతి నవగ్రహ స్తుతి రచించితి ముదముగ 22.

సీ. ఆంధ్ర ప్రదేశము నందలి గౌతమీ ప్రాఙ్మండలపు దొడ్డవరము నందుఁ
దొలి చదువు చదివి మలి చదు వది మామిడి కుదురు పురి మొదటి గతి నేర్చి
యమలాపురమున విద్య యొక యేఁడు చదివి యంత్ర మర్మము విజయ పురి నరసి
యుద్యోగ మణుసంస్థ నొప్పుగ నున్నత విద్యలు ననువుగఁ బేర్మిఁ బడసి
పిమ్మట నొజ్జనై విద్య గఱపితి భాగ్య నగరి నలరఁగ నాలు సంతు
తే.గీ. భారతీ సత్కృపా వర్ష పాత మంది
పూనితిఁ గవిత్వమును వ్రాయ బుధులు మెచ్చ
రక్తి నుంచి మురారిపై రాయపురిని
వంత వీడి సతము రచియింతు నేను 23.

షష్ఠ్యంతములు.

కం. ఇన వంశార్ణవ సంజా
తున కవనిజ దుఃఖ చయ విదూరునకుఁ దపో
ధన జన ఘన రక్షాదీ
క్షునకున్ దనుజాంతకునకు క్షోణీ పతికిన్ 24.

కం. రఘు వంశోద్ధారకునకు
నఘాటవీ పరశువునకు నవనిజ పతికిన్
విఘటిత దనుజశ్రేణి క
లఘు సత్యపరాక్రమునకు రామాఖ్యునకున్ 25.

కం. గుణనిధికి నిరంతర ల
క్ష్మణ సంసేవితునకుఁ బ్రహసన్ముఖ మద వా
రణ నిభ గమనునకు స కా
రణ కోపాటోపున కసురద్విప హరికిన్ 26.

కం. నుత సంత తైక పత్నీ
వ్రతునకు ధానుష్కునకుఁ గృపా తోయధికిన్
నత మున్యాలికి విద్రా
విత దను జాసుర సదైత్య వీరావలికిన్ 27.

కం. ఇక్ష్వాకు కులాబ్ధి శశికి
సుక్ష్వం కాధిప సఖునకు సుశ్లోకునకున్
సక్ష్వేళ గళార్చకునకు
సుక్ష్వే డాభస్వర సువచో నృవరునకున్ 28.

కం. ఖర దూషణ సత్రిశి రా
సు రాది హంతకు దశాస్య శోభిత లంకే
శ్వర సామాత్య స నందన
వర సైన్య వినాశకునకుఁ బరమాత్మునకున్ 29.

తే.గీ. అర్పణముగ వాల్మీకి సంయమి వర విర
చిత మహాకావ్యమునకు నుచిత విధంపుఁ
దెనుఁగు సేఁతఁగ నా సేయు దివ్య కథకు
రామ చరిత కారంభ మీ క్రమము సుండి 30.

ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ సర్గ సారాంశము:

కం. అలవియె కవికోకిల వద
న లపిత రామ చరితమ్ము నవరస భరి తా
మల మధు రసమ్ము నుడువం
దెలిసిన మరియాద రఘుపతి దయఁ బలికెదన్ 31.

ఉ. దేవ మునీంద్ర నారదుఁడు దెల్పె సుపూజిత తృప్త చిత్తతం
బావన రామచంద్రు కథఁ బన్నుగ వేఁడఁగఁ బుట్టపుట్టువే
యా వచనమ్ము లూనుచు మహాముని యొక్క నిషాద పాతి త
మ్మౌ విహగమ్ము శోకమున నారసి పల్కఁ జెలంగె శ్లోకమై 32.

ఉ. దేవ గణాద్యుఁ డంత నరుదెంచి కవీంద్రున కిచ్చె బోధముం 33.

జేవయు నేర భావములు సేతలు నింపుగ నెల్ల వారివౌ
యా విధి సత్కరించి ముని నబ్జజుఁ డాతనిఁ బ్రోత్సహించె ది
వ్యావతర ప్రకీర్తన మహా కథ రామ చరిత్ర వ్రాయఁగన్

తే.గీ. శ్లోకము లిట నిరువది నాలుగు సహస్ర
ములును షట్కాండములు సర్గము లవి యైదు
వంద లడర వాల్మీకి కావ్య మడరించి
మౌని యుత్తర కాండము మఱి లిఖించె 34.

తే.గీ. రామ చరితమ్ము వైదేహి భూమిజ గుణ
వర్తనము రావణాసుర వధలఁ గూడు
కథల వర్ణించి వాల్మీకి కర్ణ పేయ
ముగ రచింప రామాయణమ్ము భువి వెలిఁగె 35.

తే.గీ. లవకుశులు పాడఁ దీయఁగ రామకథను
మునివరులు పొంగి రానందమున భృశమ్ము
రాముఁ డది విని పిలిపించి రాజగృహము
నందుఁ బాడించె వారిచే డెంద మలర 36.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నవతారిక నా సర్గ చతుష్కము.

## బాలకాండము

## సర్గము 5.

కం. శ్రీశా పద్మాక్షా వి
శ్వేశా కరుణా సముద్ర శ్రిత జన రక్షా
వేశా వైదేహీ హృద
యేశా రామావతార యినకుల వర్యా! 1.

అయోధ్యానగర వర్ణనము.

చం. సకల ధరాత లమ్మిది ప్రజాపతి తన్నృప వంశ జాత కో
టికి జయశీల రాజులకు రీవిగఁ జెల్లెను మున్ను వీరి యం
ద కడలి ద్రవ్వి నట్టి ఘనతన్ సగరుండు వెలింగె స్వీయ పు
త్రకులు సెలంగఁ తోడుగ విరాజిలి షష్టి సహస్ర సంఖ్యలన్ 2.

తే.గీ. రాజు లిక్ష్వాకు వంశ విరాజమాను
ల చరితమ్ము రామాయణ రమ్య గాథ
వెలసె ధర్మము కామార్థముల వచింతు
విన వలయు నాది నుండి విద్వేష మణఁచి 3.

కం. కోసల నామపు దేశ
మ్మా సరయూ నది తటమ్మునం దతి ధన ధా
న్యాసమ లీలం జక్కఁగ
భాసిలు చుండెను ముదం బపారం బలరన్ 4.

ఆ.వె. మానవేంద్ర మనువు దాన నిర్మింప స్వ
య మ్మయోధ్య యనెడి యంద మైన
పట్టణమ్ము నచట భాసిల్లె నిత్యము
లోక మందు నెల్లఁ బ్రాకటముగ 5.

తే.గీ. పొడవు పండ్రెండు యోజనములు వెడల్పు
యోజనత్రయమై కడునొప్పు నప్పు
రమ్ము రాజమార్గ విభజనమ్ము సుంద
ర తరమై తనరారు నిరంతరమ్ము 6.

కం. కుసు మావిరళ వికీర్ణ వి
లసిత మహా రాజమార్గ లావణ్యము ని
త్య సమంబు సిక్త నిర్మల
లసత్పథ నిచయ మనోహరమ్మయి తనరున్ 7.

చం. దశరథ రాడ్వ రోత్తముఁడు తద్వర రాష్ట్ర వివర్ధనుండు దా
యశపు టయోధ్య యందు నమరాధిపుఁ డా దివమందు నుండు రీ
తి శుభ నివాసియై తనరు దీప్త కవాట సతోర ణాపణ
మ్ము శిత వరాయు ధాతిశయ పూరిత యంత్ర సు శిల్ప రాజినిన్ 8.

ఆ.వె. సూత మాగధ జన శోభితమ్ము నతుల
సంప దావృతమ్ము శత శతఘ్ని
సంకులమ్ము నుచ్చ చారుధ్వ జాట్టాల
కమ్ము పురవరమ్ము కాంతి మయము 9.

ఆ.వె. నర్తకీ వధూజన వరనటు లలర
నెల్ల నుల్లసిల్ల వల్లరీ వ
రామ్ర యుక్త సుంద రారామ నిచయమ్ము
సాల మేఖలయ విశాల పురము 10.

ఉ. లోఁతగు కందకమ్ములు విరోధ నిరోధక దుర్గ రాజముల్
లాఁతి దురాసదమ్ములును రమ్య తనూరుచి వాజి వారణ
వ్రాత సమృద్ధ భాసితము పట్టణరాజము గోగ ణోష్ట్ర సం
జాత ఖరౌఘ పూర్ణ మయి సంతత మొప్పు ధరాతలమ్మునన్ 11.

ఉ. కప్పము లిచ్చు రాజవర కాయము గొల్చుచు నుండు నచ్చటన్
మెప్పుల ముంచి చేరుగడ మేటి నృపాలురు నుండ నమ్రులై
యప్పర దేశవాసులు సుఖాలయ వాసము సేయు చుండఁగా
నొప్పు పురమ్ము వర్తకులు నుత్తమ రీతిఁ జరించు చుండఁగన్ 12.

శా. ప్రాసాదమ్ములు రత్నసత్ఖచితముల్ భాస్వంతముల్ నిత్యమున్
వాసిన్ మించును పర్వతవ్రజము శోభా రూప సంపత్తి నా
వాస శ్రేణులు సౌధ రాజములు సంభావింప నాఖండ లా
వాసమ్మో యమరావతీ పుర బృహత్ప్రాసాద తుల్యమ్ములే 13.

కం. చతురం గాకృతిఁ బురుషులు
నతివలు సెలరేఁగు చుందు రచ్చట సతత
మ్మతి కాంతి మంత రత్న స 14.

మితిఁ గూడి విమాన చయము మీఱును బ్రభలన్

కం. సమతల మం దవిరళము గృ
హములన్ నిర్మించిరి కడు నపురూపముగం
దమిఁ జెఱకు రసము వోలు జ
లము వరిధాన్యము భృశమ్మల నునిచిరి తగన్ 15.

తే.గీ. దుందుభి మృదంగ వీణాది తూర్యము లవి
సెలఁగు నిత్యము నప్పురి లలితముగను
మేదినిఁ గన నయోధ్యను మించి నట్టి
నగర రాజ మెందును లే దనంగ నిజము 16.

కం. సిద్ధులు తపో బలమున స
మృద్ధ విమానముల దివిని మెలఁగిన రీతిం
బద్ధతిఁ దీర్చిన గృహముల
నిద్ధచరిత నర వరాళి యెలమి వసించున్ 17.

తే.గీ. చంప రసహాయులను నేక చరిత నరుని
బాణముల నేసి యిందు శబ్దగతి నెఱిఁగి
పాఱు వారలఁ గరుణఁ జంపక విడుతురు
బాహు బల నిపుణులు ధర్మ పరత నుండి 18.

ఆ.వె. వాడి శస్త్ర తతుల బాహు బలమ్మునఁ
గ్రోడ వాల సింహ ఘోర మత్త
నర్దన మృగ కోటి మర్దింత్రు వనమందు
రాజసమ్ము దనర రాజ సుతులు 19.

తే.గీ. అట్టి వీరులు వేలు మహారథులు ప
రాక్ర మోపేతులు పరిపూర్ణము సెలంగు
నయ్యయోధ్యా నగర మందు నతుల విక్ర
ముండు దశరథుఁడు నివాసు ముండు నృపతి 20.

చం. ద్విజులు మహాన లార్చకులు వేద షడంగ విశార దోత్తముల్ 21.

సుజన గుణప్రకాశ తను శోభిత దాన సహస్ర సత్య వా
గ్భజన ర తాంతరంగ ఋషి కల్పులు కేవల సంయమీంద్రు లా
ఋజుతమ పట్టణమ్మున వసింతురు నిత్యము ధర్మ బోధకుల్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేనవ సర్గము.

## బాలకాండము

## సర్గము 6.

దశరథుని రాజ్యమునఁ బౌరుల వైభవ వర్ణనము.

తే.గీ. ఆగమ విదుఁ డిక్ష్వాకు వంశాతిరథ వ
రుండు సర్వసంగ్రహ కుశలుండు దీర్ఘ
దర్శి నిజ పౌర జానపదప్రియుండు
ధర్మ రతుఁడు తేజోమయ దశరథుండు 1.

తే.గీ. క్రతుల కర్త వశి మహర్షికల్పుఁడు త్రి జ
గద్విశిష్టుఁడు రాజర్షి ఖండిత రిపు
సంగత సఖుఁడు బలశాలి సంపదల ని
ధు లితరములఁ గుబే రేంద్ర తుల్య విభుఁడు 2.

తే.గీ. దశరథుండు నిలిచి యయోధ్యా పురమ్ము
నందుఁ బాలించె జగమును సుందరముగ
విక్రముండు మనువు మున్ను విశ్వ మెల్ల
నేలిన విధమ్మున వసుమతీశుఁ డలరి 3.

కం. పురమును బాలించెను రఘు
వరుండు ధర్మార్థ కామ పద్ధతు లలరన్
వర సత్యసంధుఁ డింద్రుఁడు 4.

పుర మమరావతి భృశమ్ము పోషించి నటుల్

ఉ. ఆ పుర రాజ మందు నరు లందరు హృష్టులు ధర్మచిత్తులున్
దీపిత సర్వవిద్యులును దృష్టులు స్వీయ ధనాది భూతులన్
రూప విలాసవంతులు నలుబ్ధులు సంతత సత్యవాదులే
చూపఁగ నల్ప సంచయులఁ జోద్యము ధాన్య గవాశ్వ హీనులన్ 5.

తే.గీ. కన గృహస్థు లసిద్ధార్థుల నట నరుదు
కారు కాములు, లోభులు కారు క్రూర
నరు లవిద్యులఁ గాంచము నాస్తికులును
లే రయోధ్యా నగర మందుఁ బౌర వరుల 6.

కం. నర నారు లెల్ల వారలు
వర ధర్మ గుణాత్ము లమల భావులు మున్యా
భ రుచిర నియతాత్ము లుదిత
వర వృత్తాతిశయ శీల వంతులు సుమ్మీ 7.

ఉ. లేక సుకుండలమ్ములును లేక కిరీటము లింపు దండలున్
లేక యనల్పభోగులును లేక శుచిత్వ శరీర లేపనా
నీకము లేని వారలను నిత్య సుగంధము లేని వారలన్
వీఁకను గాంచ దుర్లభము వీనిని నెన్నఁడు వేచి చూచినన్ 8.

తే.గీ. విమల భోజ నాతృప్తు నీవి యలవడని
వాని నంగద హారము లూన నట్టి
వాని నింద్రియ లోలుని వర కరాభ
రణ విహీనునిఁ గాంచ దుర్లభము పురిని 9.

ఆ.వె. కన మనాహితాగ్నుల నరయ మల్పుల
యష్ట కాని వాని నరయ లేము
కనము చోరుల వెదకంగ నామ్నాయ సం
కరుల నా యయోధ్యఁ గాంచ రాదు 10.

కం. నిజకర్మ నిరతులు నిరత 11.

ము జిత నిజేంద్రియులు దానము నధీతులలో
ద్విజ పుంగవు లుంతురు తమి
నిజ దానగ్రహణ నియతి  నెఱపుదు రెపుడున్

ఆ.వె. అపుడు నాస్తికు లన్న తాశక్తులు నసూయి
లు నలతి చదువరులఁ గనము నెచటఁ
బండితు లట కాని వారిని వీక్షింపఁ
దరము కాదు నగర వర మయోధ్య 12.

తే.గీ. లే రహో షడంగమ్ము్లు నేర కచట
లేరు దానపరులు కాని వారు భృశము
లేరు దీనులు వ్యధితులు లేరు చిత్త
మణఁగి నట్టి వారెవ్వరు నవని సురులు 13.

చం. పురుషుల స్త్రీల యందుఁ గనఁ బుణ్యతమంపు టయోధ్య లే రహో
సిరిమితి మీఱకుండను వచింప నిజమ్ము కురూపు లెచ్చటన్
గురుతర రాజభక్తి మదిఁ గూడని వారలఁ గాంచ శక్యమే
పురమున నాల్గు వర్ణములు మూరు సు రాతిథి నిత్యపూజలన్ 14.

తే.గీ. ఎల్లరు కృతజ్ఞులె వదాన్యులె యమితమ్ము
శూరులు పరాక్ర మోగ్రులు పోరులందు
ధర్మసత్య సంశ్రితులును దార పుత్ర
పౌత్ర వంత చిరాయులు పట్టణమున 15.

ఆ.వె. క్షత్రియులు వినయులు కరము విప్రులకును
క్షత్రి యానుచరులు కాంచ వైశ్య
వరులు శూద్రులు గొలుతురు కులత్రయమును
స్వీయ ధర్మ రతులు వీర లెల్ల 16.

తే.గీ. మున్ను ధీమంతుఁడు మనువు పురుష పుంగ
వుండు పాలించె నెవ్విధి భూతలమ్ము
నట్లు నిక్ష్వాకు నాథుండు నప్పురమ్ము
నేలె దశరథ రాజ వరేంద్రుఁ డలరి 17.

తే.గీ. అగ్ని సన్నిభ యోధ వరాగ్ర గణ్యు
లు నిపుణులు దృఢచిత్తులు ఘనలు నిండి
యుండ్రు వర ధనుర్వేదజ్ఞు లుద్ధతి గుహ
లోని సింహముల పగిది రోష మడర 18.

తే.గీ. పురము పూర్ణ మయమ్ము కాంభోజ దేశ
బాహ్లీక వనాయు సింధుజ పరమ హయ ని
కాయముల దేవపతి తురగ సదృశమ్ము
తనరు నిజ దేహకాంతుల దర్ప మడర 19.

మ. పరిపూర్ణమ్ము పురమ్ము వింధ్యగిరి రాడ్భావేభ జాలమ్ములన్
వర హేమాగ తలోద్భవద్విప వరవ్రాతమ్ములన్ మత్త దా
న రసాపూర బలాన్వితాద్రి నిభముల్ నాకేశ మాతంగ వం
శ రుహేభేంద్ర మహాంబుజాన్వయ ఘనాశా దంతి జాతమ్ములన్ 20.

తే.గీ. భద్ర మృగ మంద్ర గజములు భద్ర మంద్ర
మృగ కులేభములు మఱియు మేలి భద్ర
మంద్ర భద్రమృగ మఱియు మంద్రమృగపు
మత్త గిరినిభ ద్విపములు నిత్తె ముండు 21.

కం. సు పురం బయోధ్య యెచ్చట
నృప దశరథుఁడు వసియించి కృప నేలెనొ పెం
చి పురి వెలి యోజన యుగ మ
ది పరగె భువి సార్థకంపుఁ దిరు నామంబై 22.

కం. తారల శశాంకు క్రియఁ బర
వీరుల నణఁచి దశరథుఁడు పృథ్వీపతి తా
ధీరవరుఁడు తేజస్వియు
మూరి సురుచిరముగ నేలెఁ బురము నయోధ్యన్ 23.

కం. పాలించె నింద్ర సముఁడు నృ
పాలుఁ డయోధ్య దశరథుఁడు భవనముల నరుల్ 24.

వే లలర శుభమ్ముల ద్వా
రాలు దృఢపు గడియలఁ దనరంగ నయముగన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నాఱవసర్గము.

## బాలకాండము

## సర్గము 7.

దశరథుని యమాత్యుల గుణగణ వర్ణనము మఱియు రాజ్య వైశిష్ట్య వర్ణనము.

మ. ఛవిమద్దేహులు రాఘవేంద్రు సభ నిక్ష్వాకు క్షితీ శానుర
క్త వరామాత్యులు సద్గుణాన్వితులు మంత్రజ్ఞేంగితజ్ఞుల్ సత
మ్ము విశేషంపు హితంబుఁ గూర్పఁగఁ బ్రియంబుం జేయ నాసక్తులై
భువిఁ బాలింప సహాయులై నిలుతు రా భూనాథ మోదంబుగన్ 1.

తే.గీ. వీరుఁడు యశస్వి కతనికి విమలమతులు
మంత్రు లెనమండ్రురు పుడమి మగని పనుల
రక్తి సతము చెలఁగు వారు రాజభక్తి
నెఱపు వారు కలరు పురిని నరయంగ 2.

తే.గీ. వీరు ధృష్టి జయంతుఁడు విజయుఁ డను న
తండు సిద్ధార్థుఁ డర్థసాధకుఁడు మఱి య
శోకుఁడును మంత్రపాలుఁడు చొప్పడఁగ సు
మంత్రుఁ డష్టమమున నష్ట మంత్రు లయిరి 3.

ఆ.వె. ఇంక నితర మంత్రు లెలమి మర్యాద లం
దిరి వశిష్ఠ వామదేవు లనఁ బు
రోహితు లిరువురు గురువులై తనరుదురు
దశరథుండు కోర ధరణి సురులు 4.

ఉ. విద్యల యందు దిట్టలు ప్రవీణులు శాస్త్రచయమ్ము నందు వా
రాద్యులు కీర్తిమంతుల మహాత్ములు లజ్జ వహింత్రు హీన దు
ష్టోద్యమ కర్మ రాశి ధృఢు లుత్తమ చిత్త బలమ్ము నందు దు
ర్భేద్య నిజేంద్రియమ్ముల స లీల నియంత్రణ చేసి రింపుగన్ 5.

కం. చెప్పినదె చేయు వారలు
గొప్ప యశము తేజ మింక గురు సహనము లం
దొప్పెడు వారు ప్రణిహితులు
నెప్పుడు చిరునవ్వుల వచియింతురు సుమ్మీ 6.

ఉ. కోపము చేతఁ గాని మఱి కోరి ధనమ్మును గామ మెంచియే
నోప రసత్యపుం బలుకు నొక్కటి నెన్నఁడు వారు పల్కఁగం
బాపులు వైరు లింకఁ దమ పౌరులు చేసిన చేయు నట్టివౌ
యే పను లైనఁ జేయునవి యెల్లను వేగుల చేత విందురే 7.

కం. వ్యవహారమ్ములఁ గుశలులు
వివృత స్నేహమ్మున విరివి పరీక్షితులే
కవియ సమయము సుతుల నై
న విడవ రెన్నండు దండనము లిడ కుండన్ 8.

కం. బల కోశ సంగ్రహమ్ములఁ
గల దింపగు నైపుణమ్ము కరముగ దోష
మ్ములు లేక నరులఁ గడు నహి
తుల నైనఁ జలమున శిక్షితులఁ జేయ రిటన్ 9.

తే.గీ. వీరు లుత్సాహ వంతులు వినుత రాజ
శాస్త్ర పాలకులు సతము సజ్జనులను
దేశ వాసులను శుచులఁ దివిరి యుచిత
రీతి రక్షించు వారలె ప్రీతి తోడ 10.

తే.గీ. బొక్కసమ్ము నొప్పింపక భూసుర నృప
వర్గమును దమి నింతు రనర్గళమ్ము
తీక్ష్ణ శిక్షలు పరికించి తెల్లముగను 11.

బురుషుల బలాబలమ్ములు జరపు చుంద్రు

ఆ.వె. విమలు లేక బుద్ధి విషయమ్ము శాసింప
నగర మందు నైనను గురు దేశ
మందు నైనఁ గాంచ మెందు గాలించిన
నన్నృత వాదు లైన యట్టి జనుల 12.

కం. పరదార రతులు దుష్టులు
నరు లుండ రచట నిజమ్ము నగ రావళిలోఁ
బురవరము గూడి సకలం
పు రాష్ట్రము ప్రశాంత మలర మూరును సతమున్ 13.

ఆ.వె. వస్త్ర వేష గతుల వా రలరుచు శీల
వంతులు దశరథ నృపతి హితమ్ము
గోరి రాజతంత్ర కోవిదు లెల్లరు
జాగరూకు లౌచు సతము నుంద్రు 14.

ఆ.వె. పెద్దల గుణ చయము వీక్షించి కైకొని
విక్రమమున వినుత వీర వరులు
నెగడ స్వీయ బుద్ధి నిశ్చయమ్ము ప్రసిద్ధు
లన్నిటఁ బర భూము లందు భృశము 15.

చం. వినుతులు సంధి సంగర వివేకములందు ధరాతలమ్మునం
దనరుదు రెల్ల సంపదలఁ దాతల కాలము నుండి యింపుగన్
ఘనులు రహస్యపాలనను గమ్రు బుధానులు నీతికోవిదుల్
మినుకులు తియ్యనై చెలఁగు మీఱఁ బ్రియమ్ము విశుద్ధ చిత్తతన్ 16.

కం. ఇట్టి యమాత్యులు నిత్యము
చుట్టి కొలువ దశరథుఁడు వసుంధర నంతన్
దిట్టతనమ్మున సుగుణము
లుట్టిపడఁగఁ బాలనమ్మహో చేసెఁ దగన్ 17.

తే.గీ. చారుల వలన నెఱిఁగి ప్రజలను రంజి 18.

లంగఁ జేసి యధర్మము లయ మొనర్చి
ముజ్జగమ్ముల నుతికెక్కి భూమి నెల్ల
సత్య నిరతిఁ బాలించె దశరథ నృపతి

తే.గీ. తుల్యు లధికులు లేరు శత్రుచయ మందు
మిత్రు లెక్కువ హతులు నమిత్ర వరులు
వినయు లెల్ల సామంతులు విశ్వ మేలె
నింద్రుఁడు దివము వోలె నరేంద్రుఁ డడరి 19.

తే.గీ. నిజ హితార్థ నియుక్త స నిపుణతా స
మర్థ నిత్యాను రక్తులు మంత్రి వరులు
పరివృతమ్ముగ కాఁగ వెలిఁగెఁ బార్థివుండు
కిరణ నికరమ్ముల నుదయించు రవి వోలె 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 8.

అశ్వమేధ యాగాచరణ సంకల్పము.

ఉ. ఇవ్విధి సుప్రభావమున నేలు మహాత్మున కింక నక్కటా
నొవ్వు సుతార్థమై చెలఁగ నోఁచక సంతతి కింత కాలముం
జివ్వున వార్ధకమ్ము వడిఁ జేరువ కాఁగఁ దపింపఁ జిత్తమే
యవ్వసు ధాధినేతయె మహార్తిని నిల్చెను ధర్మ విజ్ఞుఁడే 1.

కం. చింతించు చుండ నివ్విధి
నంత మహాత్ము మది నొదవె నాలోచన మొ
క్కింత తడవున సుతార్థము
వంత దొలఁగ నశ్వమేధ వర మఖమునకై 2.

తే.గీ. శుద్ధ చిత్తులు మంత్రుల బుద్ధిమంతుఁ
డన్నృపతి సంప్రదించి ధర్మాత్ముఁడు తగ
నిశ్చయించి కర్తవ్య మని క్రతువు మది
సంతసమ్మది యుప్పొంగ నంత నడరి 3.

ఆ.వె. మంత్రి సత్తముఁడు సుమంత్రు తోడ ననియె
గురు పురోహితులను ద్వరిత గతి సు
మంత్ర! సర్వులఁ గడు మన్నన రప్పింపు
మని దశరథుఁ డంత నాదరించి 4.

తే.గీ. వేగ మేఁగి సుమంత్రుఁడు వేద విదుల
నెల్లర సుయజ్ఞ జాబాలు లింక వామ
దేవ కాశ్యపుల నవని దేవు లన్యు
లను బురోహితుఁడు వసిష్ఠుఁ దనరి తెచ్చె 5.

కం. రా గురుపురోహితాదులు
దా గరిమగ నర్చన లిడి దశరథుఁ డనియెన్
బాగుగ ధర్మార్థ యుతము
వాగమృతమ్ము సిలుకంగఁ బార్థివుఁ డంతన్ 6.

తే.గీ. సుతులు లేకున్న శూన్యము సుఖము శోక
కారణం బయ్యె నా కిది కాన నశ్వ
మేధ యాగమ్ము సలుపంగ మేలుగ మది
నెంచితిఁ బడయంగ సుతుల నంచితముగ 7.

ఆ.వె. శాస్త్ర కర్మ నిచయ సమ్మతముగఁ జేయ
నెంచితి నిఁక యాగ మంచితముగ
మీర లెల్లరు దయఁ దోరము చింతించి
కాంక్ష తీరు రీతిఁ గాంచుఁ డయ్య 8.

కం. వచ్చిన వసిష్ఠ ముఖ మును
లచ్చపు వాక్చయము లమ్మహాత్ముని గిరలన్ 9.

మెచ్చిరి సాధు తరం బీ
యిచ్చ యని వచించి రింక హిత మగు నంచున్

ఆ.వె. అంత నెల్ల రనిరి యద్ధరా సురులు సం
భార చయము వేగఁ బడయ వలయు
నీదు తురగ వరము నెమ్మి విడువ వలె
నంచు నద్దశరథు నరసి మునులు 10.

కం. పుత్రార్థము యాగ తలం
పాత్రమ్ముగ వచ్చు టెల్ల యవనీనాథా
పాత్రం బిచ్చా సిద్ధికిఁ
పుత్రప్రాప్తి యచిరమ్ము వొందుదు వార్యా 11.

కం. ప్రీతిల్లె నప్పలుకులు ద్వి
జాతు లనఁగ నాలకించి సంతోషముతో
భూతలనాథుఁ డమాత్య
వ్రాతమ్మును గాంచి పలికెఁ బన్నుగ నిట్లున్ 12.

మ. సమకూర్చుండు గురూక్త వస్తుచయ మా సంభార సందోహమున్
విమలాశ్వమ్ము పురోధ తోడుగను సద్వీరాళితోఁ బోవలెన్
కమనీయమ్ముగ యజ్ఞ భూమి సరయూ కచ్చమ్మునం గూర్చుఁడీ
క్రమ భంగిన్ శ్రుతి కర్మ సమ్మతముగం గల్పించుఁడీ శుద్ధులన్ 13.

ఆ.వె. దోషరహితమైనఁ దూల కష్టమ్ములు
నుత్తమంపు క్రతువు నుర్విఁ జలుప
సర్వు లింపు మీఱ నుర్వీపతులు శక్యు
లిందు నరయ లేదు సందియమ్ము 14.

తే.గీ. వెదకుదురు బ్రహ్మరాక్షసులు దమి దోష
ములు క్రతువున విద్వాంసులు పొడమ నించు
కైన జన్నము విధ్వంస మగును యాగ
కర్త నశియించుఁ దూర్ణము కలఁతఁ జెంది 15.

ఆ.వె. కాన నెవ్విధి నిది కాఁ గలదు పరిపూ
ర్ణమ్ము తద్విధముగఁ గ్రతువు జరుప
వలయుఁ దివిరి కార్యభార సమర్థులు
మంత్రివర్యు లార మాన్యు లార 16.

కం. అవనీశు వచనములు మం
త్రి వరులు విని గారవించిరి ముదము సెలఁగన్
సవినయము పల్కి రెల్లరు
నవు నానతి యిచ్చి నట్టు లన్నియు నంచున్ 17.

తే.గీ. విప్ర వరులు ధర్మజ్ఞులు క్షిప్రము నృపు
నంత నాశీర్వదించియు నానతిఁ గొని
వార లెల్లరు సాగిరి వారి వారి
నిలయములకు నానందము సెగడ సెదల 18.

తే.గీ. భూసురుల వీడి పతి మంత్రి ముఖ్యులఁ గని
తిరిగి యజ్ఞరాజమ్మును దివ్యముగను
వేద సమ్మతముగను ఋత్విజులు తేట
పఱచిన విధమ్ముగా జరుప వలె ననియె 19.

తే.గీ. పల్కియిట్టులు భూవరవ్యాఘ్రుఁ డంతఁ
జెంత నిల్చిన యా మంత్రి శేఖరులను
వీడుకొలిపి తేజోమయ వీరవరుఁడు
స్వీయ వేశ్మము సేసెఁ బ్రవేశ మడరి 20.

తే.గీ. చేరి యంతఃపురము రాజు స్వీయ పత్ను
ల నరసి హృదయప్రియలను లలిత రీతిఁ
బలికి పుత్రార్థ మధ్వర వరము సేయ
నెంచితి నని దీక్ష వహింపఁ బంచె సతుల 21.

ఆ.వె. భాసమాన మైన వచనమ్ములు వినంగ
కాంతిమంతము లగు నింతుల ముఖ
పద్మములు వెలింగె వర హిమాత్యయ కాల 22.

పంకజముల భంగి భాసురముగ

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నెనిమిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 9.

సుమంత్రుఁడు ఋష్యశృంగుని చరితమును దశరథునకు విన్నవించుట.

కం. ఇది యెల్లను విని సూతుం
డు దశరథుం గని యనియెఁ గడు నిగూఢముగం
గదిసి సుమంత్రుఁడు వినుఁడు క
ల దొక పురావృత్త మే నల వినినది తొలిన్ 1.

తే.గీ. మునుల యియ్యుపదేశము మున్ను నేను
విన్న యట్టి వృత్తం బగు నెన్నఁ బుడమి
మగఁడ! భగవానుఁడు సనత్కుమారుఁడు వచి
యించె నీ సుతాగమ కథ ఋషులు వినఁగ 2.

ఆ.వె. కశ్యపునకు సుతుఁడు కలఁడు విభండకుఁ
డన నతఁడు ప్రసిద్ధుఁ డవని ఋష్య
శృంగ నామ మడరఁ బృథ్వి జనించును
బుత్రుఁ డతనికిఁ గడు చిత్ర బుద్ధి 3.

చం. వనమున వృద్ధి సెందుచును బన్నుగ సన్ముని ఋష్యశృంగుఁడే
వనచరుఁడై ద్విజోత్తముఁడు పొడిగ పిత్రనువర్తనమ్మునం
దనరి సతమ్ము నుంటను దదన్య మెఱుంగఁడు బ్రహ్మచర్యముం
గను ద్వివిధమ్ములందుఁ ద్రిజగమ్ముల ఖ్యాతి వహించుఁ బార్థివా 4.

కం. సేవించుచుఁ బిత్రగ్నులఁ 5.

బావనముగ ఋష్యశృంగ వాచంయమనుం
డావన రాజుల నుండఁగ
వేవేగ గడచు సమయము వివశత్వమునన్

ఉ. ఈ సమయమ్ము నంద వసియించుఁ బరాక్రమి రోమపాదుఁ డన్
వాసి గలట్టి యంగపతి పాలన సేయుచు రాజకృత్యమౌ
దోసపుఁ గారణమ్మునను దుస్సహ వర్ష విహీనతం బురా
వాసులు వేఁగు వారలరు వారని భీతి నిరంత రార్తితో 6.

మ. తదనావృష్టి చెలంగ దుఃఖ పరితప్తస్వాంతుఁ డా రాజు సౌ
హృద విప్ర శ్రుతవృద్ధ ముఖ్యులను దా నింపార రప్పించి యో
విదులారా ఘన వేదవిజ్ఞులు జగద్విఖ్యాత లోకజ్ఞు లి
య్యది మీ రెల్ల రెఱుంగరే తగిన ప్రాయశ్చిత్తముం దెల్పరే 7.

చం. అను ధరణీశు వారు విని యందఱు బ్రాహ్మణ వేదపారగుల్
వినయముతో మహీశుఁ గని ప్రీతి వచింతురు ముక్తకంఠులై
తనరును ఋష్యశృంగుఁ డను తాపసి తాను విభండ కాత్మజుం
డని యని వానిఁ దీసికొని యంచిత రీతిని వచ్చు టొప్పగున్ 8.

చం. అవనిపతీ! సుసత్కృతుఁడు నా ముని సత్తము ఋష్యశృంగునిన్
సవినయ మానయించి శ్రుతి సంచయ పారగు నా విభండ కో
ద్భవు ధరణీసురప్రవరుఁ బన్నుగ నర్చన సేసి శాంత నీ
దు వరతనూజ నీఁ దగును దుష్టిని నా వచియింతు రెల్లరున్ 9.

చం. అన విని రోమపాదుఁడు మహాక్షితి పాలుఁడు మౌని నమ్మహా
త్ముని నిట కే యుపాయమునఁ దూర్ణము తే నగు శక్య మంచు చిం
తన నిజ మంత్రివర్గ సహిత మ్మొనరించి పురోహితోత్తముం
గని యను మౌనిఁ దేఁ జనుఁడు కౌశల మొప్పఁగ మంత్రియుక్తమై 10.

కం. నావిని మునిభీతాత్ములు
వే వినతులునై చెలంగ వేదన భరమై
భూవరునితో నశక్యతఁ
బోవ నటకు విన్నవింప మూరుదు రంతన్ 11.

కం. అన్యోపాయమ్ము న రా
జన్యా తే నగు మునీంద్రు సముచితరీతిన్
మాన్యుని మఱి దోషమ్ములు
శూన్యము లని నుడువుదు రొక శుభదాయకమున్ 12.

తే.గీ. అంగరాజు పంపుననను వారాంగనా ని
చయముచేఁ దేఁబడఁగ మునిచంద్రు డింద్రు
డొసఁగు వర్ష మెలమి శాంత నొసఁగు ఋష్య
శృంగునకు సంతసమ్ము న నంగవిభుఁడు 13.

ఆ.వె. ఋష్యశృంగుఁ డల్లుఁ డినకులేశ! పడయఁ
జేయు నీకు సుతుల నీయ దెల్ల
ముని సనత్కుమారుఁ డనిన యట్టిద రాజ
చెప్పితి విని నట్టి చిత్రగాథ 14.

ఆ.వె. అంత సంతసించి యా దశరథుఁడు సు
మంత్రుఁ గాంచి బదులు మాట పలికె
నిట్లు విస్తరముగ ఋష్యశృంగ మునినిఁ
దెచ్చిన విధ మెల్లఁ దెల్పు మిపుడు 15.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ దొమ్మిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 10.

శాంతా ఋష్యశృంగుల వివాహము.

తే.గీ. రా జడుగఁగఁ దనను వివరమ్ము లెల్లఁ
బలికె నిటు సుమంత్రుఁ డమాత్య వరులఁ గూడి 1.

వినుము రాజేంద్ర యెవ్విధి విప్రవరుఁడు
ఋష్యశృంగుఁడు తేఁబడె నెలమి నటకు

ఉ. అంతఁ బురోహితుండు సచివావలి తోడుత రోమపాదు ధీ
మంతునిఁ గాంచి పల్కెను సమంచితమున్నిరపాయమున్ విభూ
చింత యొకండు చిత్తమునఁ జెన్నుగ మాకు స్ఫురించె నిత్తరిం
జెంతకు మౌనిసత్తమునిఁ జేర్చు సుమార్గము సత్వరమ్ముగన్ 2.

చం. సతము వనమ్ములం దిరుగు సంయమి చంద్రుఁడు ఋష్యశృంగుఁడే
కృతమతి సంతతాధ్యయన కృత్యము లందుఁ దపో రతుండు దా
నతివల నేరఁ డెన్నఁడు సుఖాతిశయమ్ములు వొందఁ డెట్టివిన్
వితత గుణాభిశోభితుఁడు ప్రీతి చరించును దండ్రి చెంతనే 3.

ఆ.వె. నరుల చిత్తములను హరియించు నింద్రి యా
ర్థములఁ దెత్తు మింకఁ దాపస సుతుఁ
బురమునకు మునీంద్రు భూపాల! క్షిప్రమ్ము
నెంచి దీని నిశ్చయింప వలయు 4.

తే.గీ. భూష ణాలంకృతలు వారయోష లుచిత
రీతి సమ్మానితలు నేఁగి లీల లలర
వివిధ గతులఁ బ్రలోభములు విరివి కురి
యించి తెత్తు రిచ్చోటికి నింతు లంత 5.

ఉ. ఆ నృపతీంద్రుఁ డారసి నిజాత్మ ననుజ్ఞ నొసంగె నొజ్జకున్
దాన ముదమ్ము నొంది మదిఁ దత్క్షణ మట్టుల నొజ్జ మంత్రులే
యానతి నీయ వారవని తావలి చేరి వనమ్ము క్షిప్రమున్
మానిత తాపసాశ్రమము మౌనిఁ గనుంగొన నిల్చె దాపునన్ 6.

చం. పితృవరు నాశ్రమమ్మున నపేతుఁడు కాడట విక్రమించి మో
దితుఁ డనిశమ్ము మిక్కిలి యతిప్రవరుండు భవంపు టాదిఁ దా
నతివల నైనఁ బూరుషుల నన్యులఁ గాంచి యెఱుంగఁ డెన్నడుం
బ్రతివసథాది పట్టణ వరప్రభ వాదుల ఋష్యశృంగుఁడే 7.

కం. యాదృచ్ఛిక మొక దినమున
నా దరిఁ జేరెను విభండ కాత్మజుఁ డా శా
తోదరులఁ గూడఁ గాంచెను
వేదాధ్యయనుండు వింత వెలయాళులనే 8.

కం. చిత్రాతి వేషలు మధుర
గాత్రలు తీయంగఁ బాడు కాంతా మణులే
యాత్రముగఁ గదిసి తాపస
పుత్రుని నా ఋష్యశృంగు మురిసి యని రిటుల్ 9.

కం. ఎవ్వర వీవు ధరణిసుర
యివ్వనమున నేల యుంటి విట్లొంటరిగా
నొవ్వక యించుక ఘోరం
బివ్విపిన మ్మెఱుఁగ వలతు మేమిఁకఁ జెపుమా 10.

కం. మును గనని యిష్ట రూపల
వనితామణులఁ దిలకింప వనమున నంతన్
జనియించె బుద్ధి స్నేహ
మ్మున నిజ జనకు నెఱిఁగింప ముని తనయునకున్ 11.

కం. నా తండ్రి విభండక ముని
యాతని కౌరస సుతుండనై తనరుదు వి
ఖ్యాతుండ ఋష్యశృంగ పు
నీ తాఖ్యను గర్మమునను నిత్యం బవనిన్ 12.

కం. చేరువనం గల దాశ్రమ
మో రూపసులార మాది యుక్తపు రీతిన్
మీరలు నా నొనరుచు స
త్కారమ్ముల నటఁ గొనుండు కమనీయముగన్ 13.

కం. విని ఋషిసుతు భాషణములు
వనితలకుం జూడ నిచ్చ వఱలన్ హృదులం
జని రెల్ల రంత నాశ్రమ 14.

మున కాతనిఁ గూడి వారు ముదమారంగన్

కం. కదిసిన నర్చించి యతం
డిది మా యర్ఘ్యమ్ము పాద్య మిది యని యనుచుం
బదపడి ఫల మూలమ్ములు
ముదితల కెల్లర కొసంగె ముని సుతుఁ డెలమిన్ 15.

కం. ఉత్సాహమ్మునఁ గైకొని
తత్సుందరు లర్చలు ముని తనయుం డీయం
దత్సంయమి భీతిని గమ
నోత్సాహ లయి యని రిట్టు లుచితపుఁ బలుకుల్ 16.

చం. అవనిసురేంద్ర యున్నవి ఫలాదులు మా కడ భద్రమౌను నీ
కివి గొనుమా భుజింపు వడి నింపుగ నిట్లని కౌఁగిలించి వా
ని వనిత లిచ్చి రెల్లరును నీరజనేత్రలు మోదకాదులౌ
వివిధము లైన భక్ష్యములు పెక్కులు చిత్ర విచిత్రముల్ రహిన్ 17.

కం. వన నిత్య సన్నివాసుఁడు
మును పెన్నఁడు తిననివి ఫలముల నా భావిం
చెను దేజస్వి భుజించి త
మిని మునిపుత్రుండు సంయమివరేణ్యుండే 18.

కం. అతని పితృ భీతి వనితలు
వ్రతచర్య మొకటి దెలిపి కపటపుం బగిదిన్
ధృతి ఋష్యశృంగ ముని స
మ్మతిఁ గైకొని యంచితముగ మరలిరి వేగన్ 19.

ఆ.వె. ఏఁగ వారకాంత లెల్లరు నవ్విధిఁ
గాశ్యపాత్మజుండు వశ్యుఁ డయ్యె
హృదయ తాపమునకుఁ గృశియించె దుఃఖాతి
శయమున వనమున భృశమ్ము నకట 20.

చం. కలవర మంది చిత్తమునఁ గాంతి మదంగి ది నాపరమ్మునం 21.

జెలువపు వారకాంతలను జెన్నుగఁ జూచిన దేశ మేఁగ నా
లలనల మౌనిపుత్రుఁడు విలాస విహారలఁ గాంచె నంత వా
రలుఁ గని వాని హర్షమున రాములు చేరి వచించి రిట్టులన్

తే.గీ. సౌమ్య! విచ్చేయుమ కరుణ రమ్య మైన
యట్టి మా యాశ్రమమునకు నచ్చ టిత్తు
మతి విశేషపు టాతిథ్య మనఘు నీకు
నాఁ దపసి సమ్మతించెఁ జనంగ రహిని 22.

కం. కొనితేర నమ్మహాత్ముని
వనితలు నగరమ్ముఁ గురిసెఁ బర్జన్యుఁడు బో
రున వర్షము హర్ష మొదవ
జనులకు నంగ విషయమున సత్వర మంతన్ 23.

కం. వర్షముతో నరుదెంచ మ
హర్షి సుతుఁడు ఋష్యశృంగుఁ డన్నర పతియే
హర్షమ్మున నెదురేఁగియు
శీర్షము వంచి ప్రణతు లిడె శీఘ్రమ మునికిన్ 24.

తే.గీ. అర్ఘ్య పాద్యాదు లొసఁగి న్యాయ విధిని సు స
మాహితుఁ డయి పూజించెను మాన్య మునిని
విప్రు నడిగెఁ బ్రసాదము విప్రు వలని
కోపము వడయమికి నంత భూపవరుఁడు 25.

కం. అంత నతనిఁ గూడి నృపతి
యంతఃపురమున కరిగి నిజాత్మజ శాంతం
గాంతామణిని యథావిధి
సంతోషమ్ముగ నొసంగి సంతస మందెన్ 26.

ఆ.వె. ఇవ్విధముగ శాంత నింతినిఁ గూడి తే
జోమయుండు వఱలుచు సకలమ్ము
లైన భోగతతుల నర్చితుండు వసించె
ఋష్యశృంగుఁ డచట హృష్టుఁ డగుచు 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదియవ సర్గము.

# బాలకాండము

## సర్గము 11.

దశరథుఁడు ఋష్యశృంగుని భార్యా సమేతముగ నయోధ్యా నగరమునకుఁ దోడ్కొని వచ్చుట.

తే.గీ. ఇంకను వినుము రాజేంద్ర హితము లైన
పల్కులు సనత్కుమారు దేవప్రవరు వ
చనము లివి వినిపింతు నం చనియె నా సు
మంత్రుఁడు దశరథుని తోడ మంత్రివరుఁడు 1.

కం. ఇక్ష్వాకు వంశజాతుఁడు
నిక్ష్వాభ వచన దశరథుఁ డిల ధార్మికుఁడున్
బిక్ష్వాలి విధేయుండు తి
తిక్ష్వాత్మ కృత ప్రతిశ్రుతి వెలయును భువిన్ 2.

సీ. కలుగు స్నేహమ్ము భూకాంతున కంగధవుఁడు రోమపాదుతో నడరి కరము
శాంత యను తనయ చారునేత్ర కలుగు నా యంగ రాజున కమల చరిత
రోమపాదుఁ గదిసి యా మహీనాథుఁడు ధర్మాత్మ యే నపుత్రకుఁడ వంశ
వృద్ధికిఁ గోరుదుఁ బేర్మి శాంతాపతి నీదు నాజ్ఞఁ గ్రతువు నెరప నాకు
తే.గీ. నన విని యొకయింత తలంచి యంగవిభుఁడు
చిత్త మందు శాంతాపతి నుత్తమ ముని
నీయ నా మహాత్ముఁడు స్వీకరించి క్రతువు
దశరథుండు గావించు ముదమ్ము మీఱ 3.

మ. యజియింపం దపియించు రాఘవుఁడు హస్తాబ్జమ్ములన్ మోడ్చి యా
ద్విజ వంశాగ్రణి ఋష్యశృంగు నయ సంపేదుండు సెన్నుం దమిన్ 4.

నిజ పుత్రార్థ మెడందఁ గోరి దివ సాన్నిధ్యమ్ము యజ్ఞార్థమున్
విజయుం డౌను ఫలింప వాంఛితము లా విప్రేంద్రు కృత్యమ్ములన్

కం. నలువురను లోక విఖ్యా
తుల నైక్ష్వాకుఁడు వడయును దుర్జయ సుతులం
గుల వర్ధన కారకుల న
తుల విక్రమ వీరుల నతి తుష్టాత్ముండై 5.

ఆ.వె. మున్ను కృతయుగమున నన్నలువ సుతుండు
ఋషి సనత్కుమారుఁ డెలమిఁ బలికె
నీ వచనము లెల్ల దేవ వరేణ్యుఁడు
పుణ్య జనుల నగ్రగణ్యుఁ డిట్లు 6.

చం. బలములతో స్వయమ్ముగ నృపాలవరా చని చక్కనైన తే
రుల ముని గారవించి కొమరుం గొని రమ్మధిపా యనంగఁ దా
నల గురు సమ్మతిం గొని నిజాంగనలన్ సచివాళిఁ గూడి య
త్తలమున కేఁగఁ జాగె నెటఁ దాపసి యుండెనొ దార యుక్తమై 7.

ఉ. చేరెను దాటి మెల్లఁగను జిత్ర వనమ్ములు వాహినీతతుల్
భూరమణుండు దేశమును భూసుర ముఖ్యుఁడు నిల్చు చోటునుం
జేరిన రోమపాద పతి చెంతను గాంచెను దొల్త నంత భ
ట్టారకు ఋష్యశృంగుఁ బ్రకటమ్ముగ వహ్నిసమాను విప్రునిన్ 8.

తే.గీ. అంగ భూపతి దశరథు నాత్మ సఖునిఁ
గాంచి ముదితాత్ముఁడై గౌరవించి యంచి
తముగ ముని పుత్రునకుఁ దెల్పెఁ దమ చెలిమియుఁ
జుట్టరికముఁ బూజించె రాజు నతఁ డంత 9.

కం. ఇవ్విధి సత్పూజితుఁడై
యవ్వల్లభుఁ డుండి కతిపయ దినమ్ముల్ దా
నవ్వసుధాధిపు తో ననె
నివ్వచనము లాదరమున హిత వాంఛితముల్ 10.

చం. నరవర శాంత నీదు సుత నాథ సమేతము నాదు వీటికిం
గరుణను బంపఁ గోరెదను గార్య విశిష్ట మొకండు నుండె నా
గిరలను సమ్మతించి మది గీష్పతి సన్నిభు ఋష్యశృంగుఁ దా
నరసి వచించె నేఁగుఁ డని యచ్చటి కింతినిఁ గూడి మామయే 11.

కం. అట్టులె యని విని యా ముని
పట్టి నృపతి భాషణములు పన్నుగ నా భూ
రాట్టు ననుమతిం గొని సమ
కట్టెఁ బ్రయాణమున కంతఁ గాంతా యుతమున్ 12.

తే.గీ. అలరి దశరథ రోమపాదు లుభయులు ప
రస్ప రాంజళు లొనరించి రక్తి సెలఁగ
వీర్య వంతులు స్నేహమ్ము విరియ కౌఁగి
లించికొని సంతసించిరి యంచితముగ 13.

కం. చెలికాని సెలవు గొని పౌ
రులకు నిజాగమమునుం దెలుప రఘునాథుం
డలరి యనిపి ఘన శీఘ్ర చ
రుల దూతల నాజ్ఞ లొసఁగి రూఢిగఁ దరలెన్ 14.

తే.గీ. పుర మలంకరించుఁడి యందముగను సిక్త
మై సురుచిర మలర వలె భాసురముగ
ధూపములు దనర వలె వీథుల భృశమ్ము
నెగుర వలెఁ బతాకమ్ములు నగర మందు 15.

ఆ.వె. రాజురాక నెఱిఁగి రాజు నుడివి నట్లు
సంతసించి పౌరు లంతఁ జేసి
రా పురమ్ము రమ్య మైన యలంకర
ణమ్ము లెల్ల నలరె నగర మందు 16.

తే.గీ. విప్రవరు నుంచి ముందు భూవిభుఁడు నగర
మునఁ బ్రవేశించె సుందరముగ నలంకృ
తమ్ము శంఖ దుందుభి నినదమ్ము లలర 17.

మానిత ద్విజుఁ గని పొంగె నా నగరము

తే.గీ. అంతిపురమున విప్రేంద్రు సంతసమున
శాస్త్ర రీతిఁ బూజించి దశరథుఁడు మన
మందు నెంచెను గృతకృత్యుఁ డంచుఁ దన్ను
దీసికొని రాఁగ నిచటకు దేవ సముని 18.

తే.గీ. శాంత నంతఃపుర విమల కాంత లరసి
రాఁగ నిజభర్త తోడుత రమ్య నయన
స్నేహ భావ మలరఁగ విశేషముగను
బొంది రానందము మనము లందు భృశము 19.

ఆ.వె. శాంత యాదరింపఁ గాంత లందరు రాజు
ముఖ్యముగ నట సుఖముగ వసించెఁ
గొంత కాల మడరి కువలయాక్షి తనదు
భర్త లాలనమున భద్రముగను 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదునొకండవ సర్గము.

## బాలకాండము

## సర్గము 12.

దశరథుఁడు ఋష్యశృంగుని యాధ్వర్యమున యజ్ఞ సమాచారణము నిర్దేశించుట.

కం. అంతటఁ గొన్ని దినముల వ
సంతర్తువు రాఁగ నవనిఁ జారుతరము భూ
కాంతునకుఁ బుట్టె మనమున
సంతునకై బుద్ధి యింక జన్నము సేయన్ 1.

కం. అమరప్రభా నిభ మునిని
సమంచిత శిరో నతు లిడి జరిపింపఁగ జ
న్నము వేఁడుకొనియె సంతా
నమునకుఁ గుల వృద్ధికి రఘునాథుం డెలమిన్ 2.

ఆ.వె. అట్టులె యని విరివి యర్చితుండు ననె సం
భార చయము వేగఁ బడయ వలయు
నీదు తురగ వరము నెమ్మి విడువ వలె
నంచు నద్దశరథు నరసి ద్విజుఁడు 3.

ఆ.వె. మంత్రి సత్తముఁడు సుమంత్రు తోడ ననియె
గురు పురోహితులను ద్వరిత గతి సు
మంత్ర! సర్వులఁ గడు మన్నన రప్పింపు
మని దశరథుఁ డంత నాదరించి 4.

తే.గీ. వేగ మేఁగి మంత్రివరేణ్య! వేద విదుల
నెల్లర సుయజ్ఞ జాబాలు లింక వామ
దేవ కాశ్యపుల నవని దేవు లన్యు
లను బురోహితుఁడు వసిష్ఠుఁ దనరి తెమ్ము 5.

ఆ.వె. వేగ మేఁగి మంత్రి విప్రుల నెల్లర
సకల వేద విదుల సంతరించి
తెచ్చె వడి సుమంత్రుఁ డచ్చోటున కలర
దశరథుండు కరము ధరణి విభుఁడు 6.

కం. రా గురుపురోహితాదులు
దా గరిమగ నర్చన లిడి దశరథుఁ డనియెన్
బాగుగ ధర్మార్థ యుతము
వాగమృతమ్ము సిలుకంగఁ బార్థివుఁ డంతన్ 7.

తే.గీ. సుతులు లేకున్న శూన్యము సుఖము శోక
కారణం బయ్యె నా కిది కాన నశ్వ 8.

మేధ యాగమ్ము సలుపంగ మేలుగ మది
నెంచితిఁ బడయంగ సుతుల నంచితముగ

ఆ.వె. శాస్త్ర కర్మ నిచయ సమ్మతముగఁ జేయ
నెంచితి నిఁక యాగ మంచితముగ
నిమ్మని సుతు కరుణ సమ్మదముగ నేను
కాంక్ష లన్ని దీరఁ గాంచు వాఁడ 9.

కం. వచ్చిన వసిష్ఠ ముఖ మును
లచ్చపు వాక్చయము లమ్మహాత్ముని గిరలన్
మెచ్చిరి సాధు తరం బీ
యిచ్చ యని వచించి రింక హిత మగు నంచున్ 10.

ఆ.వె. అంత ఋష్యశృంగుఁ డాదిగ ద్విజులు సం
భార చయము వేగఁ బడయ వలయు
నీదు తురగ వరము నెమ్మి విడువ వలె
ననిరి యద్దశరథు నరసి మునులు 11.

కం. పుత్రార్థం బిష్టి తలం
పాత్రమ్ముగ వచ్చు టెల్ల నవనీనాథా
పాత్ర మవశ్యము నల్వుర
పుత్రుల విక్రముల నెమ్మి వొందఁగ నార్యా 12.

కం. ప్రీతిల్లె నప్పలుకులు ద్వి
జాతు లనఁగ నాలకించి సంతోషముతో
భూతలనాథుఁ డమాత్య
వ్రాతమ్మును గాంచి పలికెఁ బన్నుగ నిట్లున్ 13.

మ. సమకూర్చుండు గురూక్త వస్తుచయ మా సంభార సందోహమున్
విమలాశ్వమ్ము పురోధ తోడుగను సద్వీరాలితోఁ బోవలెన్
కమనీయమ్ముగ యజ్ఞ భూమి సరయూ కచ్చమ్మునం గూర్చుఁడీ
క్రమ భంగిన్ శ్రుతి కర్మ సమ్మతముగం గల్పించుఁడీ శుద్ధులన్ 14.

ఆ.వె. దోషరహితమైనఁ దూల కష్టమ్ములు
నుత్తమంపు క్రతువు నుర్విఁ జలుప
సర్వు లింపు మీఱ నుర్వీపతులు శక్యు
లిందు నరయ లేదు సందియమ్ము 15.

తే.గీ. వెదకుదురు బ్రహ్మరాక్షసులు దమి దోష
ములు క్రతువున విద్వాంసులు వొడమ నించు
కైన జన్నము విధ్వంస మగును యాగ
కర్త నశియించుఁ దూర్ణము కలఁతఁ జెంది 16.

తే.గీ. కాన నెవ్విధి నిది కాఁ గలదు పరిపూ
ర్ణమ్ము తద్విధముగఁ గ్రతువు జరుప
వలయుఁ దివిరి కార్యభార సమర్థులు
మంత్రివర్యు లార మాన్యు లార 17.

కం. అవనీశు వచనములు మం
త్రి వరులు విని గారవించిరి ముదము సెలఁగన్
సవినయము పల్కి రెల్లరు
నవు నానతి యిచ్చి నట్టు లన్నియు నంచున్ 18.

తే.గీ. విప్ర వరులు ధర్మజ్ఞులు క్షిప్రము నృపు
నంత నాశీర్వదించియు నానతిఁ గొని
వార లెల్లరు సాగిరి వారి వారి
నిలయములకు నానందము నెగడ నెదల 19.

తే.గీ. భూసుర వరు లెల్లరు నేఁగఁ బుడమి ఱేఁడు
నెంత నిల్చిన యా మంత్రి శేఖరులను
వీడుకొలిపి తేజోమయ వీరవరుఁడు
స్వీయ వేశ్మము సేసెఁ బ్రవేశ మడరి 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బండ్రెండవ సర్గము.

# బాలకాండము

## సర్గము 13.

దశరథుని యాదేశానుసారము వసిష్ఠమహర్షి యావాసాన్నపానాది కార్యములు దగిన వారిచేఁ జేయించి సుమంత్రునిచే సకల రాజన్యులను రావించి ఋష్యశృంగునిఁ గూడి రాజుచే యజ్ఞారంభము సేయించుట.

కం. తిరిగి వసంత మడుగిడినఁ
బరిపూర్ణం బాయె నొక్క వత్సర మంతన్
ధరణీశుఁడు పుత్రార్థము
నరిగెం దమి నశ్వమేధ యాగస్థలికిన్ 1.

కం. ప్రణుతించి వసిష్ఠు ద్విజు ధ
రణిపతి పూజించి యాదరమ్మున నసె భా
షణములు వినయమ్మున సుత
గణార్థమై చెలఁగ శ్రవణ కమనీయముగన్ 2.

తే.గీ. వివిధ భాగమ్ము లందును విఘ్నము లవి
కలుగని విధమ్ము నింక నుక్తంపు రీతి
బ్రాహ్మణశ్రేష్ఠ! యీ యజ్ఞ రాజముం జ
లుపుఁడు మునిపుంగవా సత్కరుణ వహించి 3.

ఆ.వె. ప్రియతమ సఖులరు వరిష్ఠ గురువులరు
మీరు మునివరేణ్య! గారవముగ
నుద్యమించి నట్టి హృద్యంపు టియ్యాగ
భార మూనఁ గలరు మీర మాన్య 4.

కం. నా విని పల్కె మునీంద్రుఁడు
నీ వచియించిన విధమ్ము నే నొన రింతున్
భూవర సకలము చక్కఁగ
నా వల్లభ మేధ యాగ మలరింపంగన్ 5.

మ. పనిచెన్ సంయమి విప్రులం గ్రతువులం బ్రావీణ్యులన్ వాస్తు వి
ద్యను నైపుణ్యుల వృద్ధ ధార్మికుల శిల్పాచార్యులన్ వర్ధ కా
లిని( గర్మాంతిక నాట్య నర్తక తతిన్ లెక్కించు మర్త్యాళిఁ గూ
ర్పను వేవే లిటికల్ నివేశనములం బ్రాప్తింప నాయా పనుల్ 6.

తే.గీ. ఖనికుల శుచుల రాజశాసనము నాచ
రింప శాస్త్రవిదులఁ బెక్కు లెలమి చదివి
నట్టి వారి నన్యుల నిల్పె యజ్ఞ కర్మ
ము లొనరింప యథోక్తము మునివరుండు 7.

సీ. భక్ష్యాన్న పానీయ బహుళమ్ముగ ద్విజాలయమ్ములు వలయు శతాధికములు
పౌరజనులకును వసతు లిచ్చలు దీర భక్ష్యాలి నింపుగ వలయుఁ గూర్ప
జానపదులకును జక్కటి యన్నము ప్రీతి నీవలె సుంత వెలితి లేక
సర్వవర్ణ జనుల సముచిత రీతిని సత్కరింప వలె రోషమ్ము వీడి
తే.గీ. క్రతువు పనుల విరివి నిమగ్న మయి నట్టి
వారి శిల్ప్యాదుల విశేష గౌరవమ్ము
న నరయఁ దగు వారిని భోజన ధన దాన
ములఁ దనుప వలె విస్తృతముగ సతమ్ము 8.

తే.గీ. లోప మించుక లేకయు నే పగిది ని
వి నెఱవేరు నవ్విధిఁ జేయఁ బ్రీతి చిత్త
మునఁ దొడఁగుఁడు మీ రెల్లరు ముదము మీఱ
నాఁ బలుక వసిష్ఠుఁడు బ్రాహ్మణ ప్రవరుఁడు 9.

తే.గీ. కూడి యంద ఱనిరి వారు కొఱత లేక
యన్ని విహిత రీతి జరుగు నంచు నా వ
సిష్ఠు తోడఁ జేయుదుము నీ చెప్పి నట్లు
కించపఱుపము దేనినిఁ గొంచె మైన 10.

ఉ. అంత సుమంత్రు మంత్రివరు నాదర మొప్పఁగఁ బిల్చి మౌని సా
మంతుల ధార్మి కాన్య వర మానవ నాథుల విప్ర రాజ ధీ
మంతుల వైశ్య శూద్ర జన మండలినిం బర పౌర కోటి దే 11.

శాంతరులన్ సగౌరవము నందఱఁ బిల్వఁగఁ బంచె నింపుగన్

మ. మిథిలేశుండు పరాక్రముండు జన సంప్రీతుండు వేదాంత సం
ప్రథితజ్ఞానుఁడు సత్యవిక్రముఁడు శాస్త్రవ్రాత విద్వాంసుడుం
బృథివీ నాథుని పూర్వబాంధవుఁడు సంవేద్యంబ పుణ్యుండు స
త్పథసంచారి స్వయమ్ము నాతనిని సంభావించి పిల్వం దగున్ 12.

కం. ప్రియతము సతత ప్రియ వచ
న యుక్తుఁ గాశీ పురేశు నరపాల సఖున్
నయ రీతి స్వయమ్ముగ నీ
వ యరిగి పిలువం దగును మహాత్మా యిటకున్ 13.

కం. రాజేంద్రుమామ కేకయ
రాజు సుతుల తోడ నప్పరమ ధార్మికునిం
బూజార్హు స్వయం బిచటకు
భాజనముగఁ దోడితెమ్ము బాంధవ వృద్ధున్ 14.

తే.గీ. రాజ సింహుని మిత్రుండు పూజనీయుఁ
డంగ రాజేంద్రుని యశస్వి నాదరమున
రోమపాదు నిఁక సుమంత్ర నీమ మెంచి
తోడ్కొని వడి రావలయును వేడ్క మీఱ 15.

తే.గీ. భానుమంతునిఁ గోసల ప్రభువు నాద
రమున మగధాధిపతి విశారదుఁడు సకల
శాస్త్ర తతులఁ బ్రాప్తిజ్ఞుఁడు సత్పురుషుని
సత్వరముగ నాహ్వానింపఁ జాగ వలెను 16.

తే.గీ. సింధు సౌవీర సౌరాష్ట్ర సేవ్య ధరణి
పతులఁ బ్రాచీన దక్షిణ పార్థివేంద్రు
లన్య పృథివీ పతుల బాంధ వానుచరుల
యుతము వేగఁ బిలువ వలయుఁ బలువురను 17.

కం. వినియా వసిష్ఠ వాక్యము 18.

లను బంచెఁ బురుషుల నంత రాజులఁ దోడ్తో
డను దోడ్కొని తేర సుమం
త్ర నామ సూతుండు మంత్రి త్వరితుం డౌచున్

కం. తనరి మునిచంద్రు నానతిఁ
జనె రయముగ ధర్మరతుఁడు స్వయముగ నా జే
లను దోడ్కొని తేర నటకు
మన మలర సుమంత్రుఁ డంత మంత్రి వరుండే 19.

తే.గీ. అంతఁ గర్మకారులు వార లందఱు సని
యా వసిష్ఠున కెఱిఁగింప నపుడు యజ్ఞ
మునకు వారు సేసిన దంతయును మునీంద్రు
నకు ముదమ్ముగ హర్షమునఁ బలికె ముని 20.

తే.గీ. ఈయ రా దగౌరవమున నించు కేని
యుఁ బరిహాసమున కయిన నొకటి జరిగి
న నటులం జెఱచు వడి దాత నది సంది
యమ్ము లేదిందు సెల్లరు నమ్మవలయు 21.

కం. పయనించి యహర్నిశ లల
రి యయోధ్యాపతికి నీయఁ బ్రీతి బహుమతుల్
రయముగ రత్నాదులను గొ
ని యేఁగుదెంచి రటకు ధరణిపతుల్ హితులున్ 22.

ఆ.వె. సంతసించి యంత క్ష్మాపతి కనియె వ
సిష్ఠుఁడు నరసింహ! చేరి రిటకు
నీదు శాసనమున నృప పుంగవులు సత్క
రించితిని యథార్హ మంచితముగ 23.

తే.గీ. పురుషు లెల్ల స్థిరమతిఁ జేసిరి నృపవర!
యజ్ఞ కార్యము లన్నియు నాజ్ఞ నీదు
యాగ వాటిక కింపుగ నేఁగుదెంచి
పురుష శార్దూల యజియింపఁ బూను మింక 24.

తే.గీ. సకల వస్తు సంపన్నము సర్వ కామ
సంయుతమ్ముగ సద్బుద్ధిఁ జక్కఁగ నొన
రించిరి మనసు పెట్టి సమంచితముగ
నోజ వీక్షింప నొప్పును రాజచంద్ర 25.

తే.గీ. ఋష్యశృంగ వసిష్ఠ మునీంద్రు లిరువు
రి వచనము లాదరించి యంత వసుధాధి
పతి శుభదిన నక్షత్రములు తిలకించి
యాగ వేదిక కరుదెంచె హర్ష మొదవ 26.

ఆ.వె. అంత నవని సురులు యజ్ఞ మారంభించి
రట వసిష్ఠ సంయ మాదు లలర
ఋష్యశృంగ తాప సేంద్రుఁడు మునుముందు
భాసురముగ నిల్చి పావనుండు 27.

కం. చని రెల్లరు యజ్ఞస్థల
మునకు యథా విధిని శాస్త్రములు సెప్పిన రీ
తిని భార్యా సహితము దీ
క్షను గైకొనె దశరథుండు సంతోషముగన్ 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదుమూడవ సర్గము.

# బాలకాండము

# సర్గము 14.

దశరథుని అశ్వమేధ యాగాచరణము.

కం. కడవ నొక యేఁడు గుఱ్ఱ
మ్మడుగిడ తిరిగి సరయూ మహానది తటినిం 1.

బుడమి దొర దశరథుఁడు దాఁ
దొడఁగెను జన్న మొనరింపఁ దూర్ణము భక్తిన్

కం. ముందుంచి ఋష్యశృంగుని
నందఱు విప్రులు తురంగ యజ్ఞమ్మున నా
నందముగ దశరథ మహా
త్ముం దనుపఁగఁ గ్రతువు సేయఁ దొడఁగిరి యంతన్ 2.

తే.గీ. యాజకులు వేదపారగు లోజ శాస్త్ర
సమ్మతముగ యథావిధిఁ జలుపు వారు
న్యాయ సమ్మత కర్మ చయమ్ము లుచిత
రీతి వైభవమ్ముగఁ బతి బ్రీతి నంద 3.

తే.గీ. ఆగమ విధిఁ బ్రవర్గ్యము నాచరించి
యట్టుల నుపసద మను కార్యము నొనర్చి
నియమము లనుసరించియు నయముగ నిత
రమ్ము లొనరించిరి కడు శాస్త్ర విహితములు 4.

మ. ఉదయంబం దొనరించు కార్యముల నుద్యోగించి యన్యంబులౌ
విదిత క్రత్వధికమ్ము లూని సురలం బ్రీతిల్ల నర్చింప స
మ్మద చిత్తమ్ముల మౌనిపుంగవులు సోమమ్మా నరేశుండు పిం
డఁ దగం జక్కఁగ నయ్యె సైంద్ర మిడఁ దోడన్ దివ్య మాధ్యాహ్నముల్ 5.

కం. సాయంసమయపు సోమము
సేయ ధరేశుం డనఘుఁడు చెలువము మీఱన్
పే యవనీసురులున్ శా
స్త్రీయమ్ముగఁ జేసిరి క్రతుశేషము లెల్లన్ 6.

తే.గీ. ఋష్యశృం గాదు లింద్ర సహిత మమరుల
కంత నాహ్వాన మందించి రలరి మంత్ర
యుక్త శిక్షాక్షరములు యథోచితముగఁ
బలికి మధురమ్ముగ సభక్తి పరమ మునులు 7.

ఆ.వె. మధుర లలిత గీత మంత్ర గానముల నా
మంత్రణమ్ముఁ దమి నమరులఁ జేసి
హోత లిచ్చి రంతఁ బ్రీతి హవిర్భాగ
ములు సకల సురులకుఁ బూజ సేసి 8.

కం. హుతముల హుతమ్ముఁ కానిది
వెతక నరయ మెందు లేదు వెడ జాటిన దే
ది తనరె నెల్ల శ్రుతి గిరల
నతి భద్రము జరపి రలరి యజ్ఞము విప్రుల్ 9.

కం. అలసిన వాఁ డైనను నా
కలిం గుములు వాఁ డహములఁ గనిపింపఁడు శి
ష్యులు వందలు లేని చదువ
రులు కాని ద్విజు లగపడరు లోచనములకున్ 10.

ఉ. తిందురు బ్రాహ్మణోత్తములు తిందురు నాథ సమేత కాంతలుం
దిందురు తాపసేంద్రులును దిందురు శ్రామికు లింక వృద్ధులుం
దిందురు వ్యాధి బాధితులు తిందురు స్త్రీలును బాలు రెల్లరుం
దిందురు భక్ష్యభోజ్యములు తృప్తి వహింపక నిత్య మచ్చటన్ 11.

కం. వడ్డించుఁ డన్న మింకను
దొడ్డగ నడ్డమ్ముఁ లేక తుష్టిం జెందన్
గుడ్డలఁ బంచుం డిపు డి
గ్గడ్డ ననఁగఁ జేసి రట్ల కమనీయముగన్ 12.

ఆ.వె. అన్న రాసులున్న వచట ముచ్చటగను
జూడ శుచుల దనరుచును భృశమ్ముఁ
వేగ వేగ విరివి విధ్యుక్త విధ మొప్ప
వండ దినదినమ్ముఁ కొండ లనఁగ 13.

కం. నానా దేశ నివాసులు
నా నర నారీ మణు లట నన్నాదులు న
ప్పానీయమ్ముల నలరిరి 14.

యా నరపాలు క్రతురాజ మందుం దనివిన్

కం. అన్నము సాధుతర మహో
మిన్నఁగఁ దృప్తిం బడసితిమి నరవరేంద్రా!
యన్నద! సు సుఖీభవ యని
చెన్నుగఁ బొగిడిరి ద్విజన్మ శేఖరు లతనిన్ 15.

తే.గీ. భూసుర వరేణ్యుల కశనము నిడఁ గొంద
ఱు సువిభూషితులు పురుషులు సుకరముగ
వారికి సహాయమునఁ బెఱ వారు తమి మ
ణి మయ కుండల భాసితులు మెలఁగి రట 16.

కం. జన్నపుఁ బనులకు నడుమన్
విన్నాణులు తర్క మందు విజ యాసక్తిం
బన్నుగ నట వాదన లె
న్నెన్నొ చలిపిరి ధరణీ సురేంద్రులు ఘనులున్ 17.

కం. ప్రతిదినము ద్విజులు ముని చో
దితులై యయ్యాగమం దతి కుశలులు సమం
చిత రీతి నాగమ సు స
మ్మతమ్ముగఁ జలిపిరి కర్మ మండలి నెల్లన్ 18.

తే.గీ. లే రచట షడంగమ్ములు నేర నట్టి
వారు నల్ప పాఠకులును లేరు వ్రత ర
హితులు లేరు సదస్యులఁ బతివరేణ్య
చెంత వాదాల్పులును లేరు వింత యగునె 19.

చం. పరఁగఁగఁ బాలకొయ్యలను బాతెడి కాలము బిల్వ కాష్ఠముల్
సరసన ఖాదిరమ్ములును షట్కము షట్కము నొక్క శేలువుం
బరమున దేవదారువులు పన్నుగ రెండును జాపఁ జేతులం
దిర మగు నంతరమ్మునను దీరుగఁ బాతిరి పర్ణు లాజిటిన్ 20.

కం. జన్నము క్షుణ్ణ మెఱింగిన 21.

విన్నాణులు నాగమముల విరివి నిపుణు లా
సన్ను లయి చేసి వసువున
నన్నిటిని నలంకరించి రందము కొఱకై

కం. ఇరువది యొక నిట్ట దివిరి
యిరువది యొక మూర నిడివి నెసఁగ వలువ లా
యిరువది యొక్కటిఁ దగఁ జు
ట్టిరి యొక్కొక్కటికి నొక్కటిగ నందముగన్ 22.

తే.గీ. శిల్పులు విధి పూర్వకము సచిత్ర తతి యె
నిమిది ముఖము లమరు నట్లు నేర్పు మీఱ
నునుపు మెఱయఁ జేసిరి వాని ననువుగ వసు
ధాధిపతి యాగమున దృఢతరము దివిరి 23.

కం. తగ నాచ్ఛాదించిరి ట
ట్ట గములు సుమ చందనము లడరి జల్లిరి బా
గుగ జన్నపుఁ గంబముల వె
లుఁగ నవి సప్తర్షు లల వెలుఁగు నట్లు దివిన్ 24.

కం. వలసిన విధ మిటుకలు తగు
కొలతలఁ జేసి ద్విజ వరులు కుశలులు భృశమున్
లలితంపుఁ ద్రాటి పనులన్
విలసిల్లం జేసిరి చితి పేలిమి కొఱకై 25.

తే.గీ. నేర్పరు లయిన భూసురు లేర్పఱచిరి
రాజసింహము దశరథు క్రతువు గుండ
మలర స్వర్ణపక్ష గరుడ లలిత రూప
ము త్రిగుణము నవద్వయ భాగములుగ నచట 26.

ఆ.వె. ఆగ మోక్త భంగి నాయా సురలకునై
ఫణి విహంగ జంతు గణములను వ
ధింప హయ వరమును దీర్చి జలచరము
లుంచి రడరి యాజకోత్తము లట 27.

తే.గీ. మూడు నూర్ల పశువులను భూమి ధవుని
యశ్వ రత్నము నంత నయంపు రీతి
యూపముల కింపుగ సరస నాపి యుంచి
కట్ట భాసిల్లె యాగ జగమ్ము కరము 28.

కం. కౌసల్యా దేవి సుగుణ
సేసి ప్రదక్షిణము వాజి శేఖరమునకున్
ప్రేసెఁ గృపాణము తోడన్
భాసుర ముమ్మారు లంతఁ బరమ ముదమునన్ 29.

ఆ.వె. సుస్థిరంపు హృదిని సునయన కౌసల్య
యా పతత్రి చెంత నట వసించె
ధర్మ కాంక్ష నలరి తగ నొక్క యామిని
రాజ ధర్మపత్ని భ్రాజితముగ 30.

తే.గీ. హోత యధ్వర్యుఁ డుద్గాతయు నయ రీతి
నృపతి మహిషీమణినిఁ బరివృత్తి సుదతి
మఱియు వావాతను గర కమలములఁ గొని
రటకు నవ్విధి నన్యను హరినిఁ దాఁక 31.

చం. హరి వప నంత ఋత్విజులు యజ్ఞ విశారదు లుద్ధరించి వం
డిరి శ్రుతు లొప్పు నట్టుల కడింది నియంత్రిత నిర్మలేంద్రియుల్
తురగ వపాత్త సౌరభము ధూమ మధీశ్వరుఁ డాస్వదించె నా
దరుణము న్యాయ మొప్పెడు విధమ్ము నశింపఁగ నెల్ల పాపముల్ 32.

తే.గీ. గుఱ్ఱమున కున్న యంగము లెల్లని భుజి
నెమ్మి షోడశ ఋత్విజు లిమ్ముగ నట
వేల్చిరి నియమంపుఁ బగిది విప్రవరులు
మంత్ర పూర్వక మయ్యాగ తంత్రములను 33.

ఆ.వె. అన్య యాగ వరము లందు హవిని రావి
గరిట తోడ నీయ కరము ప్రీతి 34.

నశ్వమేధ యాగ మందు నీయఁగఁ బేము
నిష్టపడుదు రింక హృష్టి సెలఁగ

మ. హరి మేధమ్ము వహింప మూ డహము లం దాదిం జతుష్టోమ మం
ద రతిన్ రెండవ పూట నుక్థ్య మతిరాత్రం బయ్యె నా పిమ్మటం
దిరమై విశ్వజి దాహవమ్ము నిఁక జ్యోతిష్టోమ మాయుష్యముం
బరఁగెన్ సాభిజి దధ్వర మ్మలరి కల్పప్రోక్త భంగిన్ రహిన్ 35.

ఉ. ఆతఁడు రాజు తూర్పుదిశ నంతయు నన్వయ వర్ధనుండు దా
హోతకు నిచ్చె నధ్వరున కోజఁ బ్రతీచి నవాచి బ్రహ్మ కు
ద్గాతకు నుత్తర మ్మొసఁగె దాన వరేణ్యుఁడు యాగ మందు నా
ధాత విధించెఁ బూర్వమున దక్షిణ లివ్విధి సమ్మతమ్ముగన్ 36.

కం. ముగియించి క్రతువు న్యాయ
మ్ముగ నా ధర భూవరుండు పుణ్య పురుషు లా
జగ దిద్ధ ఋత్విజులకు నొ
సఁగెఁ గుల వర్ధనుఁడు నద్దశరథుం డెలమిన్ 37.

ఉ. రాజును వీత కల్మషుని రాఘవు నారసి యంత ఋత్విజుల్
తేజము మీఱ రాజ జగతీ బరిపాలన కర్తుఁ డౌదు వీ
వే జగ మేల మాకు నిల నేలఁగ శక్యమె మెత్తు మెన్నడుం
బ్రాఁజదువుల్ భృశమ్ము దగు వస్నమ మే లని పల్కి రెల్లరున్ 38.

ఆ.వె. రత్నరాసు లయిన రాజ! గోవుల నైనఁ
గాంచ నమ్మయినను మించి యిమ్ము
భూసురులకు నెంచ భూములు నిష్ప్రయో
జనము లున్న వెంచి తనరి యిమ్ము 39.

కం. నా విని బ్రాహ్మణవరులకు
నా వేదజ్ఞుల కొసంగె నావుల నెలమిన్
వేవేలుగ శతకోటులు
సౌవర్ణములు తదధిక రజతము లొసంగెన్ 40.

కం. ద్విజు లా ధనము లొసఁగ కుం
భ జన్మునకు ఋష్యశృంగ పరమర్షికి నా
సుజనులు పంచిరి యంత వి
భజించి హర్షితుల మంచుఁ బతి కనిరి రహిన్ 41.

ఉ. వచ్చిన భూసురేంద్రులకుఁ బార్థుఁడు భర్మ హిరణ్య కోటులన్
మెచ్చి యొసంగె నిర్ధనుఁడు మేటి ధరాసురుఁ గాంచి వేఁడఁ దా
నచ్చపు హస్తభూషణము నాదర మొప్ప నొసంగె భూసురుల్
హెచ్చుగఁ దృప్తిఁ జెందఁగ మహీసుర భక్తుఁడు మ్రొక్కె వారికిన్ 42.

ఆ.వె. చాఁగిలఁగ రఘుకుల చక్రవర్తి యుదార
గుణుఁడు దానశీలి గురు మహీసు
రేంద్రులకు సభక్తి యిచ్చి రాశీస్సులు
తోరముగ నృపతికి వారు ప్రీతి 43.

కం. ధరణీశ దుష్కరము కృత
దురిత హరము స్వర్గదమ్ము తురగోత్తమ మే
ధ రత క్రతువు ఫలింప ద
శరథుండు రఘూత్తముండు సంతస మందెన్ 44.

కం. అంతఁ గని ఋష్యశృంగుని
సంతసమున వేఁడె నా దశరథుండు మునిన్
సంతునకుఁ గూడ జన్నము
మంతన మొనరించు మంచు మహి తాత్ముండే 45.

ఆ.వె. నా విని మునిసింహుఁ డట్టులె యని రాజ
సింహునిఁ గని ప్రీతి శీఘ్రమ తన
యులు నలువురు నిజ కులోద్ధారకులు జని
యింపఁ గలరు భూవరేంద్ర యనియె 46.

ఆ.వె. సుమధురమ్ము లైన సురుచిర వాక్యము
లాలకించి రాజు హర్ష మంది
భృశము ప్రణతుల నిడి ఋష్యశృంగ మునికిఁ 47.

దిరిగి పలికె నవియె ధరణి ధవుఁడు

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదునాలుగవ సర్గము.

# బాలకాండము

## సర్గము 15.

దశరథుని పుత్రకామే ష్ట్యాచర ణారంభము, శ్రీమన్నారాయణుఁడు రావణసంహారార్థము దశరథునకుఁ
బుత్రునిగా జన్మింతు నని బ్రహ్మాది సురులకు వచించుట.

మత్తకోకిల. అంత ధీనిధి ఋష్యశృంగ మహర్షి దాలిచి ధ్యానమే
యంతరంగము నందుఁ గొంత మహాగమజ్ఞుఁ డెఱింగి తా
నుంత చిక్క నుపాయ మొక్కటి స్ఫూర్తిఁ బల్కెను రాజు సు
స్వాంతుఁ గాంచి ముదమ్ము మీఱఁగ భాషణమ్ములు మార్గిరల్ 1.

తే.గీ. పుత్ర కామేష్టి యొక్కటి పుత్ర లబ్ధి
కుక్త మది యధర్వమున సముచిత రీతి
మంత్ర యుక్త మొనర్చెద మహిత తేజ
నీ కొఱ కని వేల్వఁ దొడఁగె వీఁక నలరి 2.

కం. విచ్చేసిరి సిద్ధామరు
లచ్చటికి మహర్షి సుర మహాగాయకులున్
మెచ్చి హవిర్భాగమ్ముల
నిచ్చ వహించి కలసికొని రెల్లరు నియతిన్ 3.

చం. కదిసి తగన్ సభాస్థలినిఁ గంజుని విశ్వసృజున్ వియచ్చరుల్
విదితము నీయనుగ్రహపుఁ బెంపున రావణ నామ దైత్యుఁడే
వదలక మాకు బాధల నపార మొసంగుచు నుండఁ బల్కి మే 4.

మదలప లేక వానిఁ గడు నార్తి వసింతుము పల్కి రివ్విధిన్

ఆ.వె. వరము లిచ్చి తీవు బ్రహ్మదేవ కరము
ప్రీతి నాతనికి నవిరళముగను
గౌరవించి మేము క్షమ నోర్చుచుంటిమి
సర్వ దుష్కరములు సతము నెరిసి 5.

తరువోజ. భయపెట్టు మూడు భువనములఁ గుమతి పాలకద్వేషియై పరఁగు నిత్యమ్ము
దయవీడి యింద్రుని ధర్షించు నా త్రిదశనాథుఁ దాపస దైత్య గంధర్వ
చయ యక్ష విప్రుల సతము హింసించుఁ జాల యజేయుఁడు సంచిత వర ని
చయ మోహితుండు దశగ్రీవుఁ డెల్ల జనులకు భీతి నొసంగు వాఁడు భువి 6.

కం. రవి మండఁడు వాయువు వీ
వ వెఱచుఁ గదలక చలోర్మి వననిధి నిలుచున్
భువి రావణు నా రాక్షసు
నవలోకించిన క్షణమ్మ యంబుజగర్భా 7.

కం. చూచిన ఘో రాకారుని
పే చలన ముడుగు భయ మగు విస్తారముగం
నీచుఁ డగు నసురు వధకై
తోఁచు నుపాయం బరయుమ తూర్ణము దేవా! 8.

కం. నా విని సుర లెల్లఁ బలుక
నా విధి చింతించి సుంత యనె నివ్విధి యా
హా విదితమే యుపాయము
రావణు దుష్టుని వధకు సుర వరులు వినుఁడీ 9.

తే.గీ. దేవ దానవ రాక్షస దివ్య యక్ష
నిచయ గంధర్వ గణముల నిధన ముండ
ని విధము వర మడుగఁ బ్రీతి నే నొసఁగితి
నా వరమ్ము నతనికి దైత్యాధిపతికి 10.

చం. అడుగఁడు నన్నవజ్ఞత నరాళి నవధ్యత రావణుండు న 11.

య్యెడ నసురుండు కాన మృతి యీతని కేర్పడుఁ బూరుషేంద్రుచేఁ
గడఁగి నరేతరుం డితనిఁ గాడు సమర్థుఁడు చంప నెన్నడుం
గడు ముద మంది రా సురలు కంజుని మాటలు విన్న యంతనే

కం. పన్నుగ సురలకు గదతో
వెన్నుఁడు సాక్షాత్కరించెఁ బీతాంబరుఁడే
చెన్నిడ శంఖము నరి శ్రీ
మన్నారాయణుఁడు శార్ఙి మాధవుఁ డంతన్ 12.

ఆ.వె. పద్మగర్భుఁ జేరి పద్మనాభుఁడు నిల్వ
శాంత మడర నంత సన్నతు లయి
యమరు లెల్ల భక్తి నని రిట్లు కీర్తించి
యాతని నరసి వినయమ్ము తోడ 13.

మ. త్రిజగ ద్రక్షణ కార్య కామమున నో దేవా దయన్ నీవ యా
త్మజ రూపమ్ము చతుర్విధ మ్మడర జన్మం బందుమా విష్ణు! భూ
మి జనాధీశుఁ డయోధ్యకుం బతికి సంప్రీతిన్ మహాత్కాంతి ద
క్షజ లా హ్రీసతి శ్రీనిఁ గీర్తి సరిపోల్కాంతా సతీ శ్రేణికిన్ 14.

కం. నర జన్మ మూని దేవా
సురల కవధ్యుఁడు జగముల క్షోభపఱచు వాఁ
డురువుగఁ బ్రవృద్ధుఁడు మహా
సురు రావణు నని వధించు శోభిల ధరయే 15.

తే.గీ. రక్కసుఁడు మూర్ఖుఁ డదయుఁడు రావణుండు
సురల గంధర్వుల ముని ప్రవరుల సిద్ధ
గణముల ననునిత్యము బల గర్వమునను
భృశము బాధించుఁ జరియించి దిశల నెల్ల 16.

కం. క్రూరుఁడు రావణుఁడు కినిసి
వీరుఁడు పడపైచె ఋషుల విక్రమమున ద్యో
వార సతుల గంధర్వుల
వారక నందనము రమ్య వనమున నుండన్ 17.

ఆ.వె. వాని వధను గోరి వచ్చితి మయ స గం
ధర్వ యక్ష సిద్ధ తాపస తతి
నిన్న శరణు గోరి నెమ్మి యుంటి మిపుడు
దేవ నీవ యింక దిక్కు మాకు 18.

కం. దేవ ద్విషుల వధింపఁగ
నీవ మనంబుంచు సుంత నెగడఁగఁ బృథ్విం
బావన నృలోక జన్మము
నీ వారసి రక్షణ మిడు నీరజ నేత్రా 19.

కం. నా విని దేవేశుండు మ
హా విష్ణువు సన్నుతుండు నబ్జజ ముఖ దే
వావళిఁ గని ధర్మ యుతము
లౌ వచనమ్ములు వలికె మహానందదముల్ 20.

చం. విడువుఁడు నెమ్మి నీ భయము నే వధియింతును దైత్యు రావణున్
విడువక పుత్ర పౌత్ర సఖ వీర స బాంధవ మంత్రి వర్గముం
గడఁగి సురర్షి భీతిదునిఁ గంటకు నుందును భూమి పాలనం
గడు ముద మంది వేల్ పదియుఁ గా నొకఁ డెక్కువ గాఁగ నేఁడులున్ 21.

ఆ.వె. వరము లొసఁగి యిట్లు పరమాత్ముఁ డమర వ
రుం డమరుల కంత నుండ జన్మ
మెత్తి పుడమి నెడఁద నెంచె నాలుగు రూపు
లంది దశరథుఁ బిత యంచు నెన్నె 22.

ఆ.వె. అంత దివ్య మైన యట్టి స్తుతులఁ బొగ
డి రమ రాప్సరో నికర సరుద్ర
గణ సముని నికాయ గంధర్వు లందఱు
ను మధుసూదనుం బరమ ముదమున 23.

తే.గీ. రావణు విరావణు సురారి దేవ! సాధు
తాపస గణ కంటకు ఘోరదర్పు ముని భ 24.

యంకరుని నుగ్రతేజుని శంక లేక
సత్వరమ్ము దురాత్ముని జంపవలయు

తే.గీ. వాని రావణు సబల సబాంధవమ్ము
నర్వ్య పౌరుషుని వధించి యమర నాథ
రక్షితమ్ము విగత దోష మక్షయ నిల
యమ్ము స్వర్లోకమున కింక రమ్ము దేవ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదునేనవ సర్గము.

# బాలకాండము

## సర్గము 16.

దాశరథిగా జన్మింప నిశ్చయించి విష్ణు వంతర్ధాన మగుట, పుత్రకామేష్టిని లభించిన పాయసము నారగించి దశరథ మహిషులు గర్భవతు లగుట:

తే.గీ. సుర నియుక్తుఁడు విష్ణువు చోద్యముగ నె
ఱింగియు నడిగె సురల నెట్టంగి రావ
ణాసురు ముని కంటకు నద్దురాత్ముఁ జంప
నగును నా కని మృదు గిర లలర నంత 1.

కం. వెన్నుని యవ్యయు మాటలు
విన్నంత ననిరి యమరులు విపులమ్ముగ నీ
వన్నర కాయం బూనియుఁ
గ్రన్నన రావణునిఁ జంపఁ గడఁగుమ యాజిన్ 2.

కం. తప మొనరింపఁగ దైత్యుఁడు
విపరీతముగ బహుకాల వేదన తోడం
గృప దనర విశ్వకర లో 3.

క పూర్వజున కెద ముద మధికం బయ్యె హరీ

చం. వరము నొసంగె హర్షమునఁ బద్మజుఁ డాతని కంత మాను షే
తరములు సర్వ భూతముల దైత్యున కెన్నఁడు చావు లేమినిన్
నరుల నగౌరవమ్ము కతనం గడు గర్వము సూపి కోరఁ డా
మరణము రాక యుండుటను మానవ సంతతి చేత దైత్యుఁడే 4.

ఉ. ఆ వర మంది యవ్విధము నబ్జజుఁ డీయ నతండు దర్పితుం
డై వడి మూడు లోకముల నారటపెట్టఁ దొడంగె నింతులన్
పేవుర దొంగిలించి చెఱఁ బెట్టెను నిర్దయఁ దన్ని మిత్తమున్
వావిరి మాన వాళి కర పద్మహతుం డగు టొప్పు మాధవా 5.

కం. నా విని దయాపయోనిధి
యా వసుధాపతి దశరథు నాత్మ జనకుఁ డం
చా వనజాక్షుఁడు సుందర
భావము నూనె హృదయమునఁ బరమాత్ముండే 6.

ఆ.వె. ఆ సమయము నందు నరిసూదనుండు భూ
ధవుఁ డపుత్రుఁ డైన దశరథుండు
పుత్రుల మదిఁ గోరి పుత్రకామేష్టి య
జించు చుండె నెలమి నంచితముగ 7.

తే.గీ. నిశ్చయించి విష్ణు వటులు నీరజాక్షుఁ
డంత వీడుకొలిపి తగ నబ్జభవుని
నమర ముని పూజ్యమానుఁడై సమధికముగ
హర్ష మడర నంతర్ధాన మయ్యె నతఁడు 8.

తే.గీ. అంత నయ్యజమానుని యగ్ని నుండి
కాంతిమంతము నతి వీర్యవంతము సు మ
హాబల మొక మహద్భూత మచట వెడలెఁ
జూచుచుండ సదస్యులు చోద్యముగను 9.

సీ. రక్తాంబర ధరుండు రక్తాక్షులు తనువు నల్లన దుందుభి నాద మడర

కేసరి సన్నిభ కేశ ఘన శ్మశ్రువులు లక్షణాంగములు లలి తాభ
రణ భూషితుండు శైల సమున్నతుండును భీకర శార్దూల విక్రముండు
దీర్ఘ బాహువులఁ బత్నిఁ దమిఁ బట్టిన యట్లు మాయా మయమ్మని మనుజు లెంచ

తే.గీ. తప్త కాంచన పాత్రము తరణి రూప
మలరి వహ్నిశిఖలఁ బోలి యందమైన
వెండి మూతతోఁ బాయస ముండ నిండి
పట్టి స్వయముగఁ గొనివచ్చి భద్రముగను 10.

కం. నృపతిన్ వీక్షించి పలికె
నపు డేను బ్రజాపతి కగు వ్యక్తిని జుమి భూ
మిప! యన నంజలి స్వాగత
ము పలికి మీకే మొనర్తుఁ బూజ్యా యనియెన్ 11.

ఆ.వె. ఆ ప్రజాపతి నరుఁ డంతఁ దిరిగి పల్కె
దశరథు నృపు నరసి విశదముగను
రాజ సురలు నీదు పూజఁ దృప్తిల్లఁగ
నయ్యె నీకుఁ బ్రాప్త మియ్య దిపుడు 12.

మత్తకోకిల. పాయసమ్మిది దేవనిర్మిత బాసురమ్ము నపత్య సం
ధాయ కామృత తుల్య మైనది ధారణీశ! యొసంగు స్వా
స్థ్యాయురాదుల సంతతమ్ము మహాద్భుతమ్ముగఁ గొమ్ము నీ
వీయ నీదు సతీ మతల్లుల కింక యాగ ఫలమ్మునున్ 13.

కం. తలవంచి కైకొని సుర వ
రు లిచ్చిన హిరణ్మయమ్ము రుచిరము చెంబున్
సలలిత దేవాన్న భరిత
విలాస వంతము నరపతి ప్రీతిం జెందెన్ 14.

తే.గీ. వందనము లిడి యద్భుత సుంద రాంగ
భూతమునకు ముదమ్మున భూ వరుండు
దశరథుడు చేసె భక్తిఁ బ్రదక్షిణమ్ము
నంత నయ్యె నంతర్ధాన మాపురుషుఁడు 15.

కం.	అధనుండు విత్త మందిన
విధ మ్మమర నిర్మితమ్ము ప్రియ పాయసమున్
విధిపురుషుఁ డీయఁ గైకొని
యధి కానందమ్ము నందె నవని పతి మదిన్ 16.

తే.గీ.	వెలిఁగె హర్షాంశు కాంతుల విస్తృతముగ
దశర థాంతఃపురము శారద విమ లాభ్ర
వీధి చంద్రాంశు కాంతుల వెలిఁగి నట్లు
సుందరమ్ముగఁ గన్నుల విం దనంగ 17.

ఆ.వె.	అరిగి దశరథ పతి యంతఃపురమునకు
నంతఁ బాయసమ్ము నింతికి నిజ
కాంత కనియెఁ జూపి కౌసల్యకు సుతుల
నొసఁగు దీనిఁ గొనుమ యొసక మెసఁగ 18.

సీ.	పాయస మందర్ధ భాగము కౌసల్య కిచ్చెఁ బట్టపుదేవి కెలమి నృపతి
యర్ధ భాగము శేష మందు సుమిత్ర కొసంగెఁ దానంతఁ జెలంగఁ బ్రీతి
శేషార్ధ మిచ్చెను జేరి కైకేయికి నంచితముగను జింతించి సుంత
మఱియు శేషమ్ము కుమారార్థము సుమిత్ర కిచ్చెఁ దిరిగి ధరణీశుఁ డెలమి
ఆ.వె.	పాయసమ్ము పంచఁ బార్థివ పుంగవుఁ
డిట్లు వేఱు వేఱ యింతు లెల్ల
రంతఁ బొంది దాని సంతసించిరి గౌర
వింపఁ బడి రని మది నెంచి రపుడు 19.

కం.	ధరియించిరి గర్భము లం
త రాణు లా పాయసమ్ము త్రాగఁగఁ గా లా
చిరమున విడివిడిగను దిన
క రానల సమాన దేహ కాంతులు మెఱయన్ 20.

తే.గీ.	గర్భ ధారిణులు సతులఁ గాంచి రాజు
లబ్ధ మానసుఁ డందె హర్షమ్ము కరము
నిర్జరేంద్ర సిద్ధ వర ముని గణ పూజి
తారవిందాక్షుఁడు దివిని నలరు భంగి 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదునాఱవ సర్గము.

# బాలకాండము

## సర్గము 17.

పద్మసంభవుని పంపున నమ రాదులు తనూజులుగఁ గామరూపులు బలసంపన్నులు నైన వానర భల్లూక వర వ్రాతమును విష్ణు సహాయార్థము సృజించుట.

కం. తా నట్టులఁ బుత్రత్వం
బూన ధరణి పతికి విష్ణు వుత్సాహమునన్
మానుగ స్వయంభువుఁ డనియె
నా నిర్జర గణముతో మహానందముగన్ 1.

కం. మన యెల్లరి హిత మారయు
వనజాక్షుఁడు దత్త సత్య వాక్శూరునికిం
గనుఁ డిల నండగ నుండఁగఁ
దనూజులను గామరూప ధారుల బలులన్ 2.

ఉ. శూరుల వాన రాకృతుల సూనుల మాయ లెఱుంగు వారలన్
మారుత వేగ కేశవ సమాన పరాక్రమ దివ్య కాయులం
బేరు టుపాయులన్ నయ వివేకుల ధీనిధు లస్త్ర వేదులన్
నారుల నప్సరో౽బలల నాక సుగాయను లందుఁ బొందుఁడీ 3.

కం. దురతిక్రములఁ గుమారు ల
మర సన్నిభుల నిఁక మీ సమానుల ధాత్రిం
బరమానందముగఁ గనుఁడు
సురపుంగవు లార మీరు సురుచిర లీలన్ 4.

కం. మున్ను సృజించితి ఋక్షముఁ
బన్నుగ నల జాంబవంతు బల సంపన్నుం
జెన్నుగ నేఁ దుమ్మినఁ దాఁ
గ్రన్ననఁ బడె నోటి నుండి కమనీయముగన్ 5.

ఆ.వె. నలువ శాసనమ్ము నయముగ శిరసావ
హించి నిర్జరేంద్రు లంచితముగఁ
బుత్రులఁ గపి రూప మూర్తులను సృజించి
రెల్ల రంత మనము లుల్లసిల్ల 6.

తే.గీ. సిద్ధులు మహాత్ములు ఋషులు నిద్ధ చరిత
సర్ప విద్యాధ రాదులు చారణులును
వీర నందనులఁ గనిరి ప్రీతి మీఱ
వన విహార విలాసుల వానరులను 7.

మ. జననం బిచ్చెను శక్ర సన్నిభ మహా సత్వుండు నా వాలికిన్
ఘనుఁ డౌ యింద్రుఁడు వాన రేంద్రునకు సంగ్రామోగ్ర సంచారికిన్
జనియింపం గనె వీర విక్రముని సచ్చారిత్ర సుగ్రీవునిన్
ఘన తాపాంశు యుతుండు భాస్కరుఁడు విఖ్యాతున్ మహావీరునిన్ 8.

తరళము. సుర పురోహితుఁ డా బృహస్పతి శూరుఁ దార వరాఖ్యునిన్
ధర సృజెంచె మహా ప్లవంగు లతామ్ర గావలి నుత్తముం
బరఁగెఁ బుత్రుఁడు గంధమాదన భాసురాఖ్యుఁ గుబేరుఁడే
గురువు కాఁగను విశ్వకర్మకు గొప్ప పట్టి నలుం డనన్ 9.

కం. అనల కుమారుఁడు నీలుఁడు
కన నన లోగ్రప్రభా నికాశుఁడు ఘనుఁ డై
మనుఁ దేజో యశముల బల
మున వానర వీరు లందు మూరి చరించున్ 10.

తే.గీ. అంద మును సంపదఁ జెలంగు నశ్వినీ త
నయులు మైందుని ద్వివిదుఁ దనయుల రూప
సమ్మతుల సృజియించిరి శౌర్య విక్ర 11.

మ ఘన సంపన్ను లిద్దఱ మర్కటముల

కం. వరుణుఁడు సుషేణుఁ డను వా
నరర్షభున కిచ్చె ధర జననము ముదముగన్
శరభునిఁ బర్జన్యుఁడు వా
నర పుంగవుని సృజియించె నందను నెలమిన్ 12.

మ. జననం బిచ్చెను వాయు వంత నిజ వజ్రస్కంధ సూనుండు నా
హనుమన్నామ మహాకపీంద్రునకు హర్యాధిక్య మేధావికిన్
వినతానందన తుల్య వేగునకు సంప్రీతిన్ సుసాధ్వ్యంజనా
తనయత్వమ్మున వర్ధిలంగఁ గన నిర్ధాత్రీప్రసిద్ధిన్ రహిన్ 13.

కం. వారింకను వే వేలుగ
వీరులు కపులు దశకంఠు వే విధ్వంసం
బారయ సృజియింపఁ బడిరి
ధారుణి బల కామరూప ధారులు ఘనులున్ 14.

తే.గీ. కోతు లెలుఁగులు గోపుచ్ఛ కోటులు బల
వంతులు త్వరితమ్ముగ వపుష్మంతులు గన
మేరు మందర సన్నిభ ధీర మతులు
పుడమి నుద్భవిల్లిరి యంత ముమ్మరముగ 15.

తే.గీ. ఎట్టి యెట్టి రూపమ్ములు నెట్టి యెట్టి
వేషములు నింక నెట్టెట్టి విక్రమ సురు
లట్టి యట్టి కుమారులు వుట్టి రంత
వేఱు వేఱుగ వారికి వీర వరులు 16.

ఆ.వె. కొంద అధిక బలులు కోతులు పుట్టిరి
కొండముచ్చులకును గొంద ఱింకఁ
గిన్నరులకు మఱియుఁ బన్నుగ నెలుఁగుబం
టులకు భూతలమున నెలమి మీఱ 17.

మధ్యాక్కర. అమరౌక గంధర్వ భుజగ యక్ష విద్యాధర సిద్ధ 18.

విమల కింపురుషర్షి నాగబృందము లింపుగ నాగ
రమణుల గంధర్వ కన్యలను నప్సరసల యందును సు
ర మహిళా గాయను లం దరసిరి వనచరుల సుతుల

తే.గీ. కామ రూపు లనేకులు గమను లిష్ట
రీతి వని సింహ శార్దూల లీల దర్ప
వీర్య సంపన్ను లు ఘనులు విక్రమమ్ము
నందు వానరేంద్రులు భువి నలరు చుండ్రు 19.

ఆ.వె. శిలలు దరులు వారి చేతి యాయుధములు
గోళ్లుఁ బళ్లు నగును గొప్ప శస్త్ర
ములు సెలంగి వాడి మొనలతో మెఱయంగ
నస్త్ర వేదు లెల్ల రధికముగను 20.

తే.గీ. కుదుపుదురు దొడ్డ కొండలు ఘోరముగను
విఱిచెద రవలీలం గేల వృక్షములను
క్షోభ పెట్టుదు రంబోధిఁ గోపగించి
వాన రేంద్రులు విహరించి కోన లందు 21.

తే.గీ. చీల్ప ధరఁ గాళ్ళ శక్తులు దాల్ప కోర్కి
దుమికెదరు పంత ముప్పొంగఁ దోయరాశిఁ
జేరెదరు గెంతి విన్వీధిఁ జెల్వముగను
బట్టెదరు మేఘుజాలమ్ము నిట్టె యెగిరి 22.

ఆ.వె. మసలి యడవి లోన మత్త కుంజరములఁ
బట్టి యుంతు రడరి కట్టెదుటను
భీకరముగ నార్చి విహగ సంఘమ్ముల
నేలఁ గూల్తు రిట్టె నివ్వటిల్లి 23.

కం. ఈ విధ మలరెడు వారిని
వేవేల హరుల సృజించె విశ్వము నందున్
దేవాళి కామ రూపుల
నావేశము వొంగ హర్ష మంది కరమ్మున్ 24.

కం. హరి యూధమ్ముల వీరలు
హరి నాయక వర్గమందు నగ్రాధిపులై
హరి యూధ పేశులు స్సజిం
చిరి యన్య హరిప్రవరుల౹ జిత్తము లలరన్ 25.

తే.గీ. కొంద ఋండిరి చక్కటి కొండ సెత్త
ముల వసించుచు భల్లూకములను గూడి
కొంద ఱింక కాననముల౹ గొండ లందు
వేలు వేలు వివిధములౌ నేల లందు 26.

మ. ధర శక్రాత్మజ సూర్య నందనులు భ్రాతల్ వాలి సుగ్రీవులే
హరి వీరుల్ నల నీల వాయుజ ము ఖాన్యారణ్య సంచారులుం
బరమోత్సాహము తోడ వారి దరి సంవాసమ్ము సేకూర౹గన్
నిరతం బుందురు కొల్చు చింపుగను సుస్నేహమ్ము వర్ధిల్ల౹గన్ 27.

కం. బలమున గరుడుని౹ బోలుచు
నిల వారు మృగేంద్ర పన్నగేంద్ర వ్యాళా
దుల నొప్పించుచు దర్ప
మ్మలర౹ జరింత్రు ఘన నిపుణు లాహవ మందున్ 28.

తే.గీ. ఋక్ష గోపుచ్ఛ వానర రక్షకుండు
వాలి విపుల పరాక్రమ బాహు బలు౹డు
వారి సెల్లర౹ బాలించు వానరుండు
దీర్ఘబాహువు దుర్జయ ధీర విభు౹డు 29.

కం. వివి ధాకార విలసితులు
వివిధ వ్యంజన సహితులు వివిధ గుణయుతుల్
భువి స వన గిరి మహోదధి
సువికీర్ణు లయిరి కపికుల శూరవరేణ్యుల్ 30.

తే.గీ. నిండినది భూమి మేఘూగ నిభులు ఘనులు
వాన రానీక పాలక వర్గ విభులు 31.

రామ సాహాయ్య హేతు కార్య నిచ యార్థ
మడరి భీమ శరీరులు నాక్రమింప

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదునేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 18.

యాగ సమాప్తమున రాజులు ఋష్యశృంగాది మునులు స్వగృహముల కేఁగ దశరథుఁడు రాణులతోఁ
గూడి యయోధ్యా నగరము ప్రవేశించుట, రామ లక్ష్మణ భరత శత్రుఘ్న కుమార జననము,
విద్యాభ్యాసము, విశ్వామిత్ర మహర్షి యాగమము.

కం. మహితాత్మ నృపతి క్రతువులు
స హర్షము ముగియ నమరులు చని రంత గ్రహిం
చి హవిర్భాగమ్ములు నిజ
గృహమ్ములకు వచ్చి నట్లు హృష్టాత్ములునై 1.

కం. దారాగణ సహితమ్ముగ
నా రాజు స భృత్య వాహ నానీకముగం
జేరె నిజ పురము దీక్ష న
వారితముగఁ బూర్తిచేసి పరమాసక్తిన్ 2.

కం. పూజింపఁబడి నృపతిచే
రాజు లుచిత రీతి నంతఁ బ్రణమిలి మునికిం
దేజమ్ము లలర వా రా
యా జగముల కేఁగిరి వడి నానందముగన్ 3.

ఆ.వె. భూధవులు సను సెడఁ బురము నుండి నిజ ని
లయములకు నరయ బలములు వారి 4.

పెల్ల మెఱసెను గడు తెల్లఁగ సానంద
ముండి చాగ వెలుఁగు చుండి కరము

కం. చన రాజు లెల్లరు ముద
మ్మున సమ్మానించి రాజు భూసుర వరులన్
ఘనముగఁ బురము ప్రవేశిం
చెను శ్రీమంతుండు నంతఁ జిత్తం బలరన్ 5.

తే.గీ. శాంతతో ఋష్యశృంగుఁడు సత్కృతుండు
నై భృశం బనుచర నిచయమ్ము తోడ
రోమపాదుఁడు విజ్ఞుఁడు భూమిధవుఁడు
వెంట రాఁ బయనం బయ్యె జంట యలర 6.

తే.గీ. వీడుకొలిపి సర్వజనుల ఱేఁడు నిండు
మనసుతో నంతఁ గడపుచుండెను దినమ్ము
లు సురుచిర లీలఁ జింతించుచు సుత జన్మ
సంభవమ్మును నిత్యము సంభ్రమముగ 7.

మ. ఋతువుల్ సాగఁగ నాఱు రాఘవు మనం బింపారఁ జైత్రంపు శు
ద్ధ తిథిం సన్నవమిం జెలంగ గ్రహముల్ దా మైదు స్వోచ్ఛస్థితిన్
నుత నక్షత్రమునం బునర్వసున విన్నూత్నప్రభా కాయుఁడై
వ్రత సాఫల్య మనంగ నంతఁ గలిగెన్ రాముండు కౌసల్యకున్ 8.

తే.గీ. కర్కటక లగ్న మందుఁ బ్రకటపు గతి వె
లసి బృహస్పతి విమల చంద్ర సహితమ్ము
నుదయ మొందు చుండఁగ రాముఁ డుర్వి సకల
భువన వందితుఁడు జగద్విభుఁడు జనించె 9.

తే.గీ. సద్గుణాన్వితుఁ డిక్ష్వాకు సత్కులప్ర
వర్ధనుండు నదృష్ట విష్ణ్వర్ధ ఘన భు
జుండు రక్తాక్ష రక్తోష్ఠ మండితుండు
దుందుభిస్వనుండు తొలి సుతుండు వుట్టె 10.

కం. వెలిఁగె సుతుని తేజమ్మున
నల కౌసల్య యమితముగ నదితి వెలిఁగి న
ట్టుల సకల దేవ నిచయ
మ్ముల కధిపతి వజ్రపాణి మూరఁగఁ జెంతన్ 11.

చం. భరతుఁడు సత్య విక్రముఁడు పంకజ నాభ చతుర్ధ భాగుఁడుం
బరఁగఁగ సర్వ సద్గుణ విభాసితుఁడై భువి పుష్యమీభ మం
దరయఁగ మీన లగ్నమున నంత జనించె సధీద కైకకుం
గర మనురక్తిఁ గేకయప కన్యకు నంతఁ బ్రసన్న చిత్తుఁడున్ 12.

మ. రుచి రాకారులు లక్ష్మణుండు మఱి శత్రుఘ్నుండు వీర్యాధికుల్
నిచితంబై సగ భాగ మా హరిది కన్పింపంగ నస్త్రంబులం
దుచితోద్దండ విశారదుల్ ఘనులు దివ్యోద్భావు లాశ్లేష యం
ద చలన్నేత్ర సుమిత్రకుం గులిర మందాదిత్యుఁ డేపారఁగన్ 13.

తే.గీ. రూప సామ్యులు గుణులు పుత్రులు నలువురు
భాద్రయుగ్మ సదృశ్యులు భాతు లందుఁ
బుట్టిరి మహాత్ము లా యజు పట్టి కెలమి
వరుసగ దశరథున కట్లు పార్థివునకు 14.

మధ్యాక్కర. పాడిరి గంధర్వు లలర స్వర్గ వధువు లాడి రెలమి
వీడక పుష్ప వర్షమ్ము విందు సేసె నభము నుండి
యోడక దుందుభి ధ్వనులు నుల్లమ్ము లలరంగ మ్రోఁగె
వేడుక లుప్పొంగె నగర వీథుల జనులెల్ల మూఁగ 15.

తే.గీ. దారు లవి క్రిక్కిరిసె జన తతులు సెలఁగ
నటులు నర్తకు లచ్చట నాట్య మాడ
గాయనులు పాడ వాద్య సంఘాతములను
గూడి రత్నభూషితు లయి కూర్మి మీఱ 16.

ఆ.వె. ఈయఁ దగిన వాని నిడె వంది మాగధ
సూతులకును రాజు సురుచిరముగ
బ్రాహ్మణుల కొసంగె వందలు వందలు 17.

విత్త గో ధనమ్ము లుత్తమములు

శా. రా నేకాదశ వాసరమ్ము దగఁ బేళ్లం బెట్టి రుత్సాహులై
తా నా జ్యేష్ఠునిఁ బిల్చెరాముఁ డని యంతం బ్రీతినిం గేకయీ
సూనుం బిల్చె వసిష్ఠుఁడే భరతు డంచుం దత్సుమిత్రాత్మ స
త్సూనశ్రేష్ఠులఁ బిల్చె లక్ష్మణుఁడు శత్రుఘ్నుండు నా హర్షియై 18.

తే.గీ. అన్న దానము సేసె బ్రాహ్మణుల కింకఁ
బౌరులకు జానపదులకుఁ బార్థివుండు
రత్న రాసు లొసఁగె ద్విజులకుఁ దనయుల
సర్వ జన్మ కార్యములను జరపె వరుస 19.

కం. నాయన కొసంగు హర్షము
నా యగ్రజుఁడు పడగ వలె నత్యంతముగా
నాయె నతండు ప్రియతముం
డాయతముగ భూతరాశి కబ్జజు భంగిన్ 20.

ఉ. అందఱు వేద పారగులు నందఱు శూరులు భ్రాత లెల్లఁ దా
రందఱు గాంత్రు లోకహిత మందఱు జ్ఞానులు సద్గుణాఢ్యు లే
చందము నందు నిర్మలుఁడు సత్యపరాక్రమ శోభి రాముఁడే
యందఱి కిష్టుఁ డిజ్జగతి నచ్చపుఁ జంద్రుని భంగి మిన్నఁగన్ 21.

కం. నిపుణుం డయ్యెను రాముఁడు
విపుల గజాశ్వ రథ యాన విద్యల నెల్లన్
సుపరిశ్రమ వింటినిఁ గల
దు పిత్రుపాసన నొనర్చు దోరము సతమున్ 22.

తే.గీ. లక్షణ గణ సుసంపన్న లక్ష్మణుండు
లక్ష్మివర్ధనుండు నిజ బాల్యమ్ము నుండి
రాము నగ్రజు జగదభి రాము సేరి
నిత్య మర్చించు స్నేహమ్ము నెగడు చుండ 23.

తే.గీ. ప్రీతి గూర్చుచు సంతత మాతతము శ 24.

రీర సహితమ్ము నన్నకు గారవమున
లక్ష్మి సంపన్నుఁడే బహిః ప్రాణమనఁగ
సంచరించు ముదమ్మున మించ భక్తి

ఆ.వె. లక్ష్మణుండు లేక రాముండు నిదురింప
నేరఁ డెన్నఁ డేని గారవమునఁ
బెట్ట నన్న మతఁడు ముట్టఁడు మృష్టాన్న
మైన లేక యున్న ననుజ వరుఁడు 25.

కం. ఏఁగ హయ మెక్కి రాముఁడు
వేగమ వేటకు నతండు వెన్నంటుచు వే
వేగ సెలంగి ధనువుతోఁ
జాగు సుమిత్రా సుతుండు సంతోషముగన్ 26.

తే.గీ. మిన్న ప్రాణము కన్నను నన్న భరతు
న కెద లక్ష్మ ణానుజుఁడు గుణగణ సంయు
తుండు శత్రుఘ్నుఁ డట్లగ్రజుండు భరతుఁ
డితనికిఁ బ్రియతముం డగు నెడఁద సతము 27.

కం. ప్రీతిం జెందె దశరథుం
డా తనయుల నల్వురను మహాభాగుల ధా
త్రీతల ధవుఁ డరసి కమల
జాతుఁ డమరు లందు భంగిఁ జారుతరముగన్ 28.

ఉ. తెలివరు లింత సిగ్గరులు తేజు సెలంగెడు వారు మంచి వా
రలు మఱి వన్నె కెక్కిరి కరమ్మును ముందును జూచు వారలుం
దెలిసిన వారు పెక్కులును దీరుగఁ బట్టులఁ గాంచి తండ్రి దా
వెలిఁగెను సంతసం బడర వేల్పుల పెద్ద వెలింగి నట్టులన్ 29.

తే.గీ. వారును బురుష వ్యాఘ్రులు మూరి వేద
ములు చదువుచు సంతసమున నలరుచుఁ బితృ
సేవ లందు నిష్ణాతులై చెలఁగి రెల్ల
రును ధనుర్విద్య లందు సురుచిర రీతి 30.

కం. తలఁపం దొడఁగె వివాహ
మ్ములు సేయ సుతులకు నింక భూనాథుం డొ
జ్జలు నిజ బంధు జనులతోఁ
జలుపుచు మంతనము లంతఁ జక్కఁగఁ బ్రీతిన్ 31.

కం. నిజ మంత్రుల మధ్య నిలువ
నజసుత ధర్మాత్ముఁడు తగ నాలోచనలన్
విజయమ్ముచేసె నా గా
ధిజ విశ్వామిత్రుఁ డట కతిధియై ప్రీతిన్ 32.

కం. ఆరసి తాఁ బలికె నిటులు
ద్వారపతులఁ కౌశికుండు వడి గాధిజుఁడే
భూరమణ దర్శనార్థము
చేరె నని వచింపుఁడు చని శీఘ్రము పతికిన్ 33.

చం. భయ మీఁక సంభ్రమ మ్మొదవ ద్వార సురక్షకు లెల్ల నాలకిం
చి యతని భాషణమ్ములను శీఘ్రము పర్వులు పెట్టి భూధ వా
లయమును జేరి కౌశికుని రాకను గాధిజు భాషణమ్ములన్
రయముగఁ దెల్పి రర్క కుల రాణ్ణృగరాజున కంత నమ్రులై 34.

చం. త్వర నెదురేఁగె నా దశరథక్షితిపుం డన ద్వారపాలకుల్
గిర లవి యాలకించి గమకించి పురోధనుతో శచీధవుం
డరసి విధాత నేఁగు విధి హర్షమునం జని దీప్త కాయ మౌ
ని రుచిర సువ్రతుం గని వినీతుఁడు నర్ఘ్య మొసంగె భక్తినిన్ 35.

కం. కొని యర్ఘ్యమ్ము మునీంద్రుం
డనునయముగ శాస్త్రదృష్టి నరసి దశరథుం
గని నరనాథునిఁ దా నడి
గెను గుశలము నవ్యయమ్ము గిర లలరంగన్ 36.

చం. కుశలమె బందుమిత్రులును గోశము పౌరులు గ్రామవాసులున్
భృశముగ నమ్రులే సరస పెల్లెడి రాజులు నోడిరే రిపుల్ 37.

విశదముగా నొనర్తువె భువిన్ సుర మానుష కార్యకోటులన్
దశరథ! రక్తియుక్తులను ధర్మము నూని నరేంద్రపుంగవా! 38.

కం. మునిపుంగవుని వసిష్ఠుని
ఘన తాపస శేఖరులను గదిసి కుశలముం
దనరి యడిగెఁ దగు న్యాయ
మ్మును బాటించి యట గాధిపుత్రుం డెలమిన్ 39.

ఆ.వె. రాజగృహము నందు రమణీయముగ యథో
చితము కూర్చొనిరి నృపతి వరుండు
సేయ బూజ లంది హాయిగ ఱేఁ డంత
హర్షమునఁ బలికె మహర్షి తోడ 40.

శా. పీయూషమ్మిల నంది నట్లు పొడి పెన్బీళ్లందు వర్షంబనన్
జాయాగర్భ మపుత్రుఁ డారసి నటుల్ సక్కంగ నష్టార్థుఁడే
యా యర్థమ్మును బొంది నట్టులును గార్యప్రాప్తి హర్షార్ణవ
ప్రాయం బట్టుల నెంతు మౌనివర విశ్వామిత్ర మీ రాకనున్ 41.

తే.గీ. స్వాగతమ్ము మునీంద్ర తపమ్మున మును
వెల్గ రాజర్షివై పేర్మిఁ బిదపఁ బొంది
తీవు బ్రహ్మర్షి పదము నహీన జప త
పో నిరతుఁడవై నా కతి పూజ్యుఁడ విట 42.

తే.గీ. ఏది యెవ్విధి నీ యిచ్ఛ నేను జేయఁ
బూజ్య! దొరికితే కొనఁ బాత్ర పూరుషుఁడవు
పూర్ణ సఫలంబ నాజన్మ ముదము వొడమె
సుప్రభాత మయ్యె నిశను విప్రవర్య! 43.

తే.గీ. అద్భుతమ్ము మీ రాక పుణ్యతమ మయ్యె
నా గృహమ్ము మీ సందర్శనమునఁ దీర్థ
యాత్ర ఫలము లభించె సత్పాత్రముగను
సంయమీశ్వర నాదు వేశ్మమ్ము నంద 44.

కం. వినిపింపుఁడు మీ వచ్చిన
పనిఁ దగ ధన్యుఁడను జేయ భవ దిష్టంబౌ
ఘన కార్యమ్మును హర్ష
మ్మున వృద్ధిం జెందఁ గాంతు మునిగణ పూజ్యా! 45.

కం. వే తర్కింపఁ దగదు పని
నో తాపసవర యొనర్తు నుత్సాహముగం
బ్రీతి నశేషము మిమ్మున్
భూతలమున నాదు దైవముగ భావింతున్ 46.

తే.గీ. కలిగినది మహాభ్యుదయము కౌశిక! మిముఁ
గాంచ నాకు ద్విజవరేంద్ర! కారణంబ
యో దయామయ! మీ రాక నాదు మేటి
ధర్మ వృద్ధికిఁ జింతింపఁ దాపసేంద్ర! 47.

కం. విన నొంపై నిజ హృదయ
మ్మున కత్యంతమ్ము హర్షము నొసంగు మహా
త్ముని పల్కులు వినఁగఁ బరమ
మునికిఁ గలిగె సంతసమ్ము భూరిగ నంతన్ 48.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బదునెనిమిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 19.

విశ్వామిత్ర మహర్షి యాగ రక్షణార్థము రామునిఁ దనతోఁ బంపు మని దశరథ మహారాజు నడుగ
నాతఁడు విషాదము నొందుట.

కం. పులకాంకురుఁడై తేజో 1.

విలసిత సన్ముని వృషభుఁడు విశ్వామిత్రుం
డలరి సవిస్తర వాక్య
మ్ములు రాజేంద్రుం డన విని మూరి వచించెన్

కం. భూవర! సత్కుల జాతా!
నీవ తగుదు వన్యుఁ డిట్లు సేరఁ డనంగం
బావన వసిష్ఠు శిష్యుఁడ
వీ వితరమ్ము లగు బలుకు లేల విన నగున్ 2.

కం. నా మది నిల్చిన కార్యము
భూమీశ్వర! చేయ నెంచుము నిలుపు మెలమిన్
నీ మాటను సత్యవ్రత!
యేమఱకయె రాజసింహ! యిద్ధచరిత్రా! 3.

కం. వ్రత మొక్కటి పురుషర్షభ!
రతి యొక్క ఫలమ్ము నందు రంజిల నే ని
ల్చితి నిష్ఠఁ జల్పుచు వనిఁ జె
ఱతు రిష్టాకారు లది తఱ చిరువు రసురుల్ 4.

కం. అల మారీచ సుబాహులు
బలులు సుశిక్షితులు కదియ వ్రత పూర్తి యటం
బలు గతులఁ జేయ వేదినిఁ
బల లాసృక్కులు కురియుచు బాధింతు రహో 5.

కం. క్రతు భంగ మరసి యలసి వి
గతంపు టుత్సాహమునను గాంచఁగ నిను నే
నతి శీఘ్రమ్ముగ నరుదెం
చితి నిట కిక్ష్వాకు రాజశేఖర! వినుమా 6.

కం. కోపింప బుద్ధి పుట్టదు
భూపవర! మనమ్ము నందు మూర్ఖుని పైనం
బాపపుఁ గార్యము లారసి
శాపము నీయం దలంప సద్గుణ రాశీ! 7.

కం. నిత్యము కూఁకట్ల నలరు
సత్య వచశ్శూరు నీదు సత్పుత్రుని నా
దిత్య నిభు ననుపు రాముని
సత్య పరాక్రముని జ్యేష్టు క్ష్మాపతి! నాతో 8.

కం. ఇతఁడె సమర్థుండు నృపా!
దితిజుల వధియింప స్వీయ తేజమ్మున నా
దు తగు పరిరక్షణమ్మున
నతి దారుణ కర్ముల వసుధాధిప భృశమున్ 9.

కం. సకల శ్రేయస్సుల నిత
ని కిత్తు నిశ్శంక రాజ నేను బహుగతుల్
సుకరమ్ముగ విమల ఖ్యా
తి కలుగు ముల్లోకముల విదితుఁడై వెలుఁగున్ 10.

కం. వా రుభయు లరసి రామునిఁ
బోరున నెదిరించి నిల్వ ముందు నశక్తుల్
లే రన్యులు నెందేనియు
వారిఁ గెలువ రాజ! రామభద్రుఁడు తక్కన్ 11.

కం. బల దర్పిత పాపు లిరువు
రిలఁ గాలవ శాసురేంద్రు లెవ్విధి నైనం
దలఁప సరి రారు దినకర
కుల రత్నము రామునకును గోత్రాధీశా! 12.

కం. పుత్రప్రేమ కతమ్మునఁ
బాత్రము కా దుత్తలమ్ము వడయ నరేంద్రా!
చిత్రము కాదిది దుష్ట చ
రిత్రులు మరణింతు రొట్టు లీల దశరథా! 13.

కం. మానిత సత్యపరాక్రము
నే నెఱుఁగుదు నిమ్మహాత్ము నీ సుతు రాముం 14.

దా నెఱుఁగు వశిష్ఠ మహా
మౌని వర తపోధనులును మనుజాధీశా!

కం. ఇల ధర్మలాభము యశము
విలసిల్లఁ దలంతు వేని విస్తారముగం
గలవర మందక డెందం
బలర నొసఁగ నొప్పునాకు నవనిప! రామున్ 15.

కం. నిజ మంత్రులును వసిష్ఠ ము
ఖ జనులు దగ నిచ్చి రేని కడఁగి యనుజ్ఞన్
నిజ పుత్రు నొసఁగ ధరణీ
శ! జయమ్మగు నీకు నిమ్ము శంకింపకయే 16.

కం. ఆత్ర మొకింత పడక ప్రియ
పాత్రుండు నిరంతరమ్ము పార్థివముఖ్యా!
పుత్రుని జన్నమునకు దశ
రాత్రుల కొఱ కిమ్ము రాము రాజీవాక్షున్ 17.

కం. అవ్విధిఁ జేయుమ క్రతువున
కెవ్విధి నాలస్య మింత యేర్పడ కుండన్
నివ్వటిలునొ శోకింపకు
మివ్వసుధఁ జెలంగు భద్ర మింపుగ నీకున్ 18.

కం. నీతి యుతపు వచనము లీ
రీతి యని మహాత్ముఁ డుచిత లీల ముని వరుం
డా తేజో మయుఁ డాగెను
నీతి మనః కుశిక కులుఁడు నిశ్చల మతియై 19.

తే.గీ. పడగఁ జెవుల విశ్వామిత్రు భాషణములు
మించ శోకమ్ము ఱేఁడు చలించె మోహ
మందె నుత్తలమ్మున సంజ్ఞ నంది కొంత
తడవునకు భీతిఁ గ్రుంగె భూధవుఁడు కరము 20.

ఆ.వె. హృదయ మంత చీల్చు ఋషిపుంగవు వచన
ముములు కలఁత నొసంగఁ బుడమి ఱేఁడు
వ్యథిత చిత్తుఁ డై నిజాసనమునఁ గంపి
తుండు నయ్యె దశరథుండు మిగుల 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందుఁ బందొమ్మిదవ సర్గము.

# బాలకాండము

## సర్గము 20.

దశరథుఁడు చింతాక్రాంతుఁడై విశ్వామిత్రుని కోరిక నిరాకరించుట, ముని కుపితుఁడౌట.

కం. ములికులఁ బోలు పలుకులు సె
వులఁ బడ నా ముని యనంగ భూమీశుఁడు మూ
ర్ఛలి సుంత తేఱుకొని తాఁ
గలఁతం బెంది యనె నిట్లు కౌశికు తోడన్ 1.

కం. పసిబిడ్డఁడు నా రాముఁడు
మసరవు పదునాఱు వరుసములు దనుజుల తో
డ సరి యని యాజికిఁ దలఁప
ను సుతుని రాజీవలోచనుని మునిచంద్రా! 2.

మ. అధినాథుండను సంయమీశ్వర! యశే షాక్షౌహిణీ సేన కే
నధికోత్సాహము తోడ సేనఁ గొని దైత్యశ్రేణి వీర్యమ్మునన్
వధియింపంగ స్వయమ్ము నచ్చటకు పే వత్తున్ భయంబేల స
ద్విధి నీ యాగము పూర్తి సేయ నిఁక నిర్విఘ్నమ్ముగాఁ గౌశికా! 3.

తే.గీ. విక్రములు శూరులును నాదు భృత్యు లెల్ల
నస్త్ర శస్త్ర విశారదు లాజి సేయ
శక్తు లసుర గణమ్ముతో సంయమీంద్ర!
తోడికొని పోవ రామునిఁ బాడి కాదు 4.

ఆ.వె. ధనువు నూని హస్తమున యుద్ధభూమి ర
క్షింతు నిలిచి నేన యెంత దనుకఁ
బ్రాణము ధరియింతు బలిమి నంత వఱకు
దనుజుల నెదిరింతుఁ దాపసేంద్ర! 5.

తే.గీ. విఘ్నములు లేక మఱి నెరవేరు వ్రతపుఁ
గార్యములు రక్షితము లయి కార్య భార
మూన నేన వత్తు నటకు మౌని రత్న!
తోడికొని పోవ రామునిఁ బాడి కాదు 6.

ఉ. బాలుఁడు కాఁడు శిక్షకుఁడు పన్నుగ నేరఁడు శక్త్యశక్తులం
జాలఁడు యుద్ధ విద్యలను శస్త్రము లస్త్రము లెల్ల నేర్వఁడే
యాలము సేయఁ జాలఁ డసు రాదుల తోడ నెదిర్చి వంచనల్
చాల యెఱుంగు వారలు నిశాచరు లెల్లరు వారి సాటియే 7.

తే.గీ. ఒక్క నిమిషంబు సైనను జక్క సైన
రాముని విడిచి మేనునఁ బ్రాణ ముంచ
నుత్సహింప నిజము తాపసోత్తమ! విను
తోడికొని పోవ రామునిఁ బాడి కాదు 8.

కం. సుతు రాఘవుఁ గొనిపో నెం
చి తేని సువ్రత మునీంద్ర శీఘ్రమ్ముగ నీ
చతురంగ బలమ్ముల సం
యుతమ్ము నను గూడఁ గొనుమ యుత్తమ చిత్తా! 9.

తే.గీ. పే లఱువది యేండ్లు గడచెఁ బృథ్వి నాకు
దుఃఖమున నుండఁ బెక్కేండ్లు తుష్టి నీయఁ
బుట్టెఁ బుత్రుఁడు కౌశిక మునివరేణ్య!
తోడికొని పోవ రామునిఁ బాడి కాదు 10.

తే.గీ. సుతుల నల్వుర నెన్నంగ నితని పైన
మక్కువ సెలఁగు చుండును మిక్కుటముగ 11.

ధర్మ ముఖ్యుండు జ్యేష్ఠుండు తాపసేంద్ర!
తోడికొని పోవ రామునిఁ బాడి కాదు

ఉ. ఎవ్వరు వారు వారి బల మెంత నిశాటులు మౌనిపుంగవా
యెవ్వరి పుత్రు లాకృతులు నెట్టివి యందఱి మేను లెట్టివో
యెవ్వరు రక్ష వారి కట నెవ్విధి రక్షణ మందు చుందురో
యివ్వివరమ్ము లెల్లఁ దగ నేర్పడ నాకు దయన్ వచింపుఁడీ 12.

కం. రాముం డైన బలమ్ములు
నో మునివర! నేను నెట్టి యుక్తిని నా సం
గ్రామ కపట దోషాట
గ్రామము నెదిరింప వచ్చుఁ గడఁగి నుడువుఁడీ 13.

చం. సకలము నాకు దేవ ముని సత్తమ చెప్పుఁడు దుష్ట భావులన్
సకల నిశాచ రోద్ధతుల శక్తి గుణాన్విత దర్ప చిత్తులన్
సుకరముగా నెదిర్చి తగ శూరత నిల్చు విధమ్ము నంత కౌ
శికుఁ డనె రాజు పల్కుల నశేషము దా విని యివ్విధమ్ముగన్ 14.

శా. పౌలస్త్యాన్వయ రావణాఖ్యుఁ డసురవ్రా తాధిరా డ్వీరుఁడే
త్రైలోక్యమ్ముల సంచరించుచును బాధల్గూర్చు నిత్యమ్ము నా
భీలాకారుఁడు బ్రహ్మ దత్త వరుఁడున్ వీ రాసురానీకమే
లీలం గొల్చుచు నుండ నబ్బలుని సంప్రీతిం నరాధీశ్వరా 15.

తే.గీ. చూడ సాక్షాత్కుబేరుని సోదరుండు
విశ్రవస్సున్ముని సుతుండు వీరవరుఁడు
రాక్షస నిచయ నాథుండు రావణుండు
నా వినంబడు ధాత్రిని నరవరేణ్య 16.

ఆ.వె. స్వయముగఁ గ్రతువు నతి బలుఁడు సేయఁడు నాశ
నమ్ము వాని యాజ్ఞ నెమ్మి నూని
వా రిరువు రసురులు మారీచుఁడు సుబాహు
వు లొనరింతురు క్రతు విలయ మడరి 17.

కం. నా విని యనె నా దశరథ
భూవరుఁడు ముని గని యంత మునిపుంగవ! యా
రావణు నెదిరించి నిలువ
నే విధిఁ జాలను రణమున నిద్దుష్టాత్మున్ 18.

కం. కరుణింపుమ ధర్మజ్ఞా
వర నందను నన్ను నల్ప భాగ్యుని నీ వే
గురువును దైవము నాకుం
బరమ మునీంద్రా తలంచి పన్నుగ దేవా! 19.

ఆ.వె. అమర దనుజ పతగ యక్ష గంధర్వోర
గాదు లిల నశక్తు లాజి గెలువ
రావణాసురు ననఁగా వచింపఁగ నేల
మాన వాలి నకట మౌనివర్య! 20.

తే.గీ. బలముఁ గొంపోవు నాతండు బవర మందు
బల్లిదుల యందు దైత్యుఁడు వాని వాని
బలము సైనఁ జాలను నేను గెలువ నాదు
తనయులు బలము తోడను దాపసేంద్ర! 21.

ఆ.వె. దైవ నిభుఁడు నింక తనయుండు బాలుఁడు
కోవిదుండు కాఁడు కొంచె మైన
భండనమ్ము లందు బ్రహ్మసన్నిభ! యట్టి
పుత్రు నీయఁ జాల మునివరేణ్య! 22.

ఆ.వె. యజ్ఞ విఘ్న కర్త లాయిద్దరు యమ స
న్నిభులు కయ్యములఁ గనికర మున్నె
చూడ వారు సుతులు సుందోపసుందుల
పుత్రు నీయఁ జాల మునివరేణ్య! 23.

మ. స్థిరులై పెల్గెడు వీర్య వంతులు కడున్ శిక్షాత్త నైపుణ్య లీ
ధర మారీచ సుబాహు రాక్షసులు యుద్ధం బేను వారిద్దఱన్
సరియౌ నొక్కని తోడఁ జేయ మఱి యుత్సాహమ్మునం జాగ నెం 24.

తు రహిన్ లేని యెడన్ సబంధు జన మేఁ దోరమ్ము నిన్వేఁడెదన్

తే.గీ. వదర నిట్లు రా జా ద్విజ వరుఁడు కుశిక
తనయునకు రేఁగెఁ గోప మత్యధికముగను
నేయి పేల్చిన మఖపు టగ్ని నిభ మనఁగ
మున్యనలము జ్వలించెను మూరి యపుడు 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువదవ సర్గము.

# బాలకాండము

## సర్గము 21.

దశరథుని పల్కుల కాగ్రహింప విశ్వామిత్రుఁడు వసిష్ఠ మహర్షి సాంత్వన వచనములకు దశరథుఁ
డూఱటఁ జెంది ప్రసన్నుఁ డగుట.

కం. విని యా మాటలు దశరథుఁ
డనంగఁ బ్రేమాకులమ్ము లాగ్రహ మడరన్
మనమునఁ గౌశికుఁడు మహీ
శుని నారసి పల్కె బదులు సువ్రతుఁ డంతన్ 1.

ఆ.వె. ఇచ్చి మాట మున్ను నచ్చముగఁ బ్రతినఁ
దప్ప నెంతు వకట యిప్పు డింక
రాఘు వాన్వయులకు రాజ! యయుక్తమ్ము
యీ విపర్యయమ్ము సూపె యెంచ 2.

తే.గీ. ఐన నిది నీకు యుక్తము నేన యింక
వచ్చి నట్టి రీతిని నేఁగు వాఁడ వేగ
మన్నృత భాషణ! కాకుత్స్థ! యలరు భద్ర
ముగ సబాంధవమ్ము కరము భూధవుండ! 3.

కం. ఉరువుగ రోష మడర ధీ
వర విశ్వామిత్రునకుఁ దపః ప్రజ్వలి తా
జిర భాసిత ముని వరునకు
విరివిం గంపించెఁ బుడమి భీతిలిరి సురల్ 4.

ఆ.వె. పుడమి యెల్ల వేఁగ భూసురుఁడు వసిష్ఠుఁ
డరసి యంత గాంచి యవని పతిని
సువ్రతుండు పలికె సుస్థిర ధీరుండు
భాషణమ్ము లిట్లు భవ్యముగను 5.

తే.గీ. పుట్టి యిక్ష్వాకు కుల మందు మూర్తి ధర్మ
మునకు ననఁగ వెల్గ ధృతినిఁ దనర మంచి
వ్రతము లూని శ్రీమంతుండ! పాడి గాదు
ధర్మమును వీడ నీకు సద్ధర్మ చరిత 6.

కం. నుతి కెక్కితి ముజ్జగముల
నతి ధర్మాత్ముండ వని ధరాధీశ్వర స
న్మతిఁ బాటింపు స్వధర్మము
ధృతి నూని యధర్మ మెవ్విధిఁ దగదు నీకున్ 7.

కం. ఇది చేసెద నని చేయం
గుదర దని పిదప వచింపఁ గూలును గుణముల్
పదిలముగ మున్ను గొన్నవి
సదమల మతి! కానఁ బంపు జంకక రామున్ 8.

తే.గీ. అస్త్ర విదుఁ డైన కాకున్న నణఁప లేరు
రక్కసులును విశ్వామిత్రు రక్షణమ్ము
కలుగ రాముని మందు టనలము చే మ
నియెడు నమృతమ్ము భంగిని నిశ్చయముగ 9.

ఉ. ఈతఁడె ధర్మవిగ్రహుఁడు నీతఁడె వీరుల నుత్తముండు నౌ
నీతఁడె యెల్ల లోకముల నెంచఁగ శ్రేష్ఠుఁడు జ్ఞానవంతు లం 10.

దీతఁడె తాపసేంద్రులకు నింపగు నాశ్రయ మౌను సంతత
మ్మీతఁడె సర్వ శక్తి యుతుఁ డిద్ధ చరిత్రుఁడు రాజ పుంగవా!

తే.గీ. ఈతఁ డెఱుఁగు నస్త్రమ్ము లనేకములు త్రి
లోకముల సచరాచ రానీక మందు
నన్యుఁ డెఱుఁగఁడు మున్ముందు నరయ లేఁడు
రాజమృగరాజ! దశరథ! రాఘవేంద్ర! 11.

తే.గీ. రాక్ష సాసుర గంధర్వ యక్ష కిన్న
రోరగ మహర్షి గణ మందు నొక్క రైన
గాధి సూను సమానులు కారు రాజ!
యస్త్ర విద్యాప్రయోగము లందు ధాత్రి 12.

ఆ.వె. పరమ ధార్మికు లగు పర మాస్త్రములు భృశా
శ్వునకుఁ బుత్ర గణము సుమ్ము దత్త
ము లవి కౌశికునకుఁ బుడమి నేలు నపు డ
స్త్రమ్ములు రఘువంశ చక్రవర్తి! 13.

తే.గీ. పుత్రులు భృశాశ్వునకు రూపములు కడు దుహి
త సుతులు ప్రజాపతికి ఘనాస్త్రమ్ము లుజ్జ్వ
లములు వీర్య వంతములు జయము నొసంగు
నట్టివి నిరత మవి యెల్ల నజకుమార! 14.

కం. జయ సుప్రభ లను వార లు
భయు లా దక్ష తనయ లనుపమ మధ్యలకుం
బ్రియముగ శస్త్రాస్త్రమ్ము ల
వి యొక శతం బుద్భవిల్లె వెల్గుచుఁ బ్రభలన్ 15.

ఆ.వె. జయకుఁ బుట్టిరి మును సమయింప నసురులఁ
గామ రూప సుతులు భామ కప్ర
మేయు లెల్ల ఘనులు మేటి బలులు పంచ
దశ కుమార వరులు ధరణి నాథ! 16.

ఆ.వె. సుప్రభకును బిదప సుతులు సంహార నా
ములు తనరి యయిదు పదు లుదయించి
రతి బలులును దుర్జయ పరాక్రములు భండ
నముల నందఱు విను నరవరేణ్య! 17.

కం. విరివి నెఱుఁగు నా యస్త్రము
ల రమ్యముగఁ గౌశికుండు రాజవరేణ్యా!
గురు ధర్మ రతునకుఁ గలదు
పరమాస్త్రములు సృజియింపఁ బన్నుగ బలమున్ 18.

ఆ.వె. ఇట్టి బల్లిదుండు ఋషి కౌశికుండు మ
హా యశుండు తేజ మధిక ముండు
రాము నంప నీకు రాజ శార్దూల! శం
క వల దింక నెడఁద లవము కూడ 19.

కం. వారి నణఁప శక్తి కలదు
తోరముగఁ గుశిక సుతునకు దుష్టాసురులం
దా రామ హితార్థమ్మే
చేరెను యాచింప నిన్ను జింతింపకుమా 20.

కం. విని ముని వసిష్ఠు వచనము
ల నిఁకఁ బ్రసన్నాత్ముఁ డయ్యె రఘు వృషభుండే
తనువు వెలింగెఁ బ్రభల రా
మునిఁ బంపఁ దలంచె నెడఁద ముదముగ మునితో 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది యొకటవ సర్గము.

## బాలకాండము

## సర్గము 22.

వసిష్ఠుని మాటలకు శాంతించి దశరథుఁడు సంతసించి రామ లక్ష్మణులను విశ్వామిత్రునకు నొసంగుట, విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు బల యతిబల యను మంత్రముల నుపదేశించుట.

కం. శాంతి దనర చిత్తమ్మున
నంత వసిష్ఠు గిరలు విన నమృత సదృశముల్
సంతుల రాముని లక్ష్మణుఁ
గాంతి తనులఁ బిల్చె ధరణి కాంతుఁడు ప్రీతిన్ 1.

చం. జనని యొసంగ స్వస్తి సువచస్ప్రచయమ్ములు తండ్రియుం దమిన్
మినుకులు మంగళమ్ము లిడ మీఁటి వసిష్ఠుఁడు గాంచి భ్రాతలం
దనరి నిజాత్మజద్వయము దగ్గఱి మూర్కొని మూర్ధముల్ తగన్
జనపతి యిచ్చె పుత్రులను సంయమి చంద్రున కంతఁ బ్రీతినిన్ 2.

కం. వీచె రజో హీనం బట
వే చన సుఖముగ మునీంద్రు వెంటన్ రాముం
డే చిన్మయ రాజీవ సు
లోచనుఁడు సలక్ష్మణుండు రుచి రాననుఁడే 3.

చం. కురిసెను బుష్పవర్షము సుఘోషము లేచెను మ్రోగ దుందుభుల్
సురవర సత్కృతమ్ము లయి చోద్యము మీఱ నభః పథమ్మునన్
గురుతర శంఖ దుందుభి సుఘోషము లెల్ల నయోధ్య విన్పడెన్
సురుచిర మా మహాత్ములు విశుద్ధ చరిత్రులు నేఁగుచుండఁగన్ 4.

తే.గీ. ముందు నడవ మునీంద్రుఁడు సుందరుండు
రాముఁడు ధనుర్ధరుఁడు వెన్క లక్ష్మణుండు
కాకపక్ష ధరుఁడు వెనుక ననుగామి
యై తరలు చుండి రట జగత్త్రాత లెలమి 5.

తే.గీ. విల్లు కరముల భుజముల వెలయ నంబు
లపొదులు వెలిగించుచు దిశలను భృశమ్ము
చనిరి ముని వెనుక త్రిశీర్ష సర్పము లన
నలువ నా యశ్వినుల భంగి నలరు చుండి 6.

చం. కుదురుగ వేళ్లఁ దోళ్ల తొడుగుల్ ధరియించి వహించి విల్లులన్
ముదముగ భూషితాంగులయి పూని కరండము లుజ్జ్వలాంగు లం
తఁ దనరి రామలక్ష్మణులు తాపసి వెన్క ననింద్యు లేఁగు చుం
డ దహను జంట పట్లు శివు డాయు విధమ్ముగ నొప్పె నప్పుడున్ 7.

కం. చని యర్థాధిక యోజన
ము నది సరయు నా సువిదతము తటమ్ముం జే
రి నిలిచి తీయఁగ రామా
యని పిలిచి యనె నిటులు కుశికాత్మజుఁ డంతన్ 8.

కం. కొనుమీ తడయక వత్సా!
యినకుల తిలకా! జలమ్ము నీ మంత్రములం
గొనుమా బల నింక నబల
ననె విశ్వామిత్రుఁడు పరమానందముగన్ 9.

కం. అల పుండదు రాదు జ్వరము
కలుగదు విపరీత రూప కాయము మంత్ర
మ్ముల బలమున జాలరు దను
జులు వేపఁ బ్రమత్తుల నిఁక సుప్తుల నైనన్ 10.

ఆ.వె. పృథ్వి నేరు బాహు వీర్యమ్మునను నిన్ను
మించు వార లుండ రెంచ నింక
ముజ్జగమ్ము లందు నెజ్జనులును సరి
రారు నీకు నిజము రామచంద్ర 11.

కం. చదివిన బలాబలల మఱి
బదులిడు నందు విభవమునఁ బ్రతిబోధమునం
దు దయాగుణమ్మునను రా
మ దురిత హీన సరి రారు మతి నిర్ణీతిన్ 12.

ఆ.వె. ఈ బలాబలలు లభింప విద్యలు రెండు
సములు నీకుఁ గన నసంభవమ్ము 13.

జ్ఞానములకు నెల్ల జననీ మతల్లులు
సుమ్మివి చదువు లుభయమ్ము లెంచ

ఆ.వె. మహిమఁ దనరు విద్య లిహమున నివి రెండు
నీరజాక్ష వినుమ నీకు క్షుత్పి
పాస లుండ వయ్య బల నింక నబలను
దారిఁ జదివి నంత నో రఘువర 14.

చం. విరివిగఁ గీర్తిఁ బొందెదవు విద్యల రెంటిని నేర్వ నీవు వీ
రిరువురు పద్మసంభవున కింపుగఁ బుట్టిన సత్తనూజలే
పరగుదు మీఱి తేజమునఁ బన్నుగ నర్హుఁడ వీవు ధార్మికా
వర రఘు నందనా కొనుము భద్రము లుర్వి నొసంగ నే నిటన్ 15.

కం. కలవీ గుణమ్ము లన్నియు
వెలయుచు నీయంద రామ విరివిఁ దగఁ దపో
బలమున భరింప బహు విధ
ముల విలసిల్లు నివి రెండు ముదము నొసంగన్ 16.

కం. జలము స్పృశించి శుచి యయి వి
మలాత్ముఁడు గ్రహించెను బరమప్రీతిని వి
ద్యల రాఘవుఁ డంతఁ గుశిక
కులోద్భవ మహర్షి నుండి కొలిచి సు భక్తిన్ 17.

ఆ.వె. భూరి విక్రముండు మూరి విద్యాద్వయ
మ్మున రఘూత్తముండు తనరెఁ బ్రభల
శారద దివసములఁ జారుతరము వెల్గు
ఖరకరుఁడు సహస్రకిరణు భంగి 18.

కం. అలరింప సకల గురు సే
వలు కౌశికు గూర్చి రాఘవద్వయ మంతన్
లలిత సరయూ తటమ్మున
సలలిత మా ముగ్గురు నిసి శయనించి రటన్ 19.

తే.గీ. దశర థాత్మజు లిద్దఱు తద్ద బలు ల
నర్హులు నిదురింపఁ గసవు నందు నకట
గాధి సుతు వచనమ్ములఁ గరము మురిసి
కలసి నిద్రించిరి నిశ సుఖమ్ము దనర 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది రెండవ సర్గము.

# బాలకాండము

## సర్గము 23.

విశ్వామిత్రుని తోడ రామ లక్ష్మణులు పయనించి గంగా సరయూ సంగమ స్థలమునఁ గల
కామాశ్రమమున రాత్రి వసించుట.

కం. మునివర విశ్వామిత్రుఁడు
చని రాతిరి తెల్లవాఱఁ జక్కఁగ నంతం
గని కాకుత్స్థులఁ బర్ణ శ
యన సుప్తులఁ బలికె నిట్టు లాదర మొప్పన్ 1.

కం. అల కౌసల్యా నందన!
తెలవాఱెను మేలుకొనుమ దివిజార్హములే
కల విట దిన కృత్యమ్ముల్
వలయును జేయంగ రామ వర నరవృషభా! 2.

ఆ.వె. పలుకఁ గడు నుదార వచనమ్ములు మహర్షి
విని నృపాత్మజు లతి వీరు లంత
స్నాన మాచరించి సలిలప్రదానము
సేసి పరమ జపము చేసి రెడఁద 3.

తే.గీ. పగటి పను లెల్లఁ గావించి పార్థివాత్మ 4.

జులు మహా వీరు లిరువురు నలరి వంద
నమ్ము లాచరించి మునీంద్రునకుఁ దపో ధ
నునకుఁ జనఁగ సంసిద్ధులై తనరి రెలమి

కం. చని చని వీరభ్రాతలు
గని రమరాపగను ద్రిపథ గామిని సరయూ
వినుత నదీ సంగమ లా
స్యను జలదూర్మి భరిత జల సదమల గంగన్ 5.

కం. కని రొక యాశ్రమమును ఘన
ముని వర్గము వేల వర్షములు పుణ్యతమ
మ్మును దపములు సేసెడు స్థల
మును బరమానందముగ నపుడు రఘువీరుల్ 6.

కం. పదిలపుఁ బుణ్యాశ్రమము వి
శదముగ వా రెఱుఁగ నెంచి సంయమిచంద్రుం
గదిసి తమకమ్ము పొంగఁగ
నెద విశ్వామిత్రు నడిగి రిట్లు ముదమునన్ 7.

ఉ. ఎవ్వరి యాశ్రమ మ్మిది మునీంద్ర వెలుంగుచు నున్న దింపుగా
నెవ్వరు పూరుషోత్తములు నిందు వసింతురు సంతసమ్ముగా
నివ్వర కాననమ్మున నహీన తపోధన వాస యోగ్యమై
యివ్విధి నుండ కారణము నింత యెఱుంగఁగఁ గల్గె నిచ్చయే 8.

తే.గీ. అన విని చిరు నవ్వొలయఁగ నాస్య మందు
రామ వినుమ వచించెద రమ్య మైన
యిక్కుటీరమునం బూర్వ మెవ్వ రుండి
రో వివరముగా ననియె మున్యుత్తముండు 9.

మ. వినుతుం డింపుగఁ గామ నామమునఁ దా విద్వాంస వర్గమ్ములో
విను కందర్పుఁడు మూర్తిమంతుఁ డయి యాపేశంపుఁ జిత్తమ్మునన్
ఘనుఁ డా స్థాణువు నిశ్చయోద్వహునిఁ దత్కందర్పుఁడే వేఁచె పే
కొని తోడ్తోడ మరుద్గణమ్ములను దాఁ గూర్చుండ ధ్యానమ్ములో 10.

ఆ.వె. రుద్రుఁ డంతఁ గినిసి రౌద్రాక్షిఁ గాల్చె ర
ఘూద్వహ! యవయవము లూడి పడెను
వాని కామ నాము హీన బుద్ధు తనువు
నుండి తత్క్షణమ్ము మండి మండి 11.

తే.గీ. క్రోధము సెలంగ నెడఁద నుమాధవుండు
కాల్పఁ గాయము సర్వము కాముఁ డట్లు
హరునిచే నశరీరుఁడ యయ్యె నంత
నాఁటి నుండి లోకమ్మున మేటి వీర! 12.

తే.గీ. అంత నప్పటి నుండి విఖ్యాతుఁ డయ్యె
నతఁ డనంగుఁ డనఁగ మూరి యంగ దేశ
మయ్యె నెచ్చోటున విడిచె నంగములను
రాఘవేంద్ర! యచ్చోటు ధరాతలమున 13.

ఆ.వె. హరుని పుణ్య తమపు టాశ్రమమ్మిది యీ ము
ని వరు లెల్ల శిష్యు లవని నితని
కల పురాతన సమయము నుండి నిత్య ధ
ర్మ పరు లఘము లంట రావు వీరి 14.

కం. ఈ రాత్రి యిచటఁ గడపుదు
మో రామ శుభాస్య దివ్య యుగళ నదీ మ
ధ్యారామమునఁ దరింపుదు
మే రేపు దగ నదిని మన మెల్లర మెలమిన్ 15.

తే.గీ. స్నాన మొనరించి జపియించి జపము శుచుల
మై నరోత్తమ హవ్యమ్ము లలరఁ జేసి
యంతఁ జేర నెల్లరము పుణ్యాశ్రమమ్ము
భావ్య మగును గాంచ మన కిప్పట్టు నందు 16.

తే.గీ. వార లచ్చట నవ్విధిఁ బలుకు చుండ
నిజ తపోమహి మాక్షులు నెగడ నెఱిఁగి 17.

వారి మునులు చిత్తమ్ముల౼ బరమ హర్ష
మంది వేగ సమీపించి రంత౼ బ్రీతి

ఆ.వె. అర్ఘ్య పాద్యములు మహర్షి కాతిథ్యము
కౌశికున కొసంగి కరము ప్రీతి
రామలక్ష్మణుల౼ బరమ హర్ష మున సత్క
రించి రంత నుద్యమించి మునులు 18.

ఆ.వె. అంది మౌనివరుల యాతిథ్య మానంద
పఱచిరి తగ వారి వాక్య తతుల
నియత చిత్తముల మునివరేణ్యు లెల్లరు
సంధ్య వార్చి రంత సమ్మదమున 19.

తే.గీ. తేఁబడి యటుల నాశ్రమ దివ్య వాసు
లు మునుల వలన వారు సుఖముగ వారిఁ
గూడి కామాశ్రమము నందు వేడుకగను
బ్రీతి తోడ వసించిరి రాతి రంత 20.

కం. అభిరామ కథల నుడువుచు
నభిరాములు రామలక్ష్మ ణాధిప సుతులన్
విభవమ్ముగ సన్ముని జన
విభుండు గాధి సుతుఁడు మురి పించె భృశమ్మున్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది మూడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 24.

రామలక్ష్మణులతో గంగానది నుత్తరించి విశ్వామిత్రుఁడు వారికి సరయూ నదీ విశేషమును వివరించి

ఘోరారణ్యము ప్రవేశించి తాటక చరితమును దెలుపుట.

కం. చేరిరి నదీ తటి మహా
వీరులు రిపుమర్దను లట వెలయించి పనుల్
తీరుగఁ గాలోచితములు
వా రుంచి మునివరు ముందుఁ బ్రత్యూషమునన్ 1.

ఆ.వె. ఆ మునులును సువ్రతాత్ములు నెల్లరు
నంత మంచి నావ నచట నిడి మ
హాత్ము లలర వినయ మరసి విశ్వామిత్రుఁ
బల్కి రింపు గొలుపు భాషణములు 2.

చం. ధ్రువముగ మీరు చేయుఁ డధిరోహము నావ స రాజపుత్రులై
తివిరి శుభప్రదంపుఁ దగు తెన్నున నేగుఁడు జాగు చేయకే
కవిసి యనంగ వారి విని క్రన్నన నట్టులె యంచుఁ బ్రీతి మౌ
ని వలికి దాటె నబ్ధిగను నిమ్నగ నింపుగ వీరి తోడుతన్ 3.

తే.గీ. నది నడుమున కేతెంచిన నావ శబ్ద
మొకటి సంరంభమై పొంగు చుండ ఘోర
ముగ వినిరి రాఘవుండు తమ్ముండు దాని
విస్మయమ్ము నందిరి వారు వినిన యంత 4.

ఆ.వె. అంత రఘు వరేణ్యుఁ డడిగె నానది మధ్య
మునివరేణ్యుఁ గదిసి స్రోత నీటిఁ
జీల్చు చుండి మిగులఁ జెవుల వినంబడు
చున్నది యిది యేమియొ నుడువుఁ డని 5.

కం. చెప్పఁ దొడఁగె ధర్మాత్ముం
డప్పు డడుగ రాముఁడు మది నతి కౌతుకమే
చొప్పడ నిస్వన కారణ
మప్పావన సంయమీంద్రుఁ డతి విపులముగన్ 6.

మ. ఘన హర్షమ్మున మించు మానసముతోఁ గైలాస నామాచల 7.

మ్మున నిర్మించె సరస్సు మానస సరఃపుణ్యాఖ్యఁ బద్మాసనుం
డనయం బా సరసీ జలమ్ములె యయోధ్యం జుట్టి పాఱంగ న
య్యెను జక్కన్ సరయూ నదీ ప్రవరమే యిక్ష్వాకు వంశోద్భవా!

తే.గీ. ఇయ్యతుల శబ్దము జనించె నయ్య గంగ
నుండి రెండు నదుల నీళ్ల భండనమ్ము
వలన నుదయింప వినిపించె వందనమ్ము
సేయు మన్నదులకు రామ చిత్త ముంచి 8.

ఆ.వె. ధార్మికు లిరువురు కృతప్రణాము లయి న
దీ ద్వయమ్మునకుఁ గరద్వయముల
దక్షిణంపు దిక్కు తరలి పరాక్రము
లరుగఁ జాగి రంత హర్షముననను 9.

కం. చని వీక్షించి సుఘోరము
చని యెఱుఁగని కాననమ్ము సంకుల గహన
మ్ము నృపాత్మజుఁ డడిగెను స
న్ముని నైక్ష్వాకప్రవరుఁడు నుతు లిడి భక్తిన్ 10.

తే.గీ. ఈల పురుగుల రొదలతోఁ జాల భయ మొ
సంగు క్రూర మృగములు మెలంగు చుండ
నిండి పక్షుల కిలకిల లుండ ధ్వనులు
మించి దుర్గ మారణ్యము గాంచ నింక 11.

చం. వివిధము లైన పక్షు లిటఁ బెట్టఁగ బొబ్బలు భీకరమ్ముగం
గవియుచు నుండఁ గానన మృగమ్ములు వ్యాఘ్ర వరాహ సింహ సిం
ధువులు భయంకరమ్ము లయి తోరము బిల్వ ధ వాశ్వకర్ణముల్
దవమునఁ బాటలా తరు వితానము వెల్గుచు నుండ నింకనున్ 12.

తే.గీ. రేఁగు నేఱుమద్ది తుమికి నాఁ గుజము ల
నేకములఁ గీర్ణము లయి కన్పించు చుండ
దారు ణారణ్య మిది యేమి తాపసేంద్ర
తెలియఁ బల్కుఁడు కృప తోడఁ దెల్లముగను 13.

తే.గీ. నా విని యనె విశ్వామిత్ర పావన ముని
వత్స! విను మీ యరణ్యము పార్థివసుత!
దారుణం బెవ్వరి యధీనతం దనరునొ
చెప్పెదను విపులమ్ముగ నిప్పలుకులు 14.

తే.గీ. మున్నివి సుర శిల్పుల చేతఁ బన్నుగ నొన
రింపఁ బడ్డ రెండు పురులు సొంపు లలరు
నృవర! మలద కరూశము లవి విరివిగఁ
జెలఁగెఁ బ్రాభవముగను భూతలము నందు 15.

ఆ.వె. పూర్వము వధియింపఁ బురుహూతుఁ డా వృత్రు
నంటె మలము క్షుధయు నా బలారి
వశము చేసికొనియె బ్రహ్మహత్యా పాత
కమ్ము దేవపతినిఁ బమ్మి రామ! 16.

తే.గీ. అంత ఋషులు తపోధను లమరు లెల్ల
నింద్రుఁ జేయింప స్నానము నింపుగఁ గల
శోదకమ్ముల మల మెల్ల నూడిపడియె
హర్ష మొసఁగంగ భృశము దేవాధిపతికి 17.

కం. మేనునఁ బుట్టిన మలమును
వాని క్షుధను గూడ దేవ వరులు వసుధకున్
దానమ్ముగా నొసఁగి వా
రానందము వొంది రంత నత్యధికముగన్ 18.

తే.గీ. నిర్మలత క్షుధాహీనత నెగడ శుద్ధుఁ
డై పరఁగఁ బ్రభు వింద్రుఁడు హర్ష మంది
వరము లిచ్చె నా పట్టణ ప్రవరములకు
ఖ్యాతిఁ జెంద మలద కరూ శాఖ్య లంది 19.

కం. కని గౌరవింప దేశము
లను సాధ్వతి సాధు వని పురందరు నమరుల్ 20.

ఘనముగఁ బొగిడిరి పురములు
దనరెం జిర కాలము తగ ధనధాన్యములన్

తే.గీ. కొంత కాలము గడవఁగ నంత యక్ష
కన్య కామరూపిణి వేయి గజముల బల
మున్న తాటక సుందు బుధోత్తము సతి
భద్ర మగు నీకు రాఘవ! వచ్చె నటకు 21.

తే.గీ. శక్ర సమ బలుండు ఘన పరాక్రముండు
నామె తనయుండు మారీచుఁ డసురుఁ డుగ్ర
రూపుఁడు విపులాస్య మహా శిరుండు వృత్త
భుజుఁడు ఘనదేహి బాధించుఁ బ్రజల సతము 22.

ఆ.వె. జనపదముల రెంటి ననవరతము కరూ
శ మలదలను దాటక మల మతియు
దుష్టచారిణి బహు కష్టముల నొసంగి
లయ మొనర్చు సతము రఘువరేణ్య! 23.

కం. నివసించు నడ్డగించి య
తివ యొక యోజనమునకు నధికమై యిటనుం
డి వఱలు చోటునఁ జనఁ జన
దెవరి కయినఁ దాట కాఖ్య యీ వనమునకున్ 24.

తే.గీ. స్వీయ భుజ బల మాశ్రయించి రఘువీర!
నాదు పంపునఁ దాటక నాశన మొన
రించి దుష్టచారిణి నాతి నంచితముగఁ
దిరిగి నిష్కంటక మొనర్పు తివిరి దీని 25.

ఆ.వె. అరయ నెవరు దుస్సహాసుర యక్షిణి
ఘోర వనిత చేతఁ గ్రూర తరము
నాశన మయి నట్టి దేశము సేర స
మర్థు లగుట కల్ల మాట రామ! 26.

కం. క్రూరాసురి యివ్వనమును
దారుణముగ లయము సేసి దర్పమ్ముమ్మన ని
చ్చేరువ నింకను నిల్చిన
తీరు రఘువరేణ్య నీకుఁ దెలిపితి నంతన్ 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది నాలుగవ సర్గము.

# బాలకాండము

## సర్గము 25.

విశ్వామిత్ర మహర్షి రామునకుఁ దాటక సంభవము, వివాహము, శాపములను వివరించి
దుష్టచారిణి నామెను వధించు మని యది దోషము కాదని వక్కాణించుట.

కం. ముని యప్రమేయు నుచిత వ
చనములు రాముండు పురుష శార్దూలుండే
విని కుశికాత్మజుఁ గాంచి వ
చ నోత్తమముల ననె నిట్లు సద్వినయమునన్ 1.

ఆ.వె. యక్షు లల్ప వీర్యు లని విందుము మునీంద్ర!
మున్నటు లయిన మఱి యిన్నెలఁతికి
విస్మయంబు గాఁగ వేయి కరుల మించు
బల మబలకు నెట్లు వచ్చె చెపుఁడి 2.

కం. పలుకులు విని రాముఁ డనఁగఁ
దెలిపెద నా కథను రామ ధీవర! వినుమా
నలినాక్ష! యని ముని పలికె
బల మబలకు వచ్చె దత్త వర బల మహిమన్ 3.

ఉ. యక్ష వరుం డొకండు మును పబ్జదళాక్ష! సుకేతు నాముఁడే 4.

యక్షయ వైభ వాన్వితుఁడు నక్కట తా ననపత్యుఁడై యహో
యాక్షితి ఘోర దుఃఖ మది యేఁపఁగఁ జేసెఁ దపమ్ము నంతఁ బు
త్రేక్షణ గోరి యుగ్రముగ నిద్ధ గుణాఢ్యుఁడు వీర్యవంతుఁడే

చం. తప మొనరింప యక్షపతి తత్పర చిత్తత నంద నార్థమై
కృపఁగని పద్మ గర్భుఁడు సుకేతునిఁ బ్రీత మనస్కుఁడై కడుం
దపము ఫలింపఁ బుత్రికను దాటక నిచ్చె సహస్ర భీకర
ద్విప బల సన్నిభోగ్రతమ వీర్యను సుందరిఁ దోయజాక్షినిన్ 5.

కం. తనయుని నొక్కని నీయఁడు
వనజాసనుఁ డకట యక్ష వరునకు ముద మా
ర నళినలోచన నిడి పు
త్రిని నంతర్ధాన మయ్యె దేవాద్యుండే 6.

తే.గీ. పుట్టి పెరిఁగి పెద్దది యైన పూర్ణ శశి ని
భాననను రూపవతిని నిజాత్మజ నొసఁ
గెను సతిగ జంభ పుత్రుఁడు కీర్తి మంతుఁ
డైన సుందున కింపుగ యక్ష వరుఁడు 7.

తే.గీ. కొంత కాలమునకు యక్షి యంతఁ గనెను
బుత్రు మారీచు దుర్ధర్షు ముదము నంద
రాక్షసుం డయ్యె నాతండు రామచంద్ర!
శాపమంది ఘోరమ్ముగఁ బాప మతియె 8.

ఆ.వె. హతుఁడు కాఁగ సుందుఁ డల తాటక యగస్త్యుఁ
జంప నెంచి పగను సంయమీంద్రుఁ
బుత్రుఁ గూడి కోపము చెలంగ సంరంభి
ణి యయి మెలఁగు చుండి నెలఁత యంత 9.

మ. తినఁగా నెంచి నెడంద నామె వడి నేతెంపంగ గర్జించుచుం
దన పైకిం ద్వర నా యగస్త్యుఁడు ఘనోత్సంగుండు శాపం బిడెం
గని మారీచుని రాక్షసత్వ మిలఁ దత్కాలంబ తాఁ బొందఁగన్
వనితం దాటకఁ గూడ నారసియు శాపం బిచ్చెఁ గ్రుద్ధుండునై 10.

కం. నర మాంసము భక్షించుచు
విరూపిణిగ నీదు రూపు విడిచి నిలుతు విం
క రమణి పుడమి నని శపిం
చె రోత ముఖము నగు నంచుఁ జీత్కారమునన్ 11.

తే.గీ. తాటక కినిసి కర మగస్త్య చరితప్ర
దేశముల నెల్లఁ గదిసి బాధింపఁ జాగెఁ
దా శపింపఁ బడి ముని చేత రఘు వీర
దారుణమ్ముగ నిత్యము దయను వీడి 12.

కం. దారుణ యక్షిణిఁ దాటక
వారక వేధించు నాతిఁ బాపాత్మను నీ
వో రాఘవ తునుమాడుమ
క్రూర చరిత్ర వడిఁ గావ గోబ్రాహ్మణులన్ 13.

ఆ.వె. ముజ్జగముల నీమెఁ బురుషుఁ డన్యుఁ డెవండు
రామ నీవు దక్క భీమ శాప
దూషిత నెదిరించి దుష్ట చరిత్రను
నిలువ లేఁడు నిజము నిర్మలాత్మ! 14.

కం. దయఁ గాంచ స్త్రీ నిమిత్తము
సుయశోనిధి! నరవరేణ్య! శోకింపఁగ రా
దయ చాతుర్వర్ణ్య హితమ
నయ మగు కర్తవ్య మగును నరపాలురకున్ 15.

కం. క్రూరం బైనను మఱి య
క్రూరం బైన నఘ మయినఁ గూడిన దోషం
బారయఁ గావంగఁ బ్రజల
వారని కర్తవ్యము నరపాలుర కెల్లన్ 16.

ఆ.వె. రాజ్య భార మూను రాజుల కెల్ల స
నాతనంపు ధర్మమే తగ నిది 17.

సత్యసంధ రామ! చంపు మధర్మ్యను
ధర్మ మెఱుఁగ దీమె ధర్మనిరత!

తే.గీ. శక్రుఁడు వధింపఁగ వినమె చంప నెంచ
మేదిని విరోచన తనయ మెలఁత మంథ
ర నడరి మునుపు కాకుత్స్థ! రవికుల వర
రత్న! సత్యపరాక్రమ! రాజచంద్ర! 18.

ఆ.వె. విష్ణు వైన మున్ను వింటిమి వధియింప
భృగు సతీమతల్లి దృఢతమ వ్ర
త జనయిత్రి కవికిఁ దలఁప లోకమ్ములఁ
జేయ నింద్ర హీనమే యినవర! 19.

తే.గీ. ఇట్లనేక నరవరేంద్రు లితరులు నృప
నందన మహాత్ము లెద ధృతి నంది పురుష
సత్తము లధర్మ నారులఁ జంపి రదయఁ
గాన నిర్దయఁ జంపు నా యాన నీమె 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది యైదవ సర్గము.

# బాలకాండము

# సర్గము 26.

తాటకా సంహారము.

కం. ముని విక్రమ బాషణములు
విని ప్రాంజలియై తగఁ బృథివీపతి సుతుఁ డా
ఘనతర దృఢవ్రతుఁడు ప
ల్కెను రాముండు బదులు నయ గిర లేపారన్ 1.

కం. పిత్రాదేశమ్మున మఱి
పిత్రోచిత గౌరవమునఁ బేర్మిన్ విశ్వా
మిత్రాకాంక్షా గిర లవి
పాత్రమ్ములు నాకుఁ జేయ వడి నిశ్శంకన్ 2.

చం. జనకుని పంపు వింటి నట సద్గురు సంచయ సన్నిధాన మం
దు నిటు లయోధ్య లోన వినతుండను బంక్తి రథుండు పల్కఁగా
మునుకఁగ కౌశి కేద్ధ మునిపుంగవు నానతి నిత్య మాదర
మ్మున నెఱపంగఁ బాత్రములు పుత్రక దాఁటఁగ రాదు వానినిన్ 3.

తే.గీ. అట్టి నేను బిత్రాజ్ఞ వేదాంగ విజ్ఞు
మీ యనుజ్ఞను నెరవేర్తు నే యొకింత
సందియమ్ము వహింపక డెంద మందుఁ
దాటకా వధోత్తమమును దాపసేంద్ర! 4.

ఆ.వె. గురువరేణ్య తలఁచి గోబ్రాహ్మణ హిత మీ
దేశ సౌఖ్య మరసి యీశ! యప్ర
మేయ మీ వచన నికాయమ్ము సిద్ధింపఁ
జేయ నుద్య మింతు శీఘ్రముగను 5.

కం. నాఁ బల్కి వింటి మధ్యను
దాఁ బిడికిలి పే బిగించి దస్యు దమనుఁడే
జ్యాఁ బట్టి లాగి ఘోరము
గాఁ బిక్కటిలంగ దిశలు గర్జం జేసెన్ 6.

కం. అవియంగఁ దాటకా వన
నివాసు లాధ్వని చెలఁగ విని బెదరి మిగులం
గువదన తాటక సక్రో
ధ వదనయై మూర్చిలె వికృత ఖరాంగి యటన్ 7.

ఆ.వె. ఆ ధ్వని విని క్రోధ మడరంగఁ దాటక
రక్కసి మదినిం దలంచి సుంత
సంభ్రమించి యంత శబ్దంపు దిశఁ గాంచి 8.

పర్వుదీసె వేగ గర్వ మడర

తే.గీ. కని విరూపను వికృతాననను గడింది
గ్రోధ మూర్ఛిత నతివను ఘోర దేహ
ను గదిసెడు దాని నతి రయముగ వచించె
లక్ష్మణునిఁ గాంచి రాముఁడు లాఘవముగ 9.

ఆ.వె. భయద భీకరాంగిఁ బన్నుగఁ గాంచుమ
లక్ష్మణ వెఱపరు లరసిన దాని
గుండె లవయు నన్న నొండు వింత యగునె
సుంత యైన యేని చూడఁ జూడ 10.

తే.గీ. మించి మాయా బలమ్మున మీఱ రాని
రక్కసిఁ గనుమ లక్ష్మణ యిక్కురూపి
ణి నొనరించి నే నీ క్షణమున హృతశ్ర
వణ నసాగ్ర మరల్చుదు వనిత నింక 11.

ఆ.వె. చంప నెంచ నోప సౌమిత్రి స్త్రీ నిమి
త్తమ్ము చంప నెంతుఁ దరుణి వీర్య
మింక గమన మెల్ల శంక యుంచక సుంత
డెంద మందు మేలు కందు నిందు 12.

శా. రాముం డట్టులు పల్కుచుండఁగ మహారౌద్రమ్ముగాఁ గూయుచున్
భామా రాక్షసి క్రోధ మూర్ఛిత మహా బాహాద్వయం బెత్తి యా
రాముం గాంచి సముద్యమించి కదియన్ లంఘించి వీక్షించి తా
నా మౌనీశ్వరుఁ డాపి హుంకృతి జయంబాశించె రామార్థమై 13.

తే.గీ. అట్లు తర్జించి తాటక నంత ముని వ
రుండు హుంకారమున మీకు మెండుగ నగు
భద్ర మింక జయమ్మని పార్థివాత్మ
జులను దీవించె నత్తఱి సురుచిరముగ 14.

తే.గీ. దుమ్ము లేపి ఘోరమ్ముగ నమ్మడఁతుక 15.

తాటక రజో ఘనమ్మునఁ బాటవముగఁ
గప్పి రాఘవోభయుల నొక్క క్షణ మంత
మోహమున నక్కజమ్ముగ ముంచెఁ గినిసి

కం. నిజ మాయా మర్మమ్మున
సృజించి పాషాణ ఘోర వృష్టి నరవ రా
త్మజుల పయిం గురి యింపం
గ జనించెను రాఘవునకు ఘన కోపంబే 16.

తే.గీ. ఆ శిలా వర్షమును వేగ మంత రాముఁ
డాపె శరవర్షమున నాప నామె పర్వ
రోషమునఁ దన వైపు నురుతర బాణ
చయమున నఱికె దాని హస్తముల నంత 17.

కం. తెగఁ జేతు లలసి గర్జిం
పఁగ భీకర మలిగి చెంత వడి తమ్ముం డా
మగువ నరసి ముక్కును జెవు
లఁ గోసెఁ దత్క్షణమ ఘోర రౌద్రం బలరన్ 18.

ఉ. కోరిన రూపముం బడసి క్రూరత నూని యనేక రూపముల్
మూరుచు మాయమై కినుక బోరునఁ గుర్యుచు ఱాళ్ల వర్షమున్
ఘోరపు రీతి మాయలను గూర్చుచు మోహము కల్గఁ జేయుచున్
భైరవ మొప్ప యక్షిణి నభశ్చర తిర్గుచు నుండె నచ్చటన్ 19.

కం. మునుఁగ శిలా వర్షమ్మున
నినకుల తిలకద్వయమ్ము నీక్షించి తగన్
ముని కులపుంగవుఁ డా గా
ధి నందనుఁడు పల్కె నిట్లు ధీనిధి యంతన్ 20.

కం. దయఁ జూపఁ జాలు నింక యి
ది యజ్ఞవిధ్వంసిని కుమతి దురిత చారి
త్ర యడరి యచిరము బల వృ
ద్ధి యగును యక్షిణికి మాయఁ దెల్లము రామా 21.

ఆ.వె. చంప వలె నసురిని సంధ్యకుఁ బూర్వమ
బలము వృద్ధి యగును బరఁగ సంధ్య
రక్కసులకు మిగుల రాదు వారి సెదిర్ప
నేరి కైన రామ! వీరవర్య! 22.

తే.గ. అన ముని విని రాముం డంత యక్షి నశ్మ
వర్షము కురుయు నామె శబ్దగతి నెఱిఁగి
బాణ మేయ సమర్థుఁడు పార్థ సూనుఁ
డాపె నామె సాయకముల నంపి వేగ 23.

కం. శరజాలమ్మున నాపఁగ
నురు మాయా బలసమృద్ధ యుగ్రమ్ముగఁ దాఁ
బరువున లంఘించె నసురి
కర మలిగి యఱచుచు నంతఁ గాకుత్స్థులపై 24.

ఆ.వె. వేగ వచ్చునామె బిడు గన విక్రాంత
రాముఁ డురము నందు భీమ బాణ
మేసి చీరె నంత నిలఁ గూలెఁ దాటక
వీడె నసువు లవిసి వీర్య మణఁగ 25.

చం. ముదిత సహస్రలోచనుఁడు పూర్వదిశేశ పురందరుండు నా
త్రిదశులు సెల్ల హర్షమునఁ దేలి భృశమ్ముగఁ గాంచి కౌశికున్
సదమల తాపశేంద్రు ముని సత్తమ! సంతస మయ్యె మాకు నీ
కుఁ దనరు భద్ర మింపుగను గూరిమి రామునిఁ జూచి తెల్పుమా 26.

తే.గీ. మునివర! ప్రజాపతిప్రియ పుత్రుఁ డా భృ
శాశ్వ వర నందనులు తపశ్శక్తి యుతులు
పరమ సత్యపరాక్రమ భాసితులను
రాఘువునకు నివేదించు రక్తి తోడ 27.

ఆ.వె. ధృతిని ననుసరించు దేవ! నిన్నిట రాజ
నందనుండు తగును బొంద నడరి 28.

నిర్జరగణ హితము నెరవేర్పఁ గర్తవ్య
ములు కలవు ధరేశు పుత్రునకును

తే.గీ. పలికి సుర లిట్లు హర్షమ్ము వడసి తాప
సేంద్రుఁ బూజించి సద్భక్తి నేఁగి రంత
వచ్చి నట్టి విధమ్ము వియచ్చరు లిట
సంధ్య యరుగుదెంచె నపుడు జక్కఁగాను 29.

కం. మన మలరఁ దాటకావధ
జని తానందమున నంత సంయమి యా రా
ముని మూర్ధము చుంబించి వ
చనమ్ము లిప్పగిది పలికె సముచిత రీతిన్ 30.

కం. ఓ రామ! సుంద రాకా
రా! రాత్రి యిచట వసించి రమ్య వనమునన్
పే రేపకడయ యేఁగుద
మారయ నా యాశ్రమ వర మంబుజ నేత్రా! 31.

కం. విని విశ్వామిత్ర ముని వ
చనములు రఘు రాముఁ డడరి సంతోషమునన్
ఘన తాటకా వనము నం
దు నతి సుఖముగ నివసించె దోషావేళన్ 32.

ఆ.వె. వీత శాప వనము వెల్గె నద్దిన మతి
సుందరముగ మించి చోద్యముగను
చైత్రరథ వరవన సన్నిభమ్ము రమణీ
యమ్ము నందు నింక నెమ్మి నొసఁగ 33.

తే.గీ. రమణి తాటకఁ దునుమాడి రాఘవుండు
వడసి యమర ప్రశంసలు పన్నుగ నటఁ
గలసి మునితోడ వసియించె నలరి యచట
తెలుపఁ బడ నెమ్మి మునిచేతఁ దెల్లవాఱ 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది యాఱవ సర్గము.

## బాలకాండము

## సర్గము 27.

విశ్వామిత్ర మహర్షి రామునకు దివ్యాస్త్రము లొసఁగుట.

కం. నిసిఁ గడపి నెమ్మి గాధిజుఁ
డు సుయశుఁ డర నవ్వొలయఁ గడు మధుర గిరలన్
వసుధేశ సూను రాము న
రసి పలికెం బ్రీతి ముని వరర్షభుఁ డంతన్ 1.

ఆ.వె. సంతసించితి సుయశః ప్రభా! నీ కగుఁ
బార్థివాత్మజ!  బహు భద్ర మ్మర్విఁ
గరము ప్రీతి తోడఁ గాకుత్స్థ నీ కిత్తు
నస్త్ర సంచయమ్ము శస్త్ర యుతము 2.

తే.గీ. వేని చే నిర్జ రాసుర భీమ శత్రు
సంచయ ఫణి సగంధర్వ శక్తి నణఁచి
బలిమి వశులు కాఁగ జయమ్ము వడయు దట్టి
యస్త్రముల నెల్ల నిత్తు నీ కగును స్వస్తి 3.

తే.గీ. దండచక్రమ్ము దివ్యమ్ము ధర్మచక్ర
మింకఁ గాలచక్ర మరి భయంకరమ్ము
విష్ణుచక్రమ్ము నింకయు భీక రోద్ధ
తేంద్ర వజ్రాస్త్ర  శైవ శూలేంద్రములను 4.

తే.గీ. బ్రహ్మశిర మను నస్త్రమ్ము రాఘవేంద్ర!
యింక నైషీక మను నస్త్ర మింక బ్రాహ్మ 5.

మనెడు పరమాస్త్రమును మహా హస్తయుగ్మ!
నీకు నెలమి భద్రమ్ముగ నే నొసఁగుదు

ఆ.వె. గదలు జంట లవి శిఖరి మోదకి యనఁగ
దీప్తవంతము లిల దివ్యముగను
పురుష కుంజరమ్మ! పుడమినాథ తనయ!
దాశరథి! యొసఁగెదఁ దద్వయమ్ము 6.

ఆ.వె. వీర! ధర్మ కాల వారుణ పాశము
లుత్తమములు నీకు నిత్తు మూటి
ధారణీశ పుత్ర! దారుణాస్త్రమ్ముల
తోడఁ జెలఁగి యరులఁ దునుమ నాజి 7.

తే.గీ. శుష్క మార్ద్ర మనెడు రెండు సూర్యవంశ
తిలక! వజ్రాయుదమ్ములఁ దృప్తి నిత్తు
నింకఁ బైనాక నారాయ ణేద్ధ నామ
కాస్త్రముల నిత్తు రెంటిని ననఘ చరిత! 8.

తే.గీ. దశరథ సుత! యాగ్నేయాస్త్రము శిఖర మను
పేర వెలయు దాని దయితఁ బ్రీతి నిత్తు
మూరి రామ వాయువ్యాస్త్రము ప్రథన మని
వెలుఁగు దాని నొసంగుదు వీరవర్య! 9.

కం. ఘనతరము హయశిరోఽస్త్రము
వినుత క్రౌంచాస్త్రము రఘువీరవరా! యి
త్తును నిత్యము నీ వశమం
దు నలర శక్తిద్వయమ్ము దుర్వారమ్మున్ 10.

కం. కంకాల నామ ముసలము
కంకణ కాపాలములను గాకుత్స్థ నీ
యంకమ్ముఁ జేర నిత్తును
బింకమున ధరింత్రు వీనిఁ బెన్నసురు లిలన్ 11.

కం. వైద్యాధ రాస్త్ర రాజ మ
భేద్యమ్మీ ఖడ్గ వరము విఖ్యాతముగా
వేద్యమ్ము నందనమ్మన
విద్యాధిక! నీకు నిత్తుఁ బ్రీతిన్ రెండున్ 12.

ఆ.వె. గణ్య మానవాస్త్ర గాంధర్వ నామాస్త్ర
ములను స్వప్న శమనముల నొసంగు
వాని నింకఁ బరమ భాస్వర సౌర నా
మాస్త్ర మిత్తు నృపవరాత్మజ! తమి 13.

తే.గీ. తనరి వర్షించు శోషించు తాప మిచ్చు
విలపనం బిచ్చు మన్మథ ప్రియతరంపు
మోహ మిచ్చు నస్త్రము లింక మోహనం బ
నెడు పిశాచాస్త్రము గొనుమ నీరజాక్ష! 14.

తే.గీ. అస్త్రవరములు తామస మనఁగ సౌమ
న మన సంవర్ధనమ్ము ఘనతర మైన
మౌసలమ్ము సత్యాస్త్రమ్ము మఱియు రామ!
పరమ మాయాధరమ్మన పరఁగు వాని 15.

తే.గీ. మఱియు ఘోర తేజఃప్రభామయ వరాస్త్ర
ము పర తేజమును హరణమ్ము నొనరించు
నదియు మఱి త్వాష్ట్ర భగ శిశి రాదు లింక
మానవాస్త్రమునుం గొను మానవేంద్ర! 16.

కం. రామ! మహాబాహు! వినుమ
కామిత రూపముల నూను గమనీయముగా
నీ మహిమాస్త్రములు బృహ
ద్భీమ బల సమన్వితముల వేగమ కొనుమా 17.

తే.గీ. అట్లు వలికి మునివరేణ్యుఁ డంత శుచి య
యి తగఁ బ్రాఙ్ముఖుఁడై ప్రీతి నెల్ల మంత్ర
ముల నొసంగెను విధియుక్తము రఘువంశ 18.

వార్ధి పూర్ణ చంద్రునకు నపార కరుణ

ఆ.వె. దేవతలకు నైన నీ వరాస్త్ర చయము
నెల్ల నడరి కొంట వల్ల కాదు
విప్రవరుఁ డొసంగెఁ బ్రీతిగ నవి యెల్ల
దశరథాత్మజునకుఁ దత్క్షణమ్మ 19.

చం. జప మొనరించు చుండ నట సంయమి గాధి సుతుండు నిష్ఠతో
నృప తనయుండు రాఘవుని నెమ్మినిఁ జేరి తదస్త్ర నాథులే
యపరిమి తానురక్తి నిజ హస్తయుగమ్ము మొగిడ్చి భక్తి మం
చి పలుకు లిట్లు వా రనిరి చేటుల మెల్లరు నీకు రాఘవా 20.

ఉ. ఎయ్యది నీకు నిష్ట మగు నింపుగ నయ్యది సేయు వారమే
నెయ్యము మీఱ భద్ర మగు నీకు ననంగఁ బ్రసన్నుఁడై కరం
బ య్యలఘూత్త మాకృతుల నందఱిఁ దాఁకి కరమ్మునం దగం
జయ్యనఁ బల్కె నుండ మని సమ్మతినిం దన చిత్త మందునే 21.

కం. అంతం బ్రీతి మనమ్మున
సంతృప్తిం జెంది కరము చక్క నరిగి తాఁ
జెంతకు విశ్వామిత్రున
కెంతయు భక్తి ప్రణమిల్లి యేఁగఁగ నిలిచెన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది యేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 28.

విశ్వామిత్రుఁడు రామునకు నుపసంహారాస్త్రములతో మఱి కొన్ని యస్త్రముల నొసఁగుట.

కం. కొని యస్త్రమ్ముల ముదిత వ
దనుండు శుచియై ఘనుండు దశరథ సూనుం
డు నడచుచు రాముఁ డడిగెను
ముని విశ్వామిత్రు నిట్లు పుణ్యాత్ము నటన్ 1.

కం. మునిపుంగవ నేఁ గొంటిని
ఘనాస్త్రముల నెల్ల దేవ! కాఁగ సురల కె
ల్ల నజేయుఁడ నిఁకఁ గోరుదుఁ
గొన నుపసంహారములను గూడ మహాత్మా 2.

కం. అనఁగా రాముం డది దా
విని విశ్వామిత్రుఁడు వ్రత విఖ్యాతుఁడు స
న్ముని వరుఁ డతి ధృతిమంతుఁడు
ఘన సంహారముల నొసఁగెఁ గారుణ్యమునన్ 3.

సీ. సత్యవంతమ్మును సత్యకీర్తిని ధృష్ట రభసములఁ బ్రతిహారతరమును నృ
ప పరాఙ్ముఖమ్ము నవాఙ్ముఖమును మఱి లక్షాక్ష విషమముల ధృఢనాభ
మింక సునాభము నిఁక దశాక్ష శత వక్త్ర దశశీర్ష శతోదరముల నింకఁ
బద్మనాభము సునాభము మహానాభము దుందునాభములను దుస్సహముల
తే.గీ. జ్యోతిషమ్ము కృశన మింక నుభయము లగు
విమల నైరాశ్యములను బ్రశ్రమన దైత్య
ములను యోగంధర హరిద్రములను విరుచి
ని మఱి శుచి మహా బాహుల నిష్కలి నిఁక 4.

సీ. స్థిరముగ రామ సార్చిర్మాలి ధృతిమాలి వృత్తిమంతు రుచిర ముత్త మాస్త్ర
ములఁ బిత్ర్యసౌమనస లస దస్త్రముల విధూతమును గరము నాతత కర
వీరకరమ్మును మూరి ధనము ధాన్యమును గామరూపముఁ దనరి కామ
రుచిని మోహమ్ము నురుత రావరణమును జంబుక సర్వనాభంబుల మఱి
తే.గీ. యింక సంతాన వరణము లీ వరాస్త్ర
ములు భృశాశ్వునికి దయిత పుత్రు లెల్లఁ
గామరూపులు రాఘువ కాంతి తనులు
భద్రమగు గొను పాత్రత పరఁగు నీకు 5.

ఆ.వె. అంతరాత్మలోన సంతసించి కరము
బాగు బాగని యని పార్థి వాత్మ
జుండు ధీర రాఘవుండు గైకొని వాని
సన్నుతించి మౌనిచంద్రు నడరి 6.

ఉ. అందఱు మూర్తిమంతు లయి యస్త్ర వరమ్ములు దివ్య దేహులై
చిందుదు రెల్ల రింపు దగఁ జేరిరి కొందఱు వహ్ని సన్నిభుల్
కొందఱు ధూమ సన్నిభులు కొందఱు భాస్కర చంద్ర తుల్యులే
యందఱు నంజలించి యని రానతి రాఘవ యిమ్ము మాకు నాన్ 7.

ఆ.వె. మానసమున నిల్పి మహితాత్ము లార సా
హాయ్యము వలయు తఱి నడరి చేయఁ
గలరు కాక పే వెడలుఁ డిపుడు యథేచ్ఛ
ననియె వారి తోడ నినకులుండు 8.

తే.గీ. అంత నామంత్రణము సేసి యా రఘువరు
నట్ల యగుఁ గాక యని పల్కి యంద ఱింకఁ
జేసి తగ రామునకుఁ బ్రదక్షిణము వచ్చి
నట్టి దారి యేఁగిరి వారు బిట్టలరుచు 9.

కం. పడసి మహాస్త్రజ్ఞానము
పుడమి పతి సుతుండు మదిని మోదం బలరన్
నడచుచు మధుర గిరల ని
ట్లడిగెను మునిముఖ్యు నంత నాశ్చర్యముగన్ 10.

తే.గీ. ఏ మిది మునీంద్ర! కొండకు నీ సమీప
మందు మేఘు సన్నిభ పాదపాకరమ్ము
వెల్గు చున్నది మిక్కిలి వింత కాంతు
లూని కౌతూహలము నాకు నుబ్బె హృదిని 11.

తే.గీ. మృగ సమావృతము భృశము హృదయ రంజ
నమ్ము దర్శనీయము వివిదమ్ము లైన
విహగముల మధురములు విభిన్న నాద 12.

ముల నలంకృతమై కడు చెలఁగుచుండె

తే.గీ. రోమహర్షణము వనము నో మునీంద్ర!
దాటితి మని తోఁచు నెదను దనర సౌఖ్య
మిచ్చట విరివి యాశ్రమ మెవ్వరి దగు
నియ్యది వచింపుఁ డింపుగ నెల్లఁ గృపను 13.

ఆ.వె. ఎచ్చటి కడరి వడి వచ్చి పాపులు దుష్ట
లు తవ యజ్ఞ విఘ్నరతులు బ్రహ్మ
ఘాతకులు మునీంద్ర! వీత కృపా ఖర
మానసులు చరింత్రు దాని నింక 14.

తే.గీ. ఎచట యజ్ఞ కార్యమ్ముల నచల ధృతిని
మునివరేణ్య1 రక్షింపఁ దగునొ చెలంగి
యెయ్యసురుల వధింపఁగ నియ్యకొనఁగ
వలయు సర్వము విననెంతుఁ బల్కుఁ డెలమి 15.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది యెనిమిదవ సర్గము.

# బాలకాండము

# సర్గము 29.

విశ్వామిత్రుఁడు రామునుని సిద్ధాశ్రమ విశేష మెఱింగించి తా నా యాశ్రమమున నుండుటను దెలిపి చేర నచ్చటి మునులు విశ్వామిత్రునిఁ బూజించి రామలక్ష్మణులకు నతిథి సత్కారములు సలుపుట.

కం. అవధు లెఱుంగని యిక్ష్వా
కు వీరుఁ డవ్విధి నడుగఁగఁ గుశి కేద్ధ కులో
ద్భవుఁ డా విశ్వామిత్ర ము 1.

ని విని వచింపం దొడంగె నిశ్శేషముగన్

ఉ. ఇక్కడ రామ! దీర్ఘభుజ! యీశుఁడు విష్ణువు విశ్వనాథుఁడే
పెక్కు యుగమ్ము లింపుగను బెక్కు శతమ్ములు వాస ముండెఁ దా
మిక్కిలి పెద్ద తాపసుల మీఱి తపమ్మును దివ్య యోగముం
జక్కఁగఁ జేయ నెంచి మదిఁ జక్ర గదాసి దరాది ధారుఁడే 2.

కం. ఇది పూర్వము వామనుఁ డు
న్నది సిద్ధాశ్రమ మనం దనరి పెల్గిన య
ట్టిది తపపు సిద్ధి నరసిన
యదియ మహాత్మునకు రామ! యాశ్చర్యముగన్ 3.

చం. మనమలరన్ విరోచన కుమారుఁడు నబ్బలి చక్రవర్తి యిం
ద్రుని సహితమ్ము నిర్జరుల దోర్బల యుక్తి జయించి యెల్లరన్
ఘనులు మరుద్గణమ్ముల జగత్త్రయ మెల్లను నేలఁ జాగె కీ
ర్తి నలుదిశల్ సెలంగ నట దేవత లెల్లరు చింత వొందఁగన్ 4.

కం. క్రతు వొనరించుచు నుండఁగ
నతండు వైరోచనుండు సానల సుర సం
హతి దైన్యమ్మునఁ గమలా
పతి యాశ్రమమున హరిఁ గని పలికెను భీతిన్ 5.

చం. జరుపుచు నున్న వాఁడు బలి చక్కఁగ నిప్పుడు శ్రేష్ఠ యజ్ఞమున్
గురుతర దాన శీలి యటఁ గోరిన వారికి వాంఛితమ్ములన్
నరులకు నిచ్చు నెమ్మి సురనాథుఁడ వామన రూప మంది పే
సురగణ కార్య సిద్ధి యది చొప్పడఁ జేయుమ యజ్ఞవేళలో 6.

తే.గీ. కశ్యపుం డగ్ని తుల్యుఁ డా కాలమందు
నదితి సహితమ్ము తపము సహస్ర వర్ష
ములు ప్రభల వెల్గుచును జేసి పుండరీక
లోచను దనిపె వరదుఁ బురుషవరేణ్యా! 7.

తే.గీ. కంటి నేను నిన్ను దపః ప్రకాశ మహిమ
నీశ! యో తపోమయ తపోరాశి కేశ
వా! తపోమూర్తి పురుషోత్తమా! తపాత్మ
క! యని కశ్యపుఁ డంత ననియెను మఱియు 8.

ఆ.వె. నీ శరీర మందు నేఁ జూతు జగ మెల్ల
నీ వనాదివి మఱి నేర రాని
వాఁడ వేరి కెపుడు వారిజాక్ష! వరద!
శరణుఁ జొత్తు నీదు పరమ పురుష! 9.

కం. హరి ప్రీతిఁ బలికెఁ గశ్యపు
దురిత విహీను నరసి యటఁ తోరపు భద్ర
మ్మరయుదు వీ వర్థుండవు
వర మడుగుమ యిష్టుఁడ వయ పన్నుగ నంచున్ 10.

తే.గీ. అనఁగ మధుసూదనుం డట్లు నంజలించి
కశ్యపుండు మారీచుఁ డవశ్య మిమ్మ
వరద! సువ్రత యదితికి సురల కింక
నాకు సుప్రీత మైనది నా వచించె 11.

చం. అదితికి నాకు దేవ! కరుణార్ణవ! పద్మదళాక్ష! నందన
త్వ దశ వహింప నెంచు మిలఁ దమ్ముఁడ వింద్రునకై చెలంగుమా
త్రిదశుల కార్త చిత్తులకు దేవ వరేణ్య! నిలింపమర్దనా!
కుదు రగు సాయ మంచితము కూర్మి నొనర్పఁగఁ జింత సేయుమా 12.

ఆ.వె. చేసిన పను లెల్ల వాసిగ సిద్ధింప
నిచట నీ దయను సముచిత రీతిఁ
జెలఁగు నింపుగ నిది సిద్ధాశ్రమ మనంగ
లెమ్ము దేవదేవ! సమ్మదముగ 13.

ఆ.వె. అంతఁ బుట్టె విష్ణు వదితికి వామన
రూపమున నసురు సమీపము బలి
చక్రవర్తి నరయఁ జాగె దామోదరుఁ 14.

డమర నిచయ కార్య మరసి రామ!

ఉ. మూడు పదమ్ము లా బలిని భూమినిఁ గోరి గ్రహించి లోకముల్
మూడిటి నాక్రమించి వడిఁ బూర్తిగ లోక చయాత్ముఁ డాప్తుడుం
దోడును భూత రాశికి బుధుండు బలిం దగ నాపి యింద్రునిన్
మూడు జగమ్ము లేలు మని పూర్వపు రీతిని నిల్పె ఁనిగా 15.

ఆ.వె. వామనుఁ డిట మున్ను వసియించె నీ యాశ్ర
మమున శ్రమవినాశి మనుజవర్య!
భక్తి మీఱ నాకు వామనుని పయి వ
సించు చున్న వాఁడ నిచట రామ! 16.

కం. రక్కసులు వత్తు రిచ్చట
కుక్కున విఘ్నమ్ము లిత్తు రుద్ధతి దుష్టుల్
చక్కం బెట్టవలెం జుమి
యిక్కడె రఘువీర వారి నెల్లర బలిమిన్ 17.

ఆ.వె. ఇప్పుడే చనియెద మిద్ధ సిద్ధాశ్రమ
ముత్తమమ్మునకును జిత్త మందుఁ
దలఁపు మింక నిది యెటులగునొ నా కిట
నీకు నటుల యంచు నెమ్మి రామ! 18.

కం. చని చేరి యాశ్రమము వా
రినిఁ గూడి రఘూత్తములను లీలా లీలన్
మునివరుఁ డింపుగ వెల్గెను
బునర్వసుఁ గలిసిన మంచు ముగియ శశి వలెన్ 19.

తే.గీ. చూచి మునులు విశ్వామిత్రు లేచి లేచి
సంభ్రమమునఁ బూజించిరి సముచితంపు
రీతి సిద్ధాశ్రమ నివాసు లాతతముగ
హర్ష మందిరి కాంచి మహర్షి నపుడు 20.

ఆ.వె. రాజ సుతులఁ గాంచి తేజమున వెలుంగు 21.

వారి నిద్దఱి నట భాను చంద్ర
సన్నిభులను నతిథి సత్కారము లొనరిం
చిరి ముదమ్ము నంది పరమ మునులు

కం. అంత రఘు నందనలు వి
శ్రాంతిని సుంత గొని శత్రు సంచయ దమనుల్
సంతసమున వచియించిరి
శాంత మునివ్యాఘ్రుఁ గాంచి చార్వంజలులై 22.

ఆ.వె. నేఁడ దీక్షఁ గొనుఁడు వేడుకగను సిద్ధి
కలుగు జన్నమునకు వలదు చింత
క్షేమ మగును దేవ! సిద్ధాశ్రమము సత్య
నామ మనఁగ నీకఁ దనరు మునీంద్ర! 23.

కం. ఇన వంశోద్భవులు ముద
మ్మునఁ దియ్యందనపు వచనములు ధైర్యముగా
నన విని విశ్వామిత్రుఁడు
ముని నియతేంద్రియుఁడు దీక్షఁ బూనెను నియతిన్ 24.

ఆ.వె. రాత్రి గడపి కలసి రాకుమార వరులు
లేచి ప్రొద్దున సమయోచితములు
కార్యములను దీర్చి కాకుత్స్థు లిద్దఱు
కార్యదక్షులు శుచి కాయు లైరి 25.

కం. జలకము స్పృశించి నియమం
బలరఁగ జపమాచరించి యానందమునం
జెలఁగి హుతాగ్ని వికాసుని
నల విశ్వామిత్రుఁ గొల్చి రంతన్ భక్తిన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నిరువది తొమ్మిదవ సర్గము.

# బాలకాండము

## సర్గము 30.

రామలక్ష్మణులు మారీచుని మూర్ఛిల్లఁ జేసి దూరము విసిరి రాక్షసులను జంపి విశ్వామిత్రుని
యాగము పూర్తి యగు నట్లు కాచుట

కం. తావును బ్రొద్దు నెఱుఁగు మే
ధావులు రాజాత్మజు లరి దమనులు స్థల యు
క్తావసర వాక్య పారగు
లా విశ్వామిత్రుఁ గాంచి యని రిబ్బంగిన్ 1.

ఆ.వె. దేవ వినఁ దలంతు మీ వివరమ్మును
రక్కసు లిరువుర నరయఁగ నౌ స
మయ మ దెద్ది జాఱ నయము కా దా వేళ
మాకు నిద్దఱి కిటఁ దాఁక కుండ 2.

తే.గీ. పలుక నుత్సాహముగ నిట్లు త్వరిత గతులు
పార్థివ కుమారు లిద్దఱు పరమ మునులు
సంతసించిరి వినినంత స్వాంతములను
బొగిడి రెంతయు వారల సుగుణ వరుల 3.

ఉ. అప్పుడు పల్కి రిట్టుల మహా మును లారసి వారిఁ బ్రీతితో
నిప్పటి నుండి మీ యిరువు రింపుగ షణ్ణిశ లప్రమత్తులై
యెప్పుడు కావఁగా వలయు నిప్పుడు సంయమి కౌశికుండు తా
నొప్పుగ దీక్ష నుండెఁ దగ నుత్తమ మౌనము మీఱి చల్పుచున్ 4.

ఆ.వె. ఋషుల మాటలు విని యినకుల తిలకులు
శ్రద్ధ తోడ నాఱు రాత్రులు పవ
లు లట మేలుకొంచు నలుదెస లారసి
యాగ వనము కాచి రలపు లేక 5.

కం. చేరువకుఁ జేరి కార్ముక
ధారులు వీరులు విపక్ష దమనులు తత్కా
ర్యారంభులు రఘు వంశో
ద్ధారకు లారయ నిలిచిరి తగఁ గౌశికునిన్ 6.

ఆ.వె. కడవఁ గాల మన్న కాంచి తమ్ముని఼ బల్కె
నాఱవ దివస మది యడుగిడెఁ గను
సిద్ధ మగుమ యింక చెన్నుగ లక్ష్మణ!
యప్రమత్త ముండ నవసర మిది 7.

కం. అనుచుండ రాముఁ డిట్టులు
తనరగ నుత్సాహ ముబ్బి త్వరితుం డయి వె
ల్గెను వేదికయె పురోహితు
లును గురువుల తోడుత ప్రభలు చెలఁగ దిశలన్ 8.

ఆ.వె. దర్భలు విరులు సమిధలు చమసము సుక్కు
లలర వేదిక యట నందముగను
దనర ఋత్విజ సహితమ్ముగ నా కౌశి
కుండు ప్రజ్వలించు చుండె భృశము 9.

తే.గీ. మంత్ర నాదమ్ములఁ జెలంగి మఖ వరమ్ము
సాగుచుండ యథారీతి సమ్మదముగ
నంత జనియించె భీకరం బైన శబ్ద
మొక్క టాకాశ మందు మహోద్ధతముగ 10.

తే.గీ. ఆక్రమించి నభమ్మును సక్రమముగ
వర్ష కాల మందు వెడలు వారిదమ్ము
వోలె మాయ కల్పించుచు భూరి రాక్ష
సప్రవరు లేఁగుదెంచి రచ్చటి కిరువురు 11.

తే.గీ. అనుచ రాసురు లెల్లరు ఘనులు తోడు
రాఁగ మారీచుఁడు సుబాహు లేఁగుదెంచి 12.

భీమ కాయులు కురియించి రా మఖంపు
వేది యందు రక్తౌఘము భీతి కొలుప

ఆ.వె. తడిసి రక్త మందుఁ దద్వేది మండెను
రాముఁ డుఱికి యంత రక్కసులను
గ్రూరకర్ముల దివిఁ గూడి యుండఁగఁ గాంచె
నొక్క త్రుటినిఁ గోప ముక్కు మీఱ 13.

కం. తమ పైకి దుముకు వారినిఁ
గమలాక్షుఁడు గాంచి యంతఁ గని లక్ష్మణునిం
దమకమ్ము మీఱఁ దా వచ
నము లిట్లు పలికెను ఘన ఘనస్వానమునన్ 14.

తే.గీ. మానవాస్త్రము విసరిన మనుజ భోజ
నులను గాంచు లక్ష్మణ! గాలి వలనఁ జెదరు
మేఘముల భంగి వీరి సౌమిత్రి! యక్క
జమ్ముగ నిటఁ బ్రయోగింపఁ బమ్మి నేను 15.

కం. అని పలికి యంత మారీ
చుని వక్షము నందు నేసెఁ జోద్యపు టస్త్ర
మ్మును బరమోదారమ్మును
ఘన భాస్వరము విలు సెత్తి కాకుత్స్థుండే 16.

ఆ.వె. బాణము తగులంగ వక్షమం దసురుండు
వంద యోజనముల యందుఁ బడెను
సాగరోదకముల సంపూర్ణముగను మా
రీచుఁ డెగురుచు విపరీత బాధ 17.

తే.గీ. చల్లనౌ ముల్కి బలమున సడలఁ దెలివి
గిట్టు గిట్టునఁ దిరిగి యెగిరి పడిన న
సురుని మారీచుఁ గని రఘువరుఁడు లక్ష్మ
ణిని నరసి పల్కె నివ్విధి నెమ్మి నంత 18.

తే.గీ. శీతలమ్ము సుమ్మీ యస్త్ర శేఖరమ్ము
మోహపఱచి దూరమ్ము గొంపోవుఁ జంప
నెంచ దియ్యది సౌమిత్రి! గాంచు మాన
వాస్త్రమును ధర్మకలితమ్ము నంచితమ్ము 19.

ఆ.వె. చంపెద నిఁక దుష్ట సంచారులను రక్త
మారగించు వారి నదయుల నఘు
కర్ములఁ గ్రతు నాశ కారు లీ దైత్యుల
లక్ష్మణ! సకల గుణ లక్షితాంగ! 20.

కం. అని కొని యాగ్నేయాస్త్రము
ఘనుఁడు సుబాహువు నురమ్ము గ్రక్కున వ్రయ్యం
గ నడరి వేయ నతఁడు పుడ
మినిఁ గూలెం జచ్చి యంత మేలన మునులే 21.

కం. వాయువ్యాస్త్రమ్ముం గొని
యా యసురవ్రాత శేష మంతయుఁ జావన్
వేయఁగఁ బరమోదారుఁడు
సాయకము ముదము వడసిరి సంయమి వర్యుల్ 22.

ఆ.వె. యజ్ఞ విఘ్నకారు లందఱిఁ జంపంగ
రాక్షసులను మూరి రాముఁడు ముని
పూజితుండు నయి సముదము వెలింగెను
శక్రు భంగి మున్ను జయము నంద 23.

తే.గీ. పూర్తి కాఁగ జన్నం బట మునివరుండు
గాంచి దిక్కులు కాఁగ నకంటకమ్ము
హర్ష మంది విశ్వామిత్రుఁ డనియె రాము
నరసి మృదు భాషణమ్ముల నంత నిట్లు 24.

తే.గీ. గురు వచనములు నిల్పితి గురు భుజుండ
యయితినిఁ గృతార్థుఁడను రామ యడరి చేసి
తీవు సిద్ధాశ్రమపుఁ బేరు నెలమి నిజము 25.

రవి కులార్ణవ పూర్ణ చంద్ర! పురుషేంద్ర!

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 31.

విశ్వామిత్రుఁడు మునులు రామలక్ష్మణులతోఁ గలసి మిథిలా నగరమునకుఁ బోవుచు శోణా నదీ తీరమున రాత్రి వసించుట.

కం. ఫలియింపఁగఁ దమ పని య
ట్టుల రాఘవు లిద్దఱుం గడు ముదమ్మున వీ
రులు చిత్తమ్ము లలర వా
రలు గడపిరి యాశ్రమమున రాతిరి యంతన్ 1.

తే.గీ. రేయి గడచి ప్రభాతమ్ము డాయ నిత్య
కార్యము లొనరించి యుచిత గతిని రామ
లక్ష్మణులు ప్రీతి ముని వరులను గుశిక కు
మార వర్యు విశ్వామిత్రుఁ జేరి రంత 2.

కం. చేరి ముని పుంగవుని యం
గార నిభము వెల్గు వానిఁ గౌశికుఁ బర మో
దారులు రఘు వీరు లనిరి
గౌరవముగ నతు లొసంగి కమ్మని పలుకుల్ 3.

ఆ.వె. కింకరులము దేవ యంకము చేరితి
మిట్టు లాన తీయుఁ డెలమి మాకుఁ
జేయ వలయు పనులు మీ యిష్ట మైనవి
యెల్లఁ జేయు వార ముల్ల మలర 4.

కం. విని యా మాటలు హర్ష 5.

మ్మున తాపస వర్యు లెల్ల ముందిడి బ్రహ్మ
ర్షిని విశ్వామిత్రు ననిరి
కని యా కాకుత్స్థు నంత గారవ మొప్పన్

తే.గీ. ధర్మనిష్ఠుఁడు జనకుండు ధరణి ధవుఁడు
మిథిలకు ఘనుండు తలపెట్టె మేటి యజ్ఞ
మొకటి చూడ నేఁగెడు వార ముత్సహించి
రామ! యచ్చటి కేము నరవర ముఖ్య! 6.

ఆ.వె. నీవు కూడ రామ నెమ్మి మా తోడుత
రాఁ దలంపు కూడి లక్ష్మణు ఘను
విల్లు గొప్ప దొకటి వీరవర్య! కలదు
చూడ నద్భుతమ్ము పాడి నీకు 7.

తే.గీ. అడ్డెఱుఁగని శక్తి వెలుఁగు దొడ్డ విల్లు
ఘోరము నొసంగిరి సురలు వీర! మఖ స
దస్సు నందు రాజునకు మనస్సలరఁగ
మున్ను సూర్యకు లార్ణవ పూర్ణ చంద్ర! 8.

తే.గీ. విల్లు నెత్త సాధ్యమ్ము కా దెల్ల సురల
కింక గంధర్వుల కసురు లింక ఘోర
రాక్షసుల కన్యులకు నన రామ! మాన
వులఁ దలఁప నేల యిన కుల తిలక! యింక 9.

కం. బల్లిదులు రాజపుత్రులు
విల్లు బలము నేర నెంచి వీర్యోద్ధతులే
తల్లడిలిరి యెత్త బలము
డుల్లఁగ లజ్జితు లయిరి కడుంగడు నచటన్ 10.

తే.గీ. ఆ ధనూరత్న మింకయు యజ్ఞ వరము
మైథిలుండు సేయుచు నుండ మానవేంద్ర!
గాంచఁ గలము జక్కంగ నక్కజముల రఘు
రామ! యేఁగఁగఁ దగు నెల్లరము నచటికి 11.

ఆ.వె. జనకుఁ డడిగె విల్లు చారుమధ్యను సర్వ
దేవతలను జేసి దివ్యముగను
యజ్ఞ రాజ మొకటి యజ్ఞఫల మనంగ
పూర్వ కాల మందుఁ బురుషవర్య 12.

ఆ.వె. రాజ గృహము నందు రమ్యముగ ధను రు
త్సవ దినమ్మున వివిధంపు పుష్ప
గంధ ధూపముల నగరువుల ధనువు న
ర్చింతురు రఘువర యుచిత విధమ్ము 13.

ఆ.వె. ఇట్లు పలుక నంత సెలమి విశ్వామిత్రుఁ
డరుగఁ దొడఁగె నంత నవ్వన వర
దేవతల యనుజ్ఞ వావిరినిం గొని
మునులు రాఘవులును దనర వెనుక 14.

తే.గీ. స్వస్తి యగు మీకు సిద్ధించె ఫలము నాకు
నేను సిద్ధాశ్రమము నుండి నిర్గమించి
గంగ కుత్తరమున శిలాకాయ సంయు
తమ్ము హిమనగమ్మున కింకఁ దరలు చుంటి 15.

తే.గీ. అని ప్రదక్షిణ మొనరించి యాశ్ర మొత్త
మమ్మునకుఁ బ్రీతి వనమున కమ్మునీంద్రుఁ
డేఁగఁ దొడఁగె నుత్తర దిక్కు నెంచి కౌశి
కుండు సంతోష ముప్పొంగి యుండ మదిని 16.

కం. శత శక టాధికముల తో
డుత వేదాధ్యయనులు గురుఁడు నడువ మును గా
ధి తనయుఁడు వెడలి రాతని
గతిఁ గాంచి ముదముగ నంతఁ గాకుత్స్థులతో 17.

తే.గీ. మించి సిద్ధాశ్రమమున వసించు నట్టి
మృగ విహంగ గణమ్ములు హృదయము లవి 18.

యంగ పెన్నంటి యరుదెంచ నరసి వాని
ని మరలించె మహర్షి యంత ముద మలర

కం. దూర మరిగి మార్గమ్మున
వా రా రవి చేరు చుండఁ బశ్చిమ దిక్కుం
జేరి మునిఁ గూడి గాధి కు
మారుని శోణాఖ్య నదిని మాగధి నంతన్ 19.

కం. ఇనుఁ డస్తమింప స్నానం
బొనరించి హుతాశనునకు నొసఁగి హుతమ్మున్
ఘన మును లెల్లరు ముందిడి
ముని విశ్వామిత్రు వాసము నొనర్చి రటన్ 20.

తే.గీ. రాముఁడును లక్ష్మణునిఁ గూడి యా మునులకు
వందనము సేసి భక్తిని సుందరుండు
గాధి నందనునకు నమస్కార మంతఁ
జేసి కూర్చుండె ముని ముందు శీఘ్రముగను 21.

ఆ.వె. అంత రాముఁ డడిగె నతి కుతూహలముగఁ
బురుష కుంజరుండు మూరి ధర్మ
రతుని ఘన తపోనిరతుని విశ్వామిత్రు
వినయ వచనము లవి వెలుఁగ నిట్లు 22.

కం. దేవా వన సుసమృద్ధం
బై వెలుఁగుచుఁ గానిపించు నగు భద్రంబే
యీ వర దేశం బెయ్యది
నే విన నెంచెదఁ దెలుపుడు నిజ రూపమ్మున్ 23.

కం. రాముని వాక్యప్రేరణ
నా ముని కుశికాత్మజుఁడు మహా సన్నియముం
డా ముని సంఘము మధ్య మ
హా మండల వివరణమ్ము నంతయు నిచ్చెన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది యొకటవ సర్గము.

# బాలకాండము

## సర్గము 32.

విశ్వామిత్రుఁడు రామునకు కుశికుని వంశమును వివరించుట, కుశనాభుని కుమార్తెలను
నూర్వురను వాయువు కుబ్జలుగా మార్చుట.

కం. కలఁడు కుశ నామ సంయమి
నలినాసన సంభవుండు న్యాయజ్ఞుండున్
లలితవ్రతుండు సజ్జన
కుల పూజకుఁడు రఘురామ! గుణ భాసితుఁడున్ 1.

ఉ. తాను విదర్భ కన్యఁ దగు దారగ సత్కుల జాత నెన్ని సం
తానము వొందె నల్వురను దండ్రికి తుల్యులు నాఁ గుశాంబుడు
న్మాన ఘనుండు నైన కుశనాభుఁ డధూర్తరజస్సు నింకయుం
గానఁ గనిష్ఠుఁ డా వసువు కౌశికులై తనరంగ ధాత్రినిన్ 2.

తే.గీ. కాంతిమంతుల నుత్సాహవంతు లింక
సత్యభాషణులను ధర్మ సంయుతులను
 క్షత్రధర్మమం దిష్టుఁడై పుత్ర వరులఁ
గాంచి పలికెను గుశికుండు నంచితముగ 3.

తే.గీ. ధర్మమును బొంది మిక్కిలి ధరణి పాల
నమ్ము గావింప మది నెంచుఁ డిమ్ముగ సుతు
లార యనఁ దండ్రి విని నల్వు రంత లోక
మాన్యు లొనరించిరి పుర నిర్మాణ మడరి 4.

మ. చని నిర్మించిరి తాఁ గుశాంబుఁ డల కౌశాంబీపురశ్రేష్ఠముం 5.

వన సద్భాసిత తన్మహోదయపురప్రాశస్త్య మింపారగన్
మనుజుం డా కుశనాభుఁ డద్భుతము ధర్మారణ్య రాజత్పురిం
దను జాధూర్త రజస్సు తద్వసువు సచ్చైలవ్ర జాఖ్యం బురిన్

ఆ.వె. ఈ వసుమతి వసువె యింపుగఁ గట్టిన
పురము పంచశైల వరము లుండి
చుట్టు భాసిలిగను సుందరముగ విల
సిల్లు చుండు రామ! యెల్ల జగతి 6.

కం. మాగధి యను నది మగధము
లో గమనము సాగుచుండ లోచనములకున్
బాగుగ ముద మిడ నైదు మ
హా గిరులకు మధ్య పెలయ నలరు ప్రజ మనన్ 7.

ఆ.వె. ఇమ్మహాత్ముఁడు వసు పేర్పాటున నది యీ
మాగధి ప్రవహింప వేగ తూర్పు
దిశకుఁ బంట లింకఁ దేట నేలలు సంత
తమ్ము పెల్గుచుండు సుమ్ము రామ! 8.

కం. కలిగిరి కుశనాభునకు సు
త లచ్చర ఘృతాచి వలనఁ దద్దయుఁ బ్రీతిన్
లలితాంగులు నూర్వురు రవి
కుల తిలకా! రాజ ఋషికి గుణభాసితలే 9.

ఉ. జవ్వను లింక సుందరులు చక్క నలంకృత లెల్ల రెల్లరున్
రివ్వున వచ్చి రవ్వనికి లీలఁగ నాడుచు వర్షకాలపుం
దివ్వెలు క్రొమ్మెఱుంగు లన దేహపుఁ గాంతులు పెల్గు చుండఁగన్
నవ్వులు పిక్కటిల్లఁగను నారులు పాడుచు వాద్యఘోషలన్ 10.

ఆ.వె. చెన్ను మీఱు మేను లున్న వా రనుపమ
లన్ను లెన్న నెల్ల వన్నె లందు
నువిదలు చరియింప నుద్యాన వన మందుఁ
దార లనఁగఁ దోయదముల మధ్య 11.

కం. కని యా సుందరులను యౌ
వనవతుల వనమ్ము నందుఁ బరమ గు ణోపే
త నలిన నేత్రల వాయువు
ఘనుఁడు జగద్వ్యాపకుఁడు తగ ననియె నిట్లున్ 12.

ఆ.వె. కోరు చుంటి మిమ్ము నో రమణీ మణు
లార! నెమ్మి నాకు దార లగుఁడు
విడుఁడు మానుషత్వ మడరి యింక నగును
వృద్ధి యాయువునకు వెలఁదు లార! 13.

తే.గీ. అడఁగు యౌవనమ్ము సతము నరయ మించి
మనుజులకు నిక్కము వచింప వనిత లార!
పొందఁ దగు నక్షయంబైన చందమునను
బడయుఁదన మమరత్వము పడఁతు లార! 14.

కం. విని గాలిదేవు పలుకులు
ఘన కార్య సమర్థుని శత కన్యామణులే
తనర నపహాస్య మిందు వ
దన లాతనిఁ గని పలికిరి తగు వచనములన్ 15.

ఆ.వె. అమర వర్య పుడమి యందు సకల భూత
రాశి లోపలఁ గదలంగ నగును
నీకు నీదు ప్రతిభ మాకుఁ దెలియు నెల్లఁ
గించపఱుప మమ్ము నెంచ నేల 16.

తే.గీ. కన్యలము కుశనాభ భూకాంతునకు సు
రోత్తమా మేము మఱి శక్తియుతలము నిను
బదవి నుండి చ్యుతునిఁ జేయఁ బావనంపు
మాదు తపముఁ గాచికొనుట మాకుఁ బాడి 17.

తే.గీ. జనకు నవమాన పఱుపకు సత్య వాది
ననిల దేవ! దుశ్చింతన! యడరి స్వయము 18.

మేము వరుఁ గోరు సమయమ్ము భూమి నకట
దుండగ మ్మెన్నఁడును రాకయుండుఁ గాక

ఆ.వె. తండ్రియే దొర యగు దైవము నగు మాకు
సెల్లరకును మదిని సెంతు మట్ల
యేని కిచ్చు మమ్ము వాని సేవింతుము
భర్త యంచు నెంచి భక్తి తోడ 19.

ఆ.వె. వారి మాటలు విని వాయు వాగ్రహ మంది
తూఱి యవయవముల దుర్భరముగ
దైవము విభుఁ డంతఁ దా వంచి గాత్రము
లెల్ల వారిఁ దల్లడిల్లఁ జేసె 20.

ఆ.వె. వారు వాయు దేవ భగ్న గా త్రార్తలై
తండ్రి గృహము సేరి తనయ లంత
భీతి సిగ్గు తోడఁ బృథ్విఁ గూలి రట క
న్నీరు పొంగి పాఱ నెలఁత లకట 21.

కం. నృపతి ప్రియ నందనలఁ గాం
చి పరమశోభనల దీన చిత్తల భగ్నాం
గ పరిత్రాసలఁ బలికెను
విపరీ తార్త హృదయుండు వెఱఁగంది యిటుల్ 22.

తే.గీ. తనయ లార! యే మిది యెట్టి ధర్మ మణఁపఁ
బడెను గుబ్జ లెవ్వరు మిమ్ము పడతు లార!
చేసిరి పలుక రేమియుఁ జేరి చుట్టు
నంచు నిశ్వసించి నిలిచె నా నరపతి 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది రెండవ సర్గము.

## బాలకాండము

# సర్గము 33.

కుశనాభుని తనయలు వాయువు దుష్కార్యమును దెలుప నతఁడు వారి ధర్మ నిష్ఠకు  మెచ్చి బ్రహ్మదత్తుఁ డను రాజర్షితో వారి వివాహము జరుపుట. బ్రహ్మదత్తుని కర స్పర్శతో వారి కుబ్జత్వము తొలఁగి పూర్వ సౌందర్యమును బొందుట.

కం. జనకుని కుశనాభుని ధీ
జను వచనము లాలకించి శత కన్యలు వం
దనములు పాదముల శిరసు
ల నుంచి చేసి పలికిరి లలనలు మృదువుగన్ 1.

కం. అంతటఁ జరించు మారుత
మెంతయు నొప్పించె మ మ్మహీనపు గతినిం
బంతము వూని తలంపక
నింతయు ధర్మమ్ము మానవేంద్రా! వినుమా 2.

ఆ.వె. తండ్రి చాటు తనరు తనయల మేము స్వ
తంత్ర వర్తనమ్ము దలఁప లేము
చని యొసంగ మమ్ము జనకు నర్థింపుమ
భద్ర మగును నీకు వాయుదేవ! 3.

ఆ.వె. పలుక నిట్లు వినఁడు పాపచింతన నిండ
మదిని గాలిదేవుఁ డదుమ బలిమి
తండ్రి మమ్ము నంతఁ దల్లడిల్లి భృశము
వచ్చితి మిట కంచుఁ బల్కి రపుడు 4.

కం. సుత లా నూర్వురి దీన ల
లిత వచనమ్ము లవి విని మురిసి ధార్మిక భూ
పతి తేజోవపువు పలికెఁ
బ్రతివచనము లుత్తమతమ బాలల తోడన్ 5.

తే.గీ. ఓర్పరులు సేయఁ దగు నట్టి యోర్మి తనయ 6.

లార! చక్కఁగ మీరెల్ల రచటఁ జూపి
యైకమత్యము చాటించి వీఁక నాదు
కులము గాచితి రింపుగ వలయు రీతి

తే.గీ. తాలిమి పురుషుల కయినఁ దరుణుల కయి
న నగు సుందర మగు భూషణమ్ము సురల
కెంచ నది దుష్కరమ్ము మీరెల్ల రంచి
తముగఁ బ్రకటించి రోరిమిఁ దనయ లార! 7.

తే.గీ. క్షమయె దానము యజ్ఞము క్షమయె యశము
క్షమయె సత్యము ధర్మము క్షమ వలనసె
నిల్చు జగమెల్ల సుతలార! నిక్కముగను
బల్కి నృపతి యిట్టులు పంపె వారిఁ బ్రీతి 8.

ఆ.వె. దేవ విక్రముండు భూవరుం డంతఁ గు
మారితెలను వీడి మంత్రవిదుఁడు
మంత్రులఁ బిలిపించి మంతనములు జరి
పెఁ దగు వరునిఁ దెలుపఁగ దుహితలకు 9.

కం. చూలి యనెడు తాపసి యా
కాలమున శుభాచరణుఁడు కలఁ డస్థలి తా
భీలబ్రహ్మ తపో ధీ
శాలి తపస్సిద్ధి వడసి శాంతాత్ముండై 10.

ఆ.వె. తపము చేయుచుండఁ దాపసి గంధర్వి
కదిసె సోమద యను కాంత యూర్మి
లా తనయ, రఘువర! యాతత భద్రము
నీకు నగును గాక, నెమ్మి నంత 11.

ఆ.వె. సేవలు ముని కెలమిఁ జేయుచు నమ్రత
ధర్మ నిరతఁ దనరి తరుణి యుండ
సంతతమ్ము గాంచి సంయమి మనమున
సంతసమ్ము నందె నంత రామ 12.

ఆ.వె. తగిన కాల మందుఁ దాపసేంద్రుఁ డబల
నరసి పలికె నిట్టు లతివ! భద్ర
మగును నీకు ముదము నందితి నీ కెట్టి
ప్రియము సేయ వలయుఁ బ్రీతి నడుగు 13.

కం. సంతుష్టుం డని సంయమి
కాంత యెఱిఁగి వాక్యవిజ్ఞ గంధర్వి నిజ
స్వాంతంబున నుప్పొంగఁగ
సంతోషము మధుర మగు వచనములఁ బలికెన్ 14.

తే.గీ. కాంతిమంతుని బ్రహ్మ నికాశు బ్రాహ్మ
ణత్వమందు ధార్మిక వరేణ్య! ఘన వేద
విద తపోధనుండు తనయుని దయ నీయ
వేఁడెద మునీంద్ర నాఁ బల్కి వినయ మలర 15.

ఆ.వె. భర్త లేఁడు నాకు భార్యను గాను నే
నేరికిని ద్విజవర! నిన్ను జేరి
యుంటిఁ గృప వహించి యొసఁగఁ గుమారుని
నర్హుఁడవు మునీంద్ర యంచు వేఁడె 16.

చం. అనినఁ బ్రసన్నుఁడై కడు మహర్షి వరేణ్యుఁడు మెచ్చి యంత నం
దను దమి బ్రహ్మదత్తుఁ డను దద్ద ప్రసిద్ధుని మానసాత్మజున్
వనిత కొసంగెఁ జూలి సుతుఁ బార్థివ ముఖ్యుని సోమదేయు నో
యినకుల వంశవర్ధన! నరేంద్ర కుమార! ధనుర్ధ రోత్తమా! 17.

కం. నృపవరుఁడు సోమదేయుఁడు
సుపురము కాంపిల్య మందు శోభాయుతుఁడై
యపరిమిత ముదమ్మున దే
వపతి దివము నందు భంగి వసియించె నటన్ 18.

తే.గీ. అచట కుశనాభుఁడు తన కన్యలను నూర్వు
రను దలంచె ధార్మికుఁడు నరపతి బ్రహ్మ 19.

దత్తునకు నిచ్చి బెండిలి నుత్తమముగ
జరుప రఘువంశ వారాశి చంద్ర! రామ!

తే.గీ. బ్రహ్మదత్తు నాహ్వానించి పార్థివ వరుఁ
బ్రీత చిత్తుఁడు కుశనాభుఁ డాతనికి నొ
సంగెఁ దన కుమార్తెల నెల్ల సంతసమ్ము
చెలఁగఁ దేజోనిధి వసుధా వలయ ధవుఁడు 20.

కం. క్రమముగ గ్రహించెఁ గన్యా
సమూహ కర పద్మములను సంతోషముగా
విమలుండు బ్రహ్మదత్తుం
డమరపతి బలారి భంగి నలరుచు రామా! 21.

ఆ.వె. స్పర్శ మాత్రముసన శతకన్య కుబ్జత్వ
ము లణఁగి మఱియు జ్వర ముక్త లైరి
వారు సమ్మదముగఁ బరమంపు దేహ కాం
తుల వెలింగి రంతఁ జెలువముగను 22.

ఆ.వె. కాంచి వాయు ముక్త కాంతామణుల నృప
తి కుశనాభుఁ డంతఁ దిరిగి తిరిగి
హర్ష మందెఁ జిత్తమందు భృశమ్ముగఁ
దనయ లట్లు వెలుఁగ ధవునిఁ గూడి 23.

కం. పరిణయము సేసి యట్టుల
ధరణీపతి బ్రహ్మదత్తు దారల తోడన్
గురువులతో ననిపె మురిసి
కరము మహీపతిని నంతఁ గాకుత్స్థ వరా! 24.

కం. తనయు నుచిత కార్యమ్మును
గని గంధర్వి ముద మొంది కరముం గోడం
డ్రను గాంచి పొగిడె సోమద
తనయుం గూడి తగురీతిఁ దత్సమయమునన్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది మూడవ సర్గము.

# బాలకాండము

# సర్గము 34.

విశ్వామిత్ర వంశ కథనము, రాత్రి వర్ణనము.

కం. పెండిలి యై స్వీయ సుతా
షండము నాథ సహితమ్ము చనఁ గుశనా భో
ద్దండ నృపతి పుత్రేష్టి న
ఖండ విధిం జేసె నంతఁ గమనీయముగన్ 1.

ఆ.వె. క్రతువు జరుగు చుండ రాజేంద్రుఁ గుశనాభుఁ
గదిసి బ్రహ్మ సుతుఁడు విదిత యశుఁడు
కుశుఁడు తండ్రి పలికెఁ గూరిమి తోడుత
హర్ష మొదవ నిట్టు లవని పతికి 2.

ఆ.వె. పుట్టు నిన్ను బోలు పుత్రుండు పుత్ర! ధా
ర్మికుఁడు నీకు నింక మేది నీశ
గాధి నాముఁ డతఁడు ఘనకీర్తి సుస్థిర
మరయు దీవు పుడమి నతని వలన 3.

కం. అని యిట్లు కుశుఁడు కుశనా
భునితో ధరణీశుతో నభో మార్గమునం
జనె నంత బ్రహ్మలోకము
సనాతనము విస్మయముగ సద్గుణ రామా! 4.

తే.గీ. పుట్టెఁ గుశనాభునకు నొక్క పట్టి కొంత
కాలమునకు ధర్మిష్ఠుఁడు గాధి పేరు 5.

వడసి యంచితముగ రామ! పుడమిఱేఁడు
సంతసింప మిక్కుటముగ చారునేత్ర!

ఆ.వె. గాధి నాదు తండ్రి కాకుత్స్థ! పరమ ధా
ర్మికుఁడు రామ! యట్టి మేటి కుశ కు
లంపు సుతుఁడ నేను నొంపునఁ గౌశికుం
డ నయితి నటు లవని నంబుజాక్ష! 6.

తే.గీ. అక్కయు గలదు సువ్రత యామె పేరు
సత్యవతి భర్త ఋచికుండు సత్యరతుఁడు
పతి ననుసరించి చేరె నభము సకాయ
మడరి కౌశికీ నది యయ్యె నామె రామ! 7.

తే.గీ. లోక కళ్యాణ మూహించి వీఁక దివ్య
నదియె పుణ్యోదకయు హిమ నగము నాశ్ర
యించి పాఱుచు నున్నది మించి నాదు
సోదరీ మణి రాఘవ! యాదరముగ 8.

ఆ.వె. అక్క మీది ప్రేమ నక్కడ హిమవన్న
గ తటిని నివసింతు సతత మేను
కరము సుఖము తోడఁ గౌశికీ నది తటి
రాఘు వాన్వయ వర రత్న రామ! 9.

చం. సదమల చిత్త పుణ్యవతి సత్యవతీ సతి ధర్మ మందు ని
ల్చు దయ వహించి సంతతము శుద్ధ చరిత్ర పతివ్రతామ త
ల్లి దనరు కౌశికీ నది సలీలఁగఁ బాఱు హిమాల యాద్రినిన్
విదితపు భాగ్యశాలిని భువిం గల యేఱుల మిన్న యెంచఁగన్ 10.

తే.గీ. నియమము కొఱకై చేరితిని విడిచి జన
మాన్య! యచ్చోటు సిద్ధాశ్రమ వరము నిను
గలసి నీ తేజ మలరంగ బలిమి తోడ
సిద్ధిఁ బొందితి నచ్చట శీఘ్రముగను 11.

కం. ఇది నా వంశక్రమ మిం
క దేశ వివరమ్ము రామ కథిత మ్మగు ని
య్యది నీ యడిగిన ప్రశ్నకు
సదుత్తరమ్ము వచియింప సమయము మీఱెన్ 12.

తే.గీ. భద్ర మగు నీకుఁ గాకుత్స్థ నిద్ర వోవఁ
దొడఁగు మిఁక నర్ధరాత్రియుఁ గడచు చుండెఁ
కథల నుడువ జాగయ్యెను గాదె రామ!
మనకు మార్గ విఘ్నము లవి తనరఁ దగదు 13.

కం. అలమెను జీఁకటి దిశలఁ గ
దల కున్నవి తరువు లెల్ల దాశరథీ! ప
క్షులు మృగ కాయమ్ములు క
న్నులు మూసి యలసి పరుండెను నిశ సెలంగన్ 14.

తే.గీ. మాయ మయ్యెను సంధ్య క్రమముగఁ దార
లు గ్రహములు ప్రోగయి పెలుంగులు పెదచల్లఁ
గాంతిమంతములు కరము గగన మందుఁ
గన్నులు పఱచి నట్టులు కానిపించె 15.

చం. వెలుఁగఁగఁ జంద్రుఁ డభ్రమున బేరిన చీఁకటి బాఱఁ దోలుచుం
గలువల ఱేఁడు శీతలపుఁ గాంతి కరమ్ముల వ్యాప్తిఁ జేయుచుం
జెలువము మీఱ జీవ తతి చిత్త సరోజము లుల్లసిల్లగం
దలరుచు లేచె నబ్ధిజుఁడు తారల కీయఁగ హర్ష భాగ్యమున్ 16.

కం. తిరుగం జాగు నిట నిశా
చరమ్ములు ముదమ్ముగ వరుసఁ జరింతురు ని
వ్వర యక్ష రాక్షసులు రౌ
ద్రులు పిశితాశనులు ఘోరులు నిశా వేళన్ 17.

ఆ.వె. పలికి యిట్టు లాగఁ బరమ మునీంద్రుఁడు
బాగు బా గని ముని వరులు గాధి
నందనునిఁ బొగడిరి యందఱు నత్తఱి 18.

నంతరాత్మ వొంద సంతసమ్ము

ఆ.వె. కుశిక వంశము కడు గొప్పది ధర్మము
నంద యుండు సతము నెందు బ్రహ్మ
సములె యీ కుశకుల సంభవు లెల్లరు
నరవరులు మహాత్ము లరయఁ బుడమి 19.

కం. మునివర! విశ్వామిత్రా!
కనిన విశేషించి మీరు ఘన కీర్తిధనుల్
ధుని యా కౌశికి నిజ కుల
మును వెలిగించు నది సుమ్మి పుణ్యచరిత్రా! 20.

ఆ.వె. పశ్చిమాద్రి సనిన భాస్కరుని పగిది
కౌశికుండు ముని నికాయ గిరలు
విని యుపక్రమించెఁ దనరి నిదుర కంతఁ
బరమ మునివరుండు బ్రహ్మ నిభుఁడు 21.

కం. రాముఁడు లక్ష్మణు తోడుత
నా ముని గీర్తించి విస్మయం బేపారన్
వేమరు సద్భక్తిఁ దగ మ
హా ముదమున నిద్రవోయె నంత సుఖముగన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది నాల్గవ సర్గము.

## బాలకాండము

## సర్గము 35.

విశ్వామిత్రుఁడు రామునకు గంగానదీ చరిత్రమును వివరించుట.

కం. సోణానదీ తటిని స
ప్రాణాలి పరుండ రాత్రి వాచంయము సు
శ్రేణులు రాఘవులు జగ
త్త్రాణు లుదితి గాధిజుండు తగఁ బలికె నిటుల్ 1.

తే.గీ. రాత్రి గడచి పూర్వాసంధ్య రామ! పొడిచె
లెమ్ము లెమ్ము భద్రమగును జుమ్ము నీకు
సిద్ధ మగు మింకఁ బయనింప నిద్ధచరిత!
రఘుకులార్ణవ పూర్ణచంద్ర! పురుషేంద్ర! 2.

ఆ.వె. అన విని రఘువరుఁడు దినకృత్యము లొనర్చి
గమనమును దలంచి సముద మడరి
తొడఁగి పలికె నిట్లు తోయజనేత్రుండు
వినయ మధుర గిరలు వెలయ నంత 3.

కం. నది జల మగాధమే యిసు
క దిన్నియలఁ గూడి యుండెఁ గాంచుఁడు శోణా
నది నెప్పగిదిని దాటం
గఁ దగును బ్రహ్మర్షి! మనకుఁ గౌశికవర్యా! 4.

కం. నా నన రాముం డప్పుడు
దా నాలోచించి యంతఁ దాపసి పలికెన్
మౌని వరేంద్రుల నారసి
యే నుడివెదను మును లెల్ల రేఁగిన దారిన్ 5.

తే.గీ. అనఁగ నట్లు విశ్వామిత్రుఁ డా మునిగణ
మంతఁ బయనింపఁ జాగెను సంతసముగఁ
జూచుచు ననేక వనములఁ జోద్యముగను
వెనుక నడవ రాఘవు లింక మునియు వేగ 6.

చం. దరి గతి దూర మేఁగఁగ ముదమ్ముగ నర్ధ దినమ్ము చన్న నె
ల్లరు నట గాంచి రంచిత జలస్వన మోదిత పక్షిసంఘ సు
స్వర విలసత్తటిం బులిన జాహ్నవి సర్వ నదీ విశిష్టనుం 7.

బరమ చలన్మహోజ్జ్వల దభంగ తరంగ సుసంగ గంగనున్

కం. ఆ నది యొడ్డున వాస
మ్మూని మునింగి యుదకముల మునివరు లంతన్
పే నియతి తర్పణము లిడి
ధ్యానించి పితరుల నెల్లఁ దద్దయు భక్తిన్ 8.

తే.గీ. అగ్నిహోత్రము వెలిఁగించి హవి నొసంగి
యమృత తుల్యము వారెల్ల రంత సంత
సించి గంగా నదీ తీర మంచితముగఁ
గదిసి నిల్చిరి చుట్టును గౌశికునకు 9.

తే.గీ. అంతఁ గాంచి విశ్వామిత్రు నట్ల జాభు
నడిగె రాముఁ డిట్టులు దేవ యెడఁదఁ దెలియ
నెంతు నెట్లు గంగానది సంతసమునఁ
జేరెఁ గడలి ముజ్జగముల మూరి వెలసి 10.

కం. ప్రోత్సాహ మంది కాకు
త్స్థోత్సాహ వచనములఁ బరమోన్నత గంగా
సత్సంభవ మిఁక వృద్ధియు
నుత్సాహముగ వచియించె నుద్యుక్తుండై 11.

తే.గీ. రామ హిమవంతుఁ డను బేర రంజిలుచును
ధాతువుల ఖనియై వసుధాధరమ్ము
కల దతని కుద్భవించిరి కన్య లిద్ద
ఱప్రతిమ రూపవతులు చంద్రాస్యలు భువి 12.

ఆ.వె. మేరు శైల పుత్రి పేరు మనోరమ
హిమ నగేంద్ర పత్ని విమలచరిత
కన్య లిద్దఱకును గారవమ్మునఁ జూచు
జనని యగు సుమధ్య యినకులేంద్ర! 13.

తే.గీ. అందు గంగ జ్యేష్ఠా సుత యయ్యె హిమ న 14.

గేంద్రునకు నుమ యన్న పేరెలమిఁ గలిగె
నా ద్వితీయ కుమారికి నద్వితీయు
లిద్ద అందమునను రాఘవేంద్ర! వినుమ

తే.గీ. అమరు లడిగిరి హిమవంతు నమర కార్య
మునకుఁ బెద్ద కుమార్తెను మూడు గతులఁ
బాఱు నట్టి నదిని గంగ భద్రగతినిఁ
దీసి కొనిపోవ నింపుగ దివిని నుండ 15.

ఆ.వె. ఇచ్చె ధర్మ మెంచి హిమవంతుఁడు సుతను
గోరి ముజ్జగములకు హిత మంత
లోకపావన నది వీఁక స్వేచ్ఛఁ దిరుగు
దాని గంగ నెలమి ధర్మరతుఁడు 16.

కం. చని రిఁకఁ గృతార్థు లయి గం
గను గొని దేవతలు ముజ్జగమ్ములకును బ్రీ
తినిఁ గోరు నట్టి వారలు
మనస్సుల ముదమ్ము మీఱ మనుజ వరేణ్యా! 17.

ఆ.వె. ఆ ద్వితీయ సుత మహా తపోధన నిల్చె
నుగ్ర మైన వ్రతము నూని శైల
తనయ దుర్భర మగు తపముఁ జేసెను దృఢ
చిత్తయై రఘువర! శ్రేష్ఠముగను 18.

ఆ.వె. రుద్రునకు నొసంగె నద్రివరేణ్యుఁడు
త్రిజగ దర్చితను గిరిజ నుమను బ
రమ తపస్సహితను రమణీ లలామను
నప్రతిమున కంత సప్రమదము 19.

తే.గీ. శైలరాజ సుతలు లోక సంచ యార్చి
త లిరువురు గంగ సర్వ నదులకు నెల్ల
మిన్న యియ్యుమ యన్నుల మిన్న రామ!
చారు శీల సంపన్నలు శూరవర్య! 20.

కం. ఇది యెల్ల నీకుఁ జెప్పితి
నది మున్ముందు దివికిఁ జనిన విధము నంతన్
సదమల గతి గతులకు సె
ల్లఁ దలంపఁ ద్రిపథగ గంగ లావణ్యముగన్ 21.

కం. సురనది సుందరి పర్వత
వర నందన యమర లోక వాసిని తానై
దురిత విహీనయు నిర్మల
తర జలవాహినియునై సతతము వెలుంగున్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది యైదవ సర్గము.

# బాలకాండము

# సర్గము 36.

కార్తికేయుని జననము, పార్వతీ దేవి దేవతలకు భూదేవికి శాపం బిచ్చుట.

కం. ముని సెప్పినట్టి యా కథ
విని కీర్తించి రఘువంశ వీరు లుభయులున్
ఘన రామలక్ష్మణు లరసి
ముని విశ్వామిత్రు ననిరి మోదమ్మలరన్ 1.

తే.గీ. చెప్పినది ధర్మయుక్తము జ్యేష్ఠురాలు
గంగ కథ యింకను నగ వరాంగజ వివ
రమ్ము లెల్ల మనుష్య జన్మమ్ము దివ్య
భవము విస్తారముగ దేవ! పలుకఁ గలరు 2.

ఉ. ఏలను లోకపావని చరించును మూడు జగమ్ము లందు సే 3.

లీలలఁ గర్మ సంతతి ఫలింపఁ ద్రిమార్గ నదీ లలామగా
వాలెను మూడు లోకములఁ బావన ధర్మగతిజ్ఞ ముఖ్య! మే
మీ లలితంపు గాథ విన నెంతుము మౌని వరేణ్య! పల్కుఁడీ

తే.గీ. రాఘవులు వల్క నవ్విధి రమ్యతర త
పోధనుండు విశ్వామిత్ర మునివరుండు
సర్వమును జెప్పఁ జొగెను సకల మునుల
నడుమఁ గడు విపులమ్ముగ నెడఁద యలర 4.

కం. మును రామ! నీలకంఠుఁడు
మనువాడి యుమా సతిఁ గని మదవిహ్వలుఁడై
ఘనతమ తపస్వి యంతం
దనరెన్ సాంగత్యమున సదాశివుఁ డెలమిన్ 5.

కం. శితికంఠ దేవ దేవుని
శత దివ్యాబ్దములు వరుసఁ జనియెన్ సతికిన్
సుతుఁ గను జందము తోఁపదు
గతించిన సమయ మరిఘ్న! కాకుత్స్థ వరా! 6.

ఆ.వె. ఇందు బిడ్డ పుట్ట నెవ్వరు భరియింపఁ
గల రని సురగణము కంజుఁ గూడి
వెఱవు నొందె భృశము విస్మయమ్ము కదుర
నెల్లరకు మనముల నినకు లేంద్ర! 7.

చం. చని దరి వేగ దేవతలు శంభునిఁ జక్క నుతించి యంత భ
క్తి ననిరి దేవ దేవ! నతదేవ! మహోన్నత దేవ లోక వృ
ద్ధిని మదిఁ గోరు దేవవర! దివ్యుల నీ శరణమ్ము గోరు వా
రినిఁ గృపఁ జూడ నర్హుఁడవు శ్రీగళ! శంకర! పార్వతీపతీ! 8.

మ. వర దేవోత్తమ! నీదు తేజపు బృహద్భారమ్ము లోకమ్ములన్
ధరియింపం దగ నెవ్వ రోపఁగల రీ దాక్షాయణిం గూడి దే
వర! బ్రాహ్మంపుఁ దపమ్ము సేయు మిఁక దేవా నీదు తేజమ్మునున్
వరదా! లోక హితార్థ మూను నుత భావా! స్వీయ తేజంబునన్ 9.

కం. విని దేవతల వచనములు
తన యంగీకారము విదితము సేయుచుఁ బ
ల్కె నఖిల లోక మహేశ్వరుఁ
డనునయముగ వారిఁ గాంచి యభవుం డిట్లున్ 10.

తే.గీ. నాదు తేజమ్ము నుంచుదు నా దయిత యు
మా సహితము దనరి నాదు మహిత తేజ
మునసె యుండుఁ డెల్లరు సుఖమున నమర గ
ణమ్ము లింక నిత్తఱి భూ తలమ్ముఁ గూడి 11.

ఆ.వె. ఉత్తమంపు తేజ ముద్ధితమ్ము సురలు!
పల్కుఁడు ధరియించు వాని నిపుడు
యోచన మదిఁ జేసి యుచితంపు రీతి భ
రింప భరము మించు నెవఁడు వాని 12.

ఆ.వె. విని సురవరు లంత వృషభధ్వజుని పల్కు
లెల్ల బదు లొసంగి రెల్ల రిట్లు
దేవ ధర భరించు దివ్యమ్ము క్షుభితమ్ము
తేజ మలరి ధృతినిఁ దెల్లముగను 13.

కం. తేజస్సు దేవ దేవుం
డీ జగము సపర్వ తాట వీద్ధ స్థలముల్
భ్రాజితముగ వ్యాపింపఁగ
నోజ విడిచె నంత విని సురోక్త వచనముల్ 14.

తే.గీ. తిరిగి యమరులు త్వరపడి యరసి యగ్ని
దేవు నిట్లు పల్కిరి దేవ! నీవు వాయు
దేవుఁ గూడి రౌద్రంపు టీ తేజ మందుఁ
దూఱు మింపుగ నిత్తఱిఁ దూర్ణముగను 15.

చం. తగ ననలమ్ముచేఁ దిరిగి తద్ధరఁ దేజము వ్యాప్తమై జనిం
చె గరిమ శ్వేత పర్వతము చెన్నుగ ఱెల్లు వనమ్ము సన్నిభ 16.

మ్మగుచును బావ కేనులకు నద్భుత రీతినిఁ గార్తికేయ నా
మ గురు బలుండు పుట్టెను గుమారుఁడు వహ్నికిఁ దత్క్షణమ్మునన్

కం. ప్రీత మనస్కు లయి సురలు
పూత మునివరేణ్యు లంతఁ బూజించిరి యా
భూతగణ నాథు దార స
మేతం బత్యధికముగ నమే యాసక్తిన్ 17.

తే.గీ. అంత శైల సుతకుఁ గోప మంతరంగ
మందుఁ బ్రజ్వలింపఁ గడు రక్తాక్షి రామ!
త్రిదశులను గాంచి పల్కెను దీవ్ర రోష
మూని శపియించె నాగక యుగ్రముగను 18.

కం. ఎవ్విధిఁ బుత్రార్థిని నా
కవ్వర దేవు దయ నాపి రక్కట మీకున్
నివ్వటిలదు సంతానం
బవ్విధి నిజ దారలందు నంచు శపించెన్ 19.

తే.గీ. నేటి నుండియె సురలార నిజసుతు లన
పత్య లౌదు రనుచుఁ బల్కి వారి నెల్ల
రను శపించి పంతముననను రామ! యంత
నిలువక ధరను వీక్షించి పలికె నిట్లు 20.

తే.గీ. అవని! యిచ్చగింపవు నాకు నాత్మజుండు
నుండ నాదు కినుకఁ బాప మొదవు నీకు
నొక్క రూపుండదు సతివి పెక్కురకు న
గుదువు పుత్రులఁ గనలేవు కుమతి! యింక 21.

తే.గీ. లజ్జితుల నా సురలఁ గాంచి రామ! దేవ
దేవుఁడు పయనించి వరుణు దిశకు హిమ న
గోత్తర సమీప తజ్జని తోత్తమ నగ
శృంగమున సదార తపము సేయ నిల్చె 22.

ఆ.వె. ఇది నగసుత యైన యీ యుమాసతి గాథ
చెప్పితి నిట రామ! యిప్పుడు విను
కూడి లక్ష్మణుని సుగుణవతి గంగ చ
రిత్రము వివరములు లెస్సగాను 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది యాఱవ సర్గము.

# బాలకాండము

## సర్గము 37.

కార్తికేయుని జన్మవిశేషము.

కం. తపముం జేయుచు నుండ ము
నుపు పరమశివుఁడు సురలు మునులతోఁ దమ కొ
క్క పరమ సేనాపతి నెం
చి పద్మభవు చెంత కంతఁ జేరిరి రామా! 1.

కం. సుర లింద్రాగ్నులు ముందుఁ ద
నరఁగఁ బితామహునిఁ గని ప్రణామములు సభ
క్తి రయముగఁ జేసి వచియిం
చి రిప్పగిది భాషణములు స్థిర చిత్తములన్ 2.

తే.గీ. దేవ యెవ్వరిఁ జూపితి వీవు మున్ను
మాకు సేనాపతి నొసంగ వీఁక నుమను
గూడి యతఁడు తపము నిష్ఠ తోడ నాచ
రించు చుండెఁ బితామహ! యంచితముగ 3.

ఆ.వె. లోక హితము గోరి యే కార్య మొప్పు న
నంతరమ్ము దాని సుంత గాంచి 4.

చలుపు దేవ! నీవ శరణు మాకు విధాన
వేద! కృప వహించి వేగముగను

ఆ.వె. సకల సురుల గిరలు సర్వలోక పితామ
హుండు చక్కఁగ విని మెండుగ మధు
రంపు భాషణమ్ము ల ననునయించి త్రి
దశ వరులను గాంచి తాను బలికె 5.

ఉ. శైలజ పల్కి నట్టు లగు సంశయ మించుక లేదు మీకు మీ
యాలుల సంతు కల్గ దన నయ్యది సత్యమ రిత్తవో దిఁకన్
శైలకుమారి యగ్రజయె స్వర్నది గంగ హుతాశనుండు తాఁ
గాలుని తేజ ముంచఁ గనుఁ గాంత కుమారుని శత్రుభంజనున్ 6.

తే.గీ. జ్యేష్ఠ పుత్రిక ప్రసవించు నిద్ధ పుత్రు
నుగ్ర తేజుని సురలార యుక్త రీతి
నుమయు నా తనయుని సంశయ మది లేదు
సమ్మతించు సంతోషము గ్రమ్మ నెడఁద 7.

కం. విని యప్పలుకులు రఘువర!
తనిసి సుర వరేణ్యు లంచితమ్ముగఁ బూజిం
చి నలినసంభవు నట వం
దనము లొసంగిరి కృతార్థతఁ జనిరి యంతన్ 8.

తే.గీ. మోద మలరంగ నిజ చిత్తములఁ గదిసి సు
పర్వు లెల్లరు కైలాస పర్వతమ్ము
ధాతు మండితమ్ము ననలుఁ దనయ సంభ
వార్థమై నియోగించిరి యంత రామ! 9.

తే.గీ. దేవ కార్య మియ్యది యగ్నిదేవ! యో హు
తాశనా! విడు మింపుగ నభవు తేజ
ము హిమశైల తనయ గంగ పుణ్య గర్భ
మందు నుద్యమించి యనఘ! యనిరి రామ! 10.

ఆ.వె.　ప్రతిన నొసఁగి యమర వరులకుఁ బావకుం
డు నది గంగఁ గదిసి వినయ మలర
దేవి! గర్భ మూను దేవ హితార్థమ్ము
యనుచు వేఁడెఁ బ్రీతి నామె నంత 11.

తే.గీ.　అగ్ని మాటలు విని గంగ యంత దివ్య
రూప మూనఁగ మహిమంపు రూప మంత
నరసి యంతట పెదచల్లె నగ్ని దేవుఁ
డభవు తేజము నానంద మలర మదిని 12.

తే.గీ.　దేవిఁ దా నభిషేకించెఁ బావకుండు
గంగ శ్రోతస్సు లెల్ల నిండంగ నంత
వానిఁ గాంచి వచించె దేవతల ముందు
నిలిచి నట్టి వానిని గంగ కలఁత నిట్లు 13.

తే.గీ.　దేవ! పెరుగు చుండెడి నీ ప్రభావ మింక
దహ్య మాన మత్తేజ మసహ్య మయ్యె
శక్తి యిత్తఱి భరియింపఁ జాల దనఘ
నాకుఁ దప్త చిత్త నయితి నన్ను జూడు 14.

కం.　నా నన గంగా దేవియె
దీన హుతాశనుఁడు పల్కెఁ దెల్లముగ నిటుల్
దానిని గర్భమ్మును జన
నీ! నిల్పు హిమగిరి పాద నిచయము లందున్ 15.

కం.　విని గంగ పెల్లువల నె
ల్ల నున్న గర్భమ్ము నుజ్జ్వలమును విసర్జిం
చెను వడి యుద్వేగమ్మున
ననఘా! పలుకంగ వహ్ని యట్టుల రామా 16.

తే.గీ.　తప్త జాంబూనద ప్రభా తాదృశమ్ము
గర్భము వెడలి యిలఁ గూలి కాంచనమ్ము
నింక రజతమ్ము విమలమ్ము లిద్ధ ధాతు 17.

చయము లుద్భవించె మఱియు సత్యసంధ!

తే.గీ. ఇంక తీక్ష్ణ మడర రాగి యినుము వుట్టె
సీసమును దగరమ్ములు చిత్రముగ మ
లమ్ము నుండి జనించె నేల పడి నంత
వివిధ ధాతువులును రామ! వెలసె నచట 18.

ఆ.వె. గర్భ ముంచి నంతఁ గందరాకర కాన
నమ్ము తగ సెఱుపుఁదనమ్ము నొందెఁ
గాంచనమ్ము నయ్యెఁ గానంగ నెల్లెడ
ల రఘురామ వేగ పరఁగెఁ బ్రభలు 19.

తే.గీ. జాతరూప మని పసిడి ఖ్యాతి నొందె
నాఁటి నుండి నరవ్యాఘ్ర! మేటి యగ్ని
సన్నిభమ్ము నై రాఘువ! సాల తృణ ల
తాదు లెల్లను బంగార మయ్యె వింత 20.

ఆ.వె. అంతఁ బుట్టి నట్టి యాత్మజుని సశక్ర
సురగణమ్ము గాంచి కర మలరుచుఁ
బాలు నీయ రండు బాలున కంచుఁ గృ
త్తికల నునిచి రపుడు దేవ నిభల 21.

ఆ.వె. పాలు వొంగఁగ నొడఁబాటు వా రొనరించి
యందఱికి నితఁ డగు నాత్మజుండు
నాఁగఁ బా లొసఁగిరి వేగ ప్రీతి దనరఁ
గృత్తిక లగు నార్వు రుత్తమముగ 22.

కం. అపు డతనిఁ గార్తికేయుఁ డ
ని పిలిచి రా యమరు లెల్ల నిశ్శంక నితం
డు పరఁగు జగత్ప్రసిద్ధుఁ డ
యి పుత్రుఁ డని దీవన లిడి రెల్లరు ప్రీతిన్ 23.

చం. ఉదరము నుండి జాఱుటను యుక్త విధమ్ముగఁ బిల్చి రెల్లరుం 24.

గదియుచుఁ గార్తికేయుఁ దగ స్కందుఁ డితం డని యగ్నిసన్నిభున్
ముదితలు కృత్తికా సతులు పుత్రుని స్నాతునిఁ జేయ నంత నా
యుదిత పయస్సు షణ్ముఖము లూని తమిం గుడిచెన్ సుఖమ్ముగన్

ఆ.వె. ఒక్క దినము త్రావి చక్కఁగ క్షీరమ్ము
మృదు శరీరుఁ డంత దృప్తి స్వీయ
బలము దనర మిగుల గెలిచె దైత్యానీక
మెల్ల కార్తికేయుఁ డివ్విభుండు 25.

తే.గీ. దేవ సేనాపతిగ నంత దేవవరు ల
నల పురోగము లతని ననంత కాంతి
వంతుని నభిషేకించిరి సంతసమునఁ
దీర నిచ్చ వారు కృతార్థు లైరి రామ! 26.

కం. ఇది రాఘవ గంగ కథ వి
శదముగఁ జెప్పితిని పుణ్యచరితుం డా ధ
న్య దివిజ సేనాధ్యక్షుని
యుదార సంభవము గూడ యొప్పుగ రామా! 27.

తే.గీ. పుత్ర పౌత్రులఁ గందురు పూర్ణమై పె
లుంగు నాయువు సద్భక్తి సంగమమ్ము
కార్తికేయునం దలరిన స్కంద లోక
వాసము లభించు నరలోక వాసులకును 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది యేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 38.

సగర చక్రవర్తికి సంతాన ప్రాప్తి, యాతఁడు యాగము సేయ సంకల్పించుట.

కం. ఆ కథ నబ్బంగి నుడివి
కాకుత్స్థ ప్రవరులకును గౌశికు డింకన్
వీకన్ విశ్వామిత్రుఁడు
రా కొమరుం గని పలికెను రమ్యముగ నిటుల్ 1.

కం. నృపతీశుఁ డయోధ్యాపతి
యపుత్రకుండు సగరుఁడు మహా ధర్మాత్ముం
డు పరఁగెఁ బూర్వము రఘువర
సుపుత్ర కాముండు సమర శూరుండు భువిన్ 2.

తే.గీ. సత్య వాదిని ధర్మిష్ఠ సగర పతికి
జ్యేష్ఠ భార్య వైదర్భ నృశేఖరు సుత
కేశిని యను సతీమణి కీర్తిత గుణ
రత్న నిధి తరలేక్షణ రఘువరేణ్య! 3.

తే.గీ. సుత యరిష్ట నేమికిని సుమతి యనంగఁ
బరగు రూపమం దసమాన ధరణి యందు
సగరు రెండవ వల్లభ చారువదన
సోదరి సుపర్ణునకు రామ! శోభనాంగి 4.

కం. తగ సతులఁ గూడి హిమవ
న్నగపు భృగుప్రస్రవణమున నలరి తపమున్
సగరుఁడు నిష్ఠగఁ జేయఁ దొ
డఁగెఁ బుత్రార్థము తమిం బుడమి నాథుండే 5.

ఆ.వె. భృగుమహర్షి నట్లు ప్రీతి సేవింపఁగ
సత్యవంతు లందుఁ జాల పెద్ద
ముని యొసంగెను సగరునకు వర్ష శతము
లట్లు చనఁగ వరము నంతఁ దనిసి 6.

ఆ.వె. అగును బుత్రలాభ మవని నాథా! నీకు 7.

ననఘు! పురుష వృషభ! యప్రతిమ య
శమ్ము కూడ కల్గు నిమ్ముజ్జగమ్ముల
సందియమ్ము వలదు డెందమునను

తే.గీ. ఒక్క సతి యందు నుదయించు నొక్క సుతుఁడు
వంశకరుఁ డగు నాతండు పార్థివేంద్ర
పుత్రు లరువది వేవురు పుట్టు వార
లన్య సతి యందు నిజము రాజన్య! వినుమ 8.

మ. అన నబ్బంగి మహాత్ముఁ డమ్మునిని నత్యం తార్తిఁ బూజించి ప్రీ
తినివారిద్దఱు మోడ్చి హస్తములు సందేహాత్మలై దార ల
మ్ముని నత్యాదర మొప్ప వేడి రిటులం బుత్రుండొకం డిందు నె
వ్వనితారత్నము నందుఁ గల్గుఁ గను నే వాల్గంటి పెక్కండ్రనున్ 9.

తే.గీ. అన విని పరమ ధార్మికుఁ డనియె వారి
తో నిది యగు స్వచ్ఛందము మానినీ మ
ణు లొక వంశకరుఁడు మహాబలులు నయిన
పెక్కురు కొనుఁ డెవ రెవరి వేఁడ నట్లు 10.

ఆ.వె. మునివరేణ్యు మాటలను విని కేశిని
పట్టపు సతి తా నృపవరు నెదుట
వంశకరునిఁ బుత్రుఁ బ్రమదమ్మున నొకనిఁ
గోరికొనియె నో రఘుకుల రత్న! 11.

తే.గీ. సుతుల షష్టిసహస్ర యశో ధనులను
ఘనత రోత్సాహులను గోరుకొనియె సుమతి
సోదరి సుపర్ణునకు నంత నుత్తమాంగి
చక్రవర్తి రెండవ భార్య సక్రమమున 12.

తే.గీ. మునికి నంతఁ బ్రదక్షిణము నొనరించి
నృపవరుండు శిరసు వంచి నెమ్మి వంద
నములు సేసి సదార ద్వయము నిజ పుర
మేఁగెఁ దృప్తుఁడై పురుష వరేంద్ర! రామ! 13.

ఆ.వె. సమయ మేఁగ నంత సంభవించె నసమం
జసుఁ డనంగఁ బరఁగి సదమలమతి
కేశినీ సతికి సుకీర్తిత గుణవతి
కి దనయుఁ డొకఁడు పులకింపఁ దనువు 14.

తే.గీ. ఒక్క సొఱకాయ జనియించి యక్కజముగ
సుమతి కంత ఛేదింప దాని మఱి గాంచ
నందు సుతు లఱువది వేలమంది బయలు
పడిరి యర్భకు లపు డిన వంశరత్న! 15.

తే.గీ. ఘృతము నిండిన కుండలఁ గెరలి దాదు
లుంచి పెంచ వర్ధిల్లిరి యంచితముగఁ
గాలము గతింపఁ బొందిరి మేలుగ నట
యౌవనమ్ము వారెల్లరు భూవర సుత! 16.

తే.గీ. చాల దీర్ఘ కాల మరుగ పే లఱువది
మంది పుత్రులు తనురూప సుందరులు వ
యో విరాజితు లా సగ రోత్తమునకు
ముద మొదవ సంభవించిరి పదిలముగను 17.

తే.గీ. జ్యేష్ఠ పుత్రుఁడు క్రూరతఁ జిన్నపిల్ల
లఁ గొని సగరాత్మజుండు జలముల ముంచి
సరయు నందు నవ్వుచు నుండు నరసి వారి
మునుఁగుచుండ నిత్యము రఘుతనయ! మీఱి 18.

కం. దురిత యుత కర్ము సజ్జన
వర బాధకుఁ గ్రూరుఁ బుత్రుఁ బౌ రాహితునిం
బురవర వివాసితునిఁ జే
సె రాజు ధర్మాచరణుఁడు శీఘ్రము రామా! 19.

కం. ఆ యసమంజసుని తనయుఁ
డే యుత్తముఁ డంశుమంతుఁ డిల పౌరజ నా 20.

మే యాభిమానుఁడు ప్రియ వ
చో యుత భాషణుఁడు వెలసె శూర వరుండున్

ఆ.వె. అంత సగరు నెడఁద సంతరించె నొక యా
లోచన క్రతు వొకటి లోచన ప్రి
యముగఁ జేయ నరవ రాధిపతికి నిశ్చ
యముగ నంచు రఘుకులాబ్ధి సోమ! 21.

కం. తగఁ జేసి నిశ్చయమ్ము ని
జ గురు చయము తోడ మేటి జన్నపుఁ బనులె
ల్లఁ గర మెఱింగిన వాఁడు దొ
డఁగెఁ జేయఁ గ్రతువు నృవరుఁ డడరి కడు రామా! 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది యెనిమిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 39.

సగరుని యజ్ఞాశ్వము నింద్రుఁ డపహరింప సగర కుమారు లశ్వమును వెదకుచుఁ బిత్రాజ్ఞ భూమినిఁ ద్రవ్వి రసాతల వాసులను నొప్పించుట.

కం. విని విశ్వామిత్ర ముని వ
చనమ్ములు కథాంత మందు సంప్రీతిం బ
ల్కెను రఘునందనుఁ డా ముని
ననల నిభము వెల్గు వాని నారసి యిట్లున్ 1.

కం. మా పూర్వుఁ డా క్రతు వరం
బే పగిదిం జేసెనో విన నెంతు శుభమగుం
దాపస వరాగ్రగణ్యా! 2.

భూపవరు చరితము నంత పుణ్యచరిత్రా!

తే.గీ. విని కుతూహలాన్విత తద్వచనములు నగ
వలర నాస్యమున నడరి పలికె నిట్టు
లమ్మునివర విశ్వామిత్రుఁ డంతయుఁ దెలి
పెద సగర నృపు చరితము వినుము రామ! 3.

తే.గీ. సన్నుతుఁడు హిమవంతుఁడు శంకరునకు
మామ యత్యున్నతుఁడు వింధ్య నామ పర్వ
తమ్ము శ్రేష్ఠ మొండొరుల సతతము చూచు
చుందురు నృవర స్నేహంపుఁ జంద మలర 4.

తే.గీ. అన్నగద్వ యాంతరమున నమల దేశ
మందుఁ దనరెను రాఘువ యజ్ఞవరము
సుప్రశస్తము తద్దేశ మప్రమత్త
త నొనరుప యజ్ఞకార్యములను నరవర! 5.

చం. వెడలెను యజ్ఞ ఘోటకము వెంటను గావఁగ నంశుమంతుఁ డ
య్యెడ ధరియించి చాపము నహీన పరాక్రమ విక్రముండు దా
నెడఁద వహించి తాత పను పింపుగ నంత మహారథుండు ధీ
రుఁడు నిజ సైన్య సంయుతము రుద్ర నిభోగ్రుఁడు పూరుషోత్తమా! 6.

ఉ. వాసవుఁ డుద్యమించి కడుఁ బర్వ దినమ్మున రాక్షసాకృతిం
జేసెను ఘోట కాపహృతి శీఘ్రమ యధ్వర విఘ్న కారియై
వేసరి యంత ఋత్విజులు వేదనఁ బల్కిరి యజ్ఞకర్తతో
వే సమయించి చోరు హరి వేగమ తే వలె రాజసత్తమా! 7.

తే.గీ. మనకు నెల్లర కశుభ మగును నరవర!
యజ్ఞ భంగ మైన యెడల నందు వలన
విఘ్నము లొదవ కుండెడి విధము నెంచి
యట్లు సేయ నర్హుండ వీ వధిపవర్య! 8.

తే.గీ. ఆలకించి నృపతి యుపాధ్యాయుల వచ 9.

నమ్ము లెల్ల షష్ఠిసహస్ర నందనులను
గాంచి పలికె సదస్సున సెంచి కార్య
మంచితమ్ముగ నివ్విధ మడరి వేగ

తే.గీ. మంత్ర పూత మీయజ్ఞము మహిత భాగు
లైన యాజక శ్రేష్ఠులు పూని జరుపు
చుండఁ గాంచను దైత్యుల శూరులార!
యిచ్చట పురుషర్షభులార! యెప్పగిదిని 10.

కం. సుతులార! చనుఁడు శుభమగు
వెతకంగ ధరాతలమ్ము వృతసాగరమున్
వితతమ్ముగ నెల్లెడలఁ ద్వ
రితమ్ము రండు గొని యా హరివరము నెలమిన్ 11.

కం. ఒక్కొక్కొక్కామడ భువి
నొక్కొక్కరు వెతకుఁడు తురగోత్తమమునకై
చక్కగఁ ద్రవ్వుఁడు భూమిని
నక్కపటి హయాపహర్త నరసెడు వఱకున్ 12.

ఆ.వె. దీక్ష నుంటి నుందు స్థిరముగ నిటఁ బౌత్ర
ఋత్విజులను గూడి యీ హయమ్ము
దొరకు వఱకు మీ కడరు గాక భద్రము
వెడలుఁ డింక ననియెఁ బేర్మి మీఱ 13.

కం. అన నిట్లు తండ్రి విని రా
జనందనులు బల్లిదులు వచన బద్ధులునై
చనిరి మహీతల సంశో
ధనమ్మునకు నుద్యమించి దశరథతనయా! 14.

తే.గీ. యేఁగి కానక గుఱ్ఱము నెల్ల పుడమి
నామ డామడ లందు వా రేమఱకయె
వెదకి వజ్రాభ నఖములఁ బృథ్వి నంతఁ
ద్రవ్వఁ జాగిరి వీరులు రాజసుతులు 15.

తే.గీ. నేలఁ బిడుగులం బోలెడు శూలములను
దారుణ హలమ్ములను బూని త్రవ్వి రాజ
నందనులు సేసి రట ఘోర నాద మడరి
రామ! పిక్కటిల్ల దిశలు భీమబలులు 16.

ఆ.వె. కర్షితు లసుర భుజగముల రాక్షసుల స
త్త్వముల దుస్సహ నినదములు పిక్క
టిల్లె దిశల నెల్ల నుల్లమ్ము లడలంగ
రామ! త్రవ్వుచుండ రాజసుతులు 17.

కం. యోజనము లఱువది వెయుల
నోజం ద్రవ్విరి పుడమిని నుగ్రత నంతన్
రాజసుతు లలిగి చిత్రము
గాఁ జేర రసాతలమ్ము కాకుత్స్థవరా! 18.

తే.గీ. ఈ విధముగ జంబూద్వీప మింపు గొల్పు
పర్వతమ్ముల తోడుతఁ బరఁగు దానిఁ
ద్రవ్వుచును నరశార్దూల! యవ్వర నృప
నందనులు తిరిగిరి మీఱి బృందములుగ 19.

తే.గీ. అంత గంధర్వులు సురలు నసురు లింకఁ
బన్నగములు సంభ్రమమున విన్నవింపఁ
జేరిరి బితామహు దరికిఁ జింత తోడ
ననిరి ప్రణమిల్లి దీన వదనులు రామ! 20.

కం. దేవా! సగర కుమారు ల
హో వేల మహాత్ములు భువి నుగ్రులు నత్యం
తావేశమ్మున ఖననము
గావించిరి తలనివాస ఖండను లగుచున్ 21.

కం. ఇతఁడు మన యజ్ఞ నాశకుఁ
డితండు గుఱ్ఱమ్ము నపహరించె నని తలం 22.

చి తగ నృపసుతులు నీ భూ
త తతిని వధియించు చుండ ధాతా! కనుమా

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు ముప్పది తొమ్మిదవ సర్గము.

# బాలకాండము

## సర్గము 40.

సగర నందనులు భూమినిఁ ద్రవ్వి యథోలోకమునఁ గపిల మహర్షి యాశ్రమమున నశ్వమును
గాంచి ఋషి నవమానింప ముని చే దహింపఁ బడి భస్మ మగుట.

కం. కాల బల మోహితులు నా
భీలార్తు లమరు లనంగ విని పద్మజుఁ డా
లోలుల వీక్షించి పలికె
మేలుగ భాషణము లెలమి మీఱ రఘువరా! 1.

చం. అనిశము వాసుదేవుఁడు మహాత్ముఁడు నక్కపి లాఖ్య నూని కా
చును ధర నెల్ల నాతని ప్రచోదిత రోషుని చేత దగ్ధు లౌ
ట నృప కుమారు లెల్లర కటం దగ నున్నది యల్పజీవులే
ఖననము భూమి కివ్విధినిఁ గాంచఁ బడెన్ సురలార! మున్నహో 2.

ఆ.వె. మురిసి యేఁగి రంత ముప్పది ముగ్గురు
సుర లరిందమా! యలర మనములు
వచ్చినట్టి దారిఁ బ్రణతు లొసఁగి భక్తి
విని పితామహుని వచనము లెల్ల 3.

కం. సగ రాత్మజుల ఘనాత్ముల
తగ నేలను ద్రవ్వు వారి ధ్వానమ్ములు చె
ల్లఁగఁ బిక్కటిల్ల దిశలు పి 4.

డుగులను మించి చెవులకుఁ గఠోరము లయ్యెన్

కం. పెకలించి భూమి నా సగ
ర కుమారులు చుట్టు దిరిగి రయమునఁ గనిపిం
పక యున్న గుజ్జము జనకు
ని కడ కరిగి పల్కి రంత నిర్వేదమునన్ 5.

చం. తిరిగితి మెల్ల ధాత్రిని వధించితి మచ్చట సత్వ కోటినిన్
సురలఁ బిశాచ దానవుల శూరులఁ గిన్నర సర్పరాజులం
జొరఁబడి యెచ్చ టేనియును జోరుని నశ్వము గానకుంటి మీ
దరి నిఁక నీకు భద్ర మగుఁ దండ్రి వచింపుము మాకుఁ జెయ్వులన్ 6.

చం. అన విని పల్కె భూమి ధవుఁ డాగ్రహ పూరిత భాషణమ్ములం
గని సుతు లెల్లరం దిరిగి కాశ్యపిఁ ద్రవ్వఁడు త్రవ్వి పుత్రు లా
ర! నెగడి చేసి శోధనము రమ్యపు టశ్వము నశ్వచోరునిం
గని వడినిం గృతార్థు లయి క్రమ్మరుఁ డౌ నట మీకు భద్రమే 7.

కం. పౌత్రులు షష్ఠి సహస్ర సు
పుత్రులు విని తండ్రి మాటఁ బూని చలము సు
క్షత్రియులు రసాతలము ప
విత్ర తల మరిగి పరువున వేగమ యంతన్ 8.

ఆ.వె. త్రవ్వ చచటఁ బర్వత మన విరూపాక్ష
మనెడు దిగ్గజమును నరసి రయ్య
దెలమి మోయు చుండ నిలను సపర్వత
వన విలసితము శిరమునఁ జెలంగి 9.

ఆ.వె. అప్పు డప్పు డిభము నొప్పిఁ దలఁ గదల్ప
సుఖము కొఱకు భూమి సుంత సెందు
కంపనమ్ము సుమ్ము కాకుత్స! యట్టి పే
దండ మరసి రచట మండితమును 10.

కం. కని వా రపుడు ప్రదక్షిణ 11.

ము నొనర్చిమహా దిశేభ మునకుఁ దగఁ జల
మ్మునఁ ద్రవ్వఁ జాగిరి తిరిగి
చనిరి రసాతల మినకుల చంద్రా! యలుకన్

ఆ.వె. వీడి తూర్పు దిక్కు వేగ దక్షిణ దిశఁ
ద్రవ్వి దిగ్గజమ్ముఁ దల ధరింప
ధాత్రి గిరి నిభమ్ము దాని మహాపద్మ
మనెడు నిభము గాంచి రద్భుతముగ 12.

కం. కని షష్ఠి సహస్ర సగర
తనయులు సేసి కరటి ప్రదక్షిణ మెలమిన్
ఘను లడరి పశ్చిమపు ది
క్కును ద్రవ్వం జాగి రంతఁ గుపి తాత్ములునై 13.

ఆ.వె. పశ్చి మాశఁ గూడ పర్వతోపమపు టి
భమ్ము సౌమనసము బల్లిదు లర
సిరి ప్రదక్షిణమ్ము సేసి క్షేమ మడిగి
త్రవ్వి రంత నుత్తరంపు దిక్కు 14.

ఆ.వె. ఉత్తరంపు దిశ మహోత్తమంపు టిభము
భద్ర నామ మలరు పాండు వర్ణ
దిగ్గజమ్ము ధాత్రి స్థిరముగ భరియించు
దానిఁ గనిరి భద్ర తనువు దాని 15.

కం. కని తాఁకి యందఱును సగ
ర నందనులు పరమ కుంజరమ్మును శ్రేష్ఠ
మ్మును భక్తినిం బ్రదక్షిణ
ము నొనరిచి వసుధను ద్రవ్వఁ బూనిరి యింకన్ 16.

ఆ.వె. ఏఁగి యంత వార లీశాన్య దిశకుఁ బ్ర
సిద్ధ దిక్కునకును జెలఁగ నలుక
పుడమిఁ ద్రవ్వఁ దొడఁగి రడరి పృథ్వీపతి
సుతులు భీమ బలులు శూరవరులు 17.

కం. కని రచటఁ గపిలుని సనా
తను విష్ణుని వాసుదేవుఁ దత్సాన్నిధ్య
మ్మున సంచరించు హయ వర
మును రఘు నందన! పడసిరి ముదమును భృశమున్ 18.

చం. కని యెఱు పెక్కఁ గోపమునఁ గన్నుఁ లెఱింగి హయమ్ము నంతటం
దనయులు కై ధరించి పగఁ ద్రవ్వెడు కోలలు నాగళుల్ శిలల్
ఘన తరువుల్ నిలుం డని సగర్వము నార్చుచు సంభ్రమించుచున్
ఘనులు మహోగ్రరూపమునఁ గానక ధర్మము పల్కి రిట్టులన్ 19.

తే.గీ. కుత్సిత మతి మా యజ్ఞపు గుఱ్ఱ మపహ
రించి తీ వని యెఱుక యయ్యె నిట మాకు
నీ వెఱుంగుమ వచ్చిన యీ వసుంధ
రాత్మజులను సాగరుల మహా బలులను 20.

కం. విని వారి వచనముల న
మ్ముని కపిలుండు ఘన రోషమున నవ్వారిం
గని యమ్మహాత్ముఁ డంత న
శని నిభ హుంకార యుక్త శబ్ద మొనర్చెన్ 21.

కం. ముని సత్తముఁడు మహాత్ముఁడు
ఘన రోషావృత హృదయుఁడు కపిలుండు త్రుటిన్
ఘన గర్వాంధుల నా సగ
ర నందనుల నంత భస్మ రాశిం జేసెన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 41.

అంశుమంతుఁడు యజ్ఞాశ్వమును వెదకుచు రసాతలమున కేఁగి కపిల మహర్షి సమీపమున
నున్న యశ్వమును గాంచి వైనతేయుని వలన గంగాజలమునఁ బిన తండ్రులకు మోక్షము
కలుగు నని విని హయమును గొని తిరిగి వచ్చుట, యాగము పూర్తి యగుట.

కం. చిర కాలము గడవ నెఱిఁగి
యరిగి హయార్థము సుతులు నరాధిపుఁ డంతం
బరికించి పౌత్రుఁ దేజో
విరాజితుని నంశుమంతు వీరు నని నిటుల్ 1.

తే.గీ. శూరుఁడ వఖిల విద్యల నేరి నట్టి
విబుధుఁడవు సమానుఁడవు పూర్వీణులకును
దేజ మందుఁ దండ్రులు చన్న యా జగతి న
రిగి హయాపహరునినిఁ గనుగొనుమ ధృతి 2.

ఆ.వె. పుడమి లోపలఁ గడు నడరెడు బల సత్వ
ములను వీర్యవంతముల నెదిర్ప
నస్త్ర యుతము వింటి నంది వీరవరేణ్య!
యంశుమంత! యేఁగు మయ్య! వేగ 3.

కం. అభివాదము తగు వారికి
సభక్తిక మొనర్చి యింక సవనఘ్నుల వీ
త భయమునఁ జంపి పురుష
ర్షభ! దాఁటఁగఁ జేయ నిష్టి సఫలత రమ్మా 4.

కం. అన విని విల్లంబులు క
త్తిని లఘువిక్రముఁడు గొని ధృతినిఁ జనఁ జాగెన్
ఘనుఁ డంశుమంతుఁడు సగర
జనాధినాథు వచనముల సమ్మద మొదవన్ 5.

ఆ.వె. తండ్రు లడరి మున్ను ద్రవ్విన దారిని
రాజు నాజ్ఞ దాల్చి రాజ నంద 6.

నుండు తరలి యేఁగు చుండె రయమ్మున
నశ్వ శోధనార్థ మడరి రామ!

కం. చని యంతఁ గాంచె దిగ్గజ
మును దైత్య దనుజ పిశాచ ముఖ రక్షోవ్రా
త నభశ్చ రోరగ సుసే
వ నార్హము నృపాత్మజుండు పన్నుగ రామా! 7.

తే.గే. అంతఁ జేసి ప్రదక్షిణ మడిగి క్షేమ
మును జనకులను నడిగి సముచితముగ మ
హాత్ముఁ డంశుమంతుం డమ్మహా గజమ్ము
వేఁడె యజ్ఞాశ్వ చోరుని జాడఁ దెలుప 8.

తే.గీ. అంశుమంతుని వాక్యము లాలకించి
బదు లొసంగె దిగ్గజ మంతఁ బార్థు నరసి
యంశుమంతుఁడ! యేగుదు వశ్వ యుతము
కార్యసిద్ధి శీఘ్రము నరవర్య! యనుచు 9.

ఉ. అవ్విధి దిగ్గజవ్రజము నాతఁడు సేరి క్రమమ్ముగా వడిన్
జవ్వనుఁ డొక్కటొక్కటినిఁ జక్కఁగ వేడఁగ నర్చ సేసి తా
నవ్విధి నుత్తరమ్ము తగ నందెను వాక్య విశారదేభముల్
క్రొవ్వున నప్రమేయములు కూర్మి వచింపఁగ సంతసమ్మునన్ 10.

కం. గజరాజుల మాటలు విని
స్వజనులు పినతండ్రు లెల్ల భస్మంబయి న
ట్టి జగతి కసమంజసు నా
త్మజుండు లఘువిక్రముండు తడఁబడి చేరెన్ 11.

ఆ.వె. వారి వధను గాంచి ఘోర మహాపన్న
దుఃఖ వశుఁడు నయి యతుల్యముగఁ ద
దంశుమంతుఁ డచట నార్తి దుఃఖించి తో
రమ్ముగ విలపించె రఘువరేణ్య! 12.

కం. అవిదూరమునఁ జరించెడు
సవనాశ్వము నంతఁ గాంచె సత్‌క్షత్రియ పు
త్రవరుఁడు పురుషవ్యాఘ్ర
ప్రవరుం డా దుఃఖశోక పరితప్తుండున్ 13.

కం. నృప నందనులకుఁ దగ నుచి
తపు జలతర్పణము లీయఁ దలఁచుచు శోధిం
చి పరిసరములం గాంచఁడు
నృపాత్మజుఁడు తోయము నెట నీరజనేత్రా! 14.

ఆ.వె. దృష్టిఁ బఱుపఁగ నలుదిశలఁ గాంచె సుపర్ణు
నంత మేనమామ యా సగర కు
మారులకు ననిల సమానుని ఖగరాజు
వైనతేయు వీరు నా నృవరుఁడు 15.

కం. వినతా నందనుఁడు పలికె
ఘన వీర్యుండు తగ నిట్లు కదిసి నరవ్యా
ఘ్ర! నలిని శోకింపకు వధ
కు నర్హులే లోక హితము కుందఁగ నేలా 16.

ఆ.వె. అప్రమేయుని కపిలాఖ్య మహర్షి వ
రేణ్య కోప వహ్ని గణ్య! దగ్ధు
లిట్టి వారి కుదక మిట్టి సాధారణ
లౌకిక జల మీయ రాదు సుమ్ము 17.

కం. అమల జలాన్విత గంగా
రమణీయ నది హిమ శైల రాజ తనయ స
ద్విమ లోదకమున నీ వు
ద్యమించి పితరుల జలక్రియ సలుపు ప్రాజ్ఞా! 18.

ఉ. పన్నగ భస్మరాశి పయిఁ బాఱిన లోక పవిత్ర గంగతోఁ
గ్లిన్నము సేయ నింపుగను లీలఁ దరించి దివమ్ము లోఁ దగం
గ్రన్నన వెల్గు వారలు కరమ్ము పునీతులునై నృపోత్త మా 19.

పన్న కుమారు లెల్లరు నపార యశం బది కల్గు నీ కిలన్

కం. తురగమ్ముతో మహా భా
గ! రాజనందన! నరవర! కదలి యరుగుమా
పరఁగి పితామహుని క్రతువు
త్వరితమ్ముగను నెఱవేర్ప వలయును జుమ్మీ 20.

కం. ఖగరాజు సుపర్ణు ముద మొ
సఁగు వచనము లాలకించి జన్నపు గుఱ్ఱ
మ్ముఁ గొని మహాయశుఁ డేఁగెఁ ది
రిగి సగరుని మనుమఁడు దనరి సవన తటికిన్ 21.

ఆ.వె. అతఁడు రాజుఁ జేరి యా దీక్షితుని నంశు
మంతుఁడు కథ నెల్ల నంత నుడివి
మఱి సుపర్ణుఁ డనిన మాటలఁ దెలిపెను
మాననీయములను ఱేని కెల్ల 22.

తే.గీ. ఘోర మా వార్త విని పిడుగు వలెఁ జెలఁగ
దుఃఖ మంది తిరిగి యంతఁ దురగ మేధ
యాగము యథావిధి నొనర్చె నఖిల కల్ప
సమ్మతముగను వారక సగర నృపతి 23.

ఆ.వె. ఏఁగె స్వీయ పురము యాగము గావించి
ధరణి ధవుఁడు సగర నర వరుండు
గంగ రాకఁ గూర్చి కాకుత్స్థ! నిశ్చయ
మెడఁదఁ గైకొనండు పుడమి ఱేఁడు 24.

కం. చేయక నిశ్చయము మహా
మేయ పరాక్రముఁడు దనరి మేదినిఁ దగఁ దా
నా యేండ్లు ముప్పది వెయి ల
హో యేలి దివమున కేఁగె నోడి యమునకున్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది యొకటవ సర్గము.

# బాలకాండము

## సర్గము 42.

అంశుమంతుఁడు తన కుమారుఁడు దిలీపునకు రాజ్య మొసఁగి తపమాచరించుచు దివి కేఁగఁగ
దిలీపుఁడు గంగావతరణమునకై నిశ్చయింపక దివంగతుఁడు కాఁగ నతని కుమారుఁడు
భగీరథుఁడు బ్రహ్మను గూర్చి తపమాచరించి వరములను బొందుట.

కం. సగరుండు కాలధర్మం
పు గతి ననుసరించె నంతఁ బురజనులు నమా
త్య గణమ్ము లంశుమంతునిఁ
దగ నభిషేకించి రవని ధవునిగ రామా! 1.

ఆ.వె. అంశుమంతుఁ డయ్యె నంత మహారాజు
ఘనయశుఁడు దిలీపుఁ డనఁగ సుతుఁడు
కల్గె నాతనికి జగద్విశ్రుతుఁ డతండు
రాజ్యపాలనమున రఘువరేణ్య! 2.

చం. తనయు దిలీపు నిల్పి తగ ధారుణి రాజుగ నంశుమంతుఁడే
యొనరిచె శీత శైలమున నున్నత మైన తపమ్ము నిష్ఠతో
ఘనుఁ డతి దారుణమ్ముగ నకంపము ముప్పది వేల యేండ్లటం
గనియెను దేవలోకమును గాలవశమ్మున రాఘవోత్తమా! 3.

ఉ. వే తపియించి సాగరుల వీరుల చావు దిలీపుఁ డెర్గి ము
త్తాతల నుత్తరింపఁ గడు దల్చుచు నెక్కటి గంగ నెవ్విధిం
జూతు మరల్ప నచ్చటికిఁ జోద్యమ యంచుఁ దలంచు చుండి తా
నే తఱి నిర్ణయింప మది నింతయుఁ జాలక యుండె నక్కటా 4.

తే.గీ. విదిత ధీమంతుఁడు సత మవ్విధము తల్చు
ధర్మ పరునకుఁ బుట్టెను దనయుఁ డొకఁడు 5.

ధార్మికుఁడు భగీరథుఁ డనఁ దనరు వాఁడు
వంశ వర్ధనుఁ డా దిలీప నరపతికి

మ. ఘనతేజుండు దిలీపుఁ డధ్వరములం గావించి పెక్కింటినిన్
జన సమ్మోదముగా నిరంతరము రాజ్యం బేలి న్యాయమ్ముగా
నిన వంశోత్తమ వేలు ముప్పదులు నౌ యేఁడాదు లింపారఁగం
జనె రోగార్తతఁ గాలధర్మ గతి రాజన్యుం డనిర్ణేతయై 6.

కం. తనయు భగీరథు రాజ్య
మ్మున నిల్పి దిలీపుఁడు నిజ పుణ్యమ్మున శ
క్రుని లోకమ్మున కింపుగఁ
జనె నరశార్దూలుఁ డంబుజ దళ నిభాక్షా! 7.

ఆ.వె. ఆ భగీరథుఁడు మహాధార్మికుం డన
పత్యుఁడు సుత కామి పార్థవరుఁడు
తేజ మందు మిన్న రాజవరేణ్యుల
నెల్ల భూతలమున నినకులాగ్ర్య! 8.

చం. స్థిరముగ రాజ్య భారమును జేర్చి యమాత్య నికాయ మందు ని
బ్బరముగ నా భగీరథుఁడు పన్నుగ గంగను దేర నిష్ఠుఁడై
కరములు పైకి నెత్తి తమకమ్మున వహ్నుల మధ్య నొక్క వా
సరమున మాస మందుఁ దిని సన్మతినిం దప మాచరించుచున్ 9.

తే.గీ. ఇంద్రియ జయుండు గోకర్ణ మెలమిఁ జేరి
యతఁడు వేల యేండ్లు నిలిచి యలర ఘోర
నిష్ఠ నంతఁ బ్రజాపతి నీర జోద్భ
వుండు మెచ్చి రాజును రామ! మెండుగాను 10.

కం. సుర గణముతోడు నుండగ
నరవిందాసనుఁడు బ్రహ్మ యమ్మహితాత్మున్
గురుతర తపస్స్థితునిఁ దా
నరసి భగీరథునిఁ జేరి యనె నిబ్బంగిన్ 11.

కం. చక్కఁగఁ జేయఁ దపమ్మును
దక్కక నిష్ఠను భగీరథ! మహాభాగా!
మిక్కిలి ముద మాయె వరం
బిక్కడ సువ్రత యడుగుమ యిచ్చెద నీకున్ 12.

ఆ.వె. అంజలించి పలికె నంత భగీరథుఁ
డప్పితామహునకు నఖిల లోక
ములకుఁ గరము భక్తి పూర్వకముగ నిట్లు
నమ్మహాయశో ధనాధికుండు 13.

తే.గీ. దేవ! కల్గినఁ బ్రీతి యధికముగ మఱి
కల్గె నేని తపస్సిద్ధి వెల్గి మిగుల
సగర పుత్రులు వారికి సలిల మే నొ
సంగు వాఁడ కావలయును సరసిజభవ! 14.

తే.గీ. వారి భస్మము గంగేద్ధ వారి తోడఁ
గ్లిన్నమై సర్వ మంత సలీల వారు
నాదు ప్రపితామహులు దేవ! నాక లోక
మేఁగ వలయు వీ తాఘులై వేగముగను 15.

ఆ.వె. సంతు నిమ్ము నాకు నంత మిక్ష్వాకు కు
లమ్మరయఁ దగదు వరమ్మగు నిది
పరము దేవ! కరుణఁ బద్మగర్భ! కనుమ
ధన్యుఁడఁ జుమి కాంచి తాత! నిన్ను 16.

కం. అన నట్లు రాజు మధుర వ
చనమ్ములఁ బితామహుండు సన్నుత దేవుం
డును శుభకరమ్ముగం బలి
కెను బదులుగ నివ్విధమ్ము కృప మీఱంగన్ 17.

తే.గీ. ఉత్తమం బైన కోరిక యో భగీర
థా! మహారథ! యగునట్లు నగును నీకు
భద్ర మిక్ష్వాకు వంశ సంవర్ధనా! భృ 18.

శమ్ము శంకింపఁ బని లేదు నెమ్మనమున

తే.గీ. హైమవతి యీమె హిమవన్న గాగ్ర తనయ
గంగఁ గొనితెచ్చిన భువికి భంగవతిని
నామె ధరియింప శక్తుండు భూమిఁ బరమ
శివుఁడు వేఁడ వలెను శంభు శీఘ్ర మీవు 19.

కం. దిగ నా గంగ నృవర! యో
ర్వఁగ లేదు వసుంధర రయ భారమ్ము నహో
మగువం ధరింపఁగ నితరు
నిఁ గాంచ నోప హరుఁ దక్క నే నెప్పగిదిన్ 20.

కం. పలికి తగ ధరణిపతితో
లలితమ్ముగ గంగతో నల వచించి తగన్
నలినజుఁ డంత మరుద్గణ
ములు సురలం గూడి స్వర్గమున కరిగె వెసన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది రెండవ సర్గము.

## బాలకాండము

## సర్గము 43.

భగీరథుఁడు శివుని గూర్చి తపము చేసి మెప్పింప గంగా నదిని శంకరుఁడు తలపైఁ దాల్చి కొంత
విడువ యా నదిని రసాతలమునకుఁ గొంపోయి సగర పుత్రుల భస్మ రాశినిఁ దడుప వారు
మోక్షమును బొందుట.

కం. ఏఁగఁ బితామహుఁ డంతం
దాఁ గాలిది బొటన వ్రేలు తద్దయు ధరణీ
భాగమ్మున నిల్పి తపము 1.

నా గురుసంకల్పుఁ డబ్బ మడరి యొనర్చెన్

కం. వత్సాంతమ్మున నప్పర
మోత్సాహు భగీరథుఁ గని యుగ్రుం డనియెన్
వత్సా మెచ్చితి మోయుదుఁ
దత్సరి దమరాపగ నిటఁ దలపై నంచున్ 2.

చం. నగపతి జ్యేష్ఠ పుత్రిక ఘనమ్మగు రూపము దాల్చి యుగ్రమున్
జగదభి సన్నుతాపగ నిజస్రవ వేగము పెంచి మిన్నఁగన్
గగనము నుండి దుమ్కి వడి గంగ యుమాపతి శీర్ష మందుఁ ద
ల్చె గరళకంఠుఁ గూడి కన శీఘ్రమ దోడ్కొని గ్రింది లోకమున్ 3.

ఆ.వె. నది మదమ్ము గాంచి మది నెంచె హరుఁడు త్రి
నేత్రుఁడు భృశ మలిగి నెఱప బుద్ధి
నబల కణచి యంత నంచితముగ గర్వ
మెల్ల రఘువరేణ్య యుల్ల మలర 4.

తే.గీ. పుణ్య నది పడెను శివుని పుణ్య శిరము
నందు హిమనగ సన్నిభ మందు జడల
గుట్టల గుహ లోన నిరికె దిట్టముగను
గంగ పడి నంతనె యభంగ భంగ రామ! 5.

ఆ.వె. చిక్కి జడల లోనఁ జేర భువి నలవి
గాక యుద్యమింప గంగ కింత
యేని వెనుదిరుగుట కేని వీలు నరయ
లేక తిరుగు చుండె వీఁక రామ! 6.

ఆ.వె. ఏండ్లు గడవ నట్లు నెందును గన లేక
యా భగీరథుండు హరునిఁ గూర్చి
గొప్ప తపము నందు నప్పట్టున నిలిచి
రాజ ఋషి వెలింగె రామ! ధృతిని 7.

ఆ.వె. దానికి ముద మంది తేనికిఁ బ్రియమారఁ 8.

బరమశివుఁడు విడిచెఁ బరమ నదిని
గంగ బిందుసరసిఁ గాకుత్స్థ సంప్రీతి
బిందు బిందువు లగు చంద మొప్ప

తే.గీ. విడువ నేడు పాయలుగనై యడరె గంగ
హ్లాదిని నళిని పావని యనఁగ మూడు
విమల జలవాహినులు పాఱె విరివిఁ దూర్పు
దిశకు నుజ్జ్వల రూపమ్ము తేటపడఁగ 9.

ఆ.వె. అక్షయ జలముల సుచక్షువు సీతయు
సింధు వనఁగఁ బరఁగి శీఘ్ర వాహి
ణులు ప్రతీచికి కడు నలరి శుభజలమ్ము
లు తనరంగఁ బాఱె వితతముగను 10.

ఆ.వె. ఏడవ దగు పాయ ఱేఁడు వడిఁ గదల
ముందు ననుగమించె మూరి రాజ
ఋషి భగీరథుండు నిద్ధ దివ్య రథము
నందుఁ జాగు చుండ డెంద మలర 11.

చం. గగనము నుండి శంభు తలఁ గ్రమ్మరి యచ్చట నుండి భూమిపైఁ
దగఁ బడి పాఱు చుండ వడిఁ దద్దయు శబ్ద యుతమ్ము గంగయే
దిగఁబడి యింకయున్ దిగఁగ దిర్దిర దిర్గెడు మత్స్యకచ్ఛ పా
దిగ జలజీవముల్ వెలిఁగె దివ్యముగా నల నక్ర కోటితో 12.

మ. నగ రాకార విమాన చంచల లసన్నాగాశ్వ బద్ధాసనుల్
సగణోద్భాసిత దేవ సంయములు యక్షవ్రాత గంధర్వ సి
ద్ధగణమ్ముల్ దగ నిల్చె నభ్రమున నత్యంతాద్భుతం బైన య
ట్టి గతిన్ భూమికి జాఱు గంగఁ గనఁ గుంఠీభూత చేతస్కులై 13.

కం. గగనము గత తోయదమై
తగ భాసిల్లెఁ గదియంగఁ దప్త సువర్ణాం
క గణ విరాజిత గీర్వా
ణ గణమ్ములు వింత శత దినకర రాభముగన్ 14.

తే.గీ. శింశుమార మీ నోరగ సేవి తాభ్ర
ము విలసిల్లె విద్యుద్గణ పూర్ణ భాస
మాన శారదా భ్రావృత మండిత మన
ధవళ కలహంస సువికీర్ణ విపృతమునను 15.

ఉ. ఒక్కట వేగ మెక్కువగ నొక్కట వంకర నొక్క టెక్కుపై
యొక్కట వంగి మిక్కిలిగ నొక్కటఁ బాఱుచు మెల్లమెల్లఁగా
నొక్కట నీరు నీటి వడి నుద్ధతి గొట్టఁగఁ బైకి దుమ్కి పే
రొక్కట వ్రాలు చుండి ధర నొప్పుగ స్వర్నది సాగె నత్తఱిన్ 16.

కం. శివుని శిరస్సునఁ దగ వ్రా
లి వసుధపైఁ బాఱి గంగ లీలఁగ మలిన
మ్ము విడివడంగఁ బునీత య
యి విరాజిల్లె విమల జల మేపారంగన్ 17.

ఆ.వె. భవుని యంగము విడఁ బరమ పవిత్రము
జల మని సుర ముని నిచయము భూజ
నామర వర గాయ కావలి నుదకమ్ము
ముట్టి రెల్ల రెడఁద ముదము నూని 18.

తే.గీ. స్నాన మొనరించి యెల్లరు శాప పతితు
లు పుడమికి గగనము నుండి యపుడు విగత
కల్మషు లయి చనిరి యుదకమ్ము పాప
ముల హరింపఁగ నిజ లోకములకు నలరి 19.

కం. జను లెల్లం బరవశమున
మునింగి గంగామల జలముల హర్షమునం
దనువుల శ్రమ మెల్లఁ దొలఁగ
మనముల శాంతం బడర విమలు లైరి తగన్ 20.

ఆ.వె. దివ్య మైన యట్టి తేరునఁ దేజస్వి
యా భగీరథుఁడు మహాత్ముఁ డేఁగు 21.

చుండ వెనుకఁ జాగు చుండె గంగానది
యనుసరించి రాన్మహర్షి సెలమి

తే.గీ. దైత్య దానవ రాక్షస దైవ సర్షి
గణ మహోరగ గంధర్వ గణ సకిన్న
రాప్సరస్త్రీలు యక్షవ రాదు లనుగ
మించిరి నృపతి జలజీవు లెల్ల నదిని 22.

కం. ఎట కేఁగినను భగీరథుఁ
డట కేఁగుచు నుండె గంగ యలరుచు మిగులం
దటినీ లలామ వేగమ
పటు పాపవినాశిని రఘువంశ వరేణ్యా! 23.

ఆ.వె. ముంచె నంత గంగ మునివరుఁ డద్భుత
కర్ముఁడు ఘన యజ్ఞకర్త జహ్ను
వుని మహాత్ము పరమ పుణ్య యాగస్థల
మడరి యొక్క త్రుటిని నక్కజముగ 24.

ఆ.వె. గంగ దర్ప మెల్లఁ గాంచి జహ్ను మహర్షి
రోష మూని యంత రుద్రు భంగి
గంగ నీటి నెల్లఁ గాకుత్స్థ! త్రాగెఁ దా
నలుకఁ జూచుచుండ నద్భుతముగ 25.

తే.గీ. విస్మయమ్మున నది సూచి భృగుమహర్షి
వేడి రట దేవ గంధర్వ వినుత ముని వ
రులు తనయగఁ దలఁచి గంగ నిల విడువగఁ
బురుష పుంగవుని మహాత్ముఁ బూజ చేసి 26.

కం. ముద మంది జహ్నువు చెవుల
నదిఁ దిరిగి సృజించెఁ దా ఘన తపో మహిమం
ద దనుగుణమ్ముగ జాహ్నవి
గఁ దనరె నామమ్ము ధాత్రి గంగకు రామా! 27.

తే.గీ. తిరిగి గంగ భగీరథు తేరు వెంట
నేఁగి యేఁగి చేరి కడలి వేగ మింక
రాజు కార్య సిద్ధి కొఱకు నేజఁ జేరెఁ
దమి రసాతలమును సరిత్ప్రవర మంత 28.

ఆ.వె. గంగను గొని తివిరి గాంచె భగీరథుఁ
డంత రాజ ఋషి మహాత్ముఁడు పిత
రులను భస్మములను విలపించి మిక్కిలి
దీన చేతనుండు తెల్లముగను 29.

కం. బూడిద గుట్టను దడుపగఁ
బాడిగ గంగా జలమున భవపాపమ్ముల్
వీడఁగ సాగరు లెల్లరు
నాఁడు సనిరి స్వర్గమునకు నలినదళాక్షా! 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది మూడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 44.

బ్రహ్మదేవుని నానతి సగర పుత్రులకుఁ దర్పణము లర్పించి స్నాన మాచరించి శుచియై భగీరథుఁడు రాజ్యమునకుఁ దిరిగి వచ్చి రాజ్య మేలుట. గంగానది త్రిపథగ యని , భాగీరథి యని బ్రసిద్ధి కెక్కుట.

కం. సురనదిఁ గూడి యతఁడు సా
గర మేఁగి రసాతలమ్ము గదిసెను వడిగాఁ
బరమంపు ముదము తోడ స
గర తనయుల భస్మరాశిఁ గాంచెను రామా! 1.

ఆ.వె. భస్మరాశి మునుఁగఁ బన్నుగ గంగా జ
లమున నరుగుదెంచి కమల సంభ
వుండు సర్వలోక పూజితుండు కని భ
గీరథునిఁ బలికె నుదారముగను 2.

తే.గీ. సగరు షష్ఠి సహస్రాత్మజ వరు లరిగి
రి దివికిఁ దరించి సురగణ సదృశులై మ
హాత్ము నందను లట్లు నరాగ్రగణ్య!
పావనంపు గంగా జల స్పర్శమునను 3.

కం. సాగర జల మెంత వఱకు
వీఁగుచుఁ బ్రవ హించుచుండుఁ బృథ్విని సతమున్
సాగరు లంత వఱకు దివి
బాగుగ దైవత్వ మంది వఱలెడు వారల్ 4.

ఆ.వె. నీదు సత్కృతమున నెగడ గంగ యిచట
పెద్ద కూఁతు రౌను బేర్మి నీకుఁ
బరఁగు నిది జగముల భాగీరథి యనంగ
విశ్రుతముగ నింక పేరు వడసి 5.

ఆ.వె. మూడు మార్గముల సమున్నతముగ నేఁగఁ
ద్రిపథగ యని విశ్రుతినిఁ జెలంగు
దివ్యగంగ రాజతిలక! భాగీరథి
రమ్య విమల తోయ రాశి నలరి 6.

కం. తాతలకు నెల్ల మనుజేం
ద్రా! తరళ సలిలము లిమ్ము తర్పణముల నీ
యీ తపము నింక విడువుమ
ప్రీతి భగీరథ! కృతార్థ పృథ్వీనాథా! 7.

తే.గీ. నీకుఁ బూర్వులును యశస్వులే కరమ్ము
ధర్మనిరతుల శ్రేష్ఠులు ధరణి పతులు 8.

నిజ మనోరథమును బొంద నేర కకట
చనిరి గొప్ప వారైనను సగరుఁ గూడి

ఆ.వె. అప్రతిముఁడు తేజ మందు నా యంశుమం
తుండు నెంచి గంగఁ దూర్ణము గొని
తేరఁ గైకొనియుఁ బ్రతిన నశక్తుం డయ్యె
నతఁడు నిష్ఫలుండు నయ్యెఁ దండ్రి 9.

తే.గీ. రాజ ఋషి మహర్షి సముండు రాజధర్మ
రతుఁడు తపమందు నా కగుఁ బ్రతిమ సద్గు
ణుఁడు దిలీపుఁడు నీ తండ్రి పుడమిఱేఁడు
తే నశక్యుఁ డాయెను గంగఁ దాను గూడ 10.

తే.గీ. అట్టి దయ్యె సాధ్యము నీకుఁ బట్టి కరము
ప్రతిన పూర్తి గావించితి రమ్యముగను
యశము గొందువు మిక్కిలి యభిమతముగ
లోక మందు నరర్షభ! లోకవినుత! 11.

కం. దించితి గంగను నీ విట
నంచితముగ నరవరేణ్య యాశ్చర్యముగా
నెంచఁగ ధర్మపు టింటను
మించును నీ కెలిమి చో టమిత్రధ్వంసీ! 12.

కం. ఉచితపు జలముల నిత్యము
శుచి వగుము మునింగి రాజసూను వరేణ్యా!
ప్రచురముగఁ బుణ్యఫల మొం
దు చిరము పుణ్యాత్ముఁడ వయి దుర్జయశూరా! 13.

ఆ.వె. చలుపు చక్కఁగ నిఁక సలిలక్రియ పితామ
హులకు నెల్ల రాజ! యుచిత రీతి
భద్ర మగును నీకుఁ బయనింతు నిజ లోక
మునకు నీవు నరుగుము నిఁక వేగ 14.

ఉ. అంత భగీరథుండు తగు న్యాయ విధమ్ము క్రమంపు భంగినిన్
సాంతము సాగరోత్తముల కత్యధి కార్తి జలక్రి యాదు లా
వంతయు భక్తి హీనమును నచ్చట చూప కొనర్చె నిష్ఠతో
నంత నతండు శుద్ధినిఁ బ్రయాణము సేసెఁ బురమ్ముఁ జేరఁగన్ 15.

కం. తాను గృతార్థుండై చని
దాన విధు లొనర్చి యంతఁ దద్దయుఁ బ్రీతిన్
భూనాథుఁ డేలె రాజ్యము
నీ నృవర భగీరథుండె యినకుల వర్యా! 16.

కం. జగ మెల్ల సంతసించెను
జగతి పతి భగీరథుఁ గని సంపూ ర్ణేష్టిన్
విగతజ్వరుండు నయ్యెను
దగ శోక లయుండు నాయెఁ దద్దయు రామా! 17.

కం. ఇది గంగ గాథ రామా!
యుదితం బయ్యె నిది యెల్ల నొప్పుగ నా చేఁ
బదిల మగు నీకు సంధ్యయు
విదితం బయ్యె నిపు డీవు వెలుఁగుదు స్వస్తిన్ 18.

తే.గీ. ధనము యశ మాయువుల దివిఁ దనయ సంచ
యమ్ము నిచ్చున దీ గాథ యవని సురుల
రాజులఁ బరు లందు నెవండు రతినిఁ జెప్పు
ప్రీతి నుంద్రు సుర లతని పితరు లెల్ల 19.

తే.గీ. శుభము గంగావతరణము శుద్ధ బుద్ధి
విను నెవండు వానికి నిక్కము నిజ వాంఛ
లెల్లఁ దీరుఁ బాపములు నశించు నాయు
వు యశముం జక్కఁగను వృద్ధిపొందు రామ! 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది నాల్గవ సర్గము.

# బాలకాండము

## సర్గము 45.

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు క్షీరసాగర మథన గాథ, దేవాసుర యుద్ధము దేవేంద్రుని విజయమును వచించుట.

కం. విని విశ్వామిత్రుని గిర
లను రాముఁ డనుజ వరుండు లక్ష్మణు తోడన్
మన మచ్చెరు వందఁగ నా
మునివర కౌశికునిఁ గాంచి ముదముగ ననియెన్ 1.

కం. మునివర చెప్పితి రద్భుత
మును గంగావతరణమును బుణ్య చరితమున్
విన నొంపుగ నింకయు నా
వననిధి పూరణము నెల్ల బ్రహ్మజ్ఞ వరా! 2.

ఆ.వె. తలఁచు చుండ నెల్ల రలరి విశ్వామిత్రు
కథ సలక్ష్మణు లయి కడచె నంత
రాత్రి యెల్ల నట విచిత్రముగఁ దెలియ
రాక సుంత యేని రమ్యముగను 3.

కం. తెలవాఱఁ బ్రభాతమున వి
మలమ్మునఁ గృతాహ్నికుండు మహితాత్మునిఁ గాం
చి లలిత వచనమ్ముల నిన
కుల తిలకుఁడు రాముఁ డనియెఁ గుశికాత్మజుతో 4.

చం. కడచెను దివ్య రాత్రి వినగం దగు గాథను నాలకింప మా
కడరి మునీంద్ర! యొక్క క్షణమై పరగంగ మహాతపోధనా!
యెడఁదఁ దలంచు చుండఁ గడు నింపుగ నీ యుదితంపు గాథనే
పడయుచు సంతసమ్ము నెదఁ బన్నుగ నేరక కాల మింతయున్ 5.

ఉ. ఆగమనమ్ము మీది విని యబ్జజ సన్నిభ నావ యిత్తఱిన్ 6.

వేగమ వచ్చె మౌనివర విస్తృత వారిరథమ్ము చిన్మ యా
త్మా! గరిమంపు టీ త్రిపథ గాఖ్యను గంగను బుణ్య వాహినిన్
వీఁగి తరింత మెల్లరము వేగమ యంచు వచింపఁ బ్రీతినిన్

ఆ.వె. అవ్వచనము లెల్ల నాలకించి మహర్షి
కౌశికుండు తొడఁగె గంగ నుత్త
రింప రామలక్ష్మ ణేతర మునివర
గణ సమేత మంతఁ గరము ప్రీతి 7.

తే.గీ. మునులఁ బూజించి సమ్మదముగను జేరి
యుత్తరంపుఁ దీరమ్ము మహత్తరమును
నిలిచి గంగ యొడ్డున వారు లలిత పురము
నరసిరి విశాల యను దాని నంచితమును 8.

కం. వడి రాఘవులం గూడి ఘ
నుఁడు ముని పుంగవుఁడు పురమును విశా లాఖ్యం
గడు రమ్యము దివ్యమ్మును
దడయక స్వర్గాభ మైన దానిం జేరెన్ 9.

కం. రాముండు మహా ప్రాజ్ఞుం
డా ముని పుంగవు నుతించి యంజలు లిడి వి
శ్వామిత్రు నడిగె నా యభి
రామంపు విశాల యను పురపు వివరములన్ 10.

కం. ఏ రాజవంశ వర్యు ల
పార విశాలా నగరము భద్రమగు మునీం
ద్రా! రమణీయముఁ గట్టిరి
మీ రెఱిఁగింపరె కుతుకము మిన్నఁగ నయ్యెన్ 11.

కం. అన విని రాముని మాటలు
ముని విశ్వామిత్రుఁ డంత మురిసి విశా లా
ఖ్యను బరఁగు నగరము పురా
తనం బయిన దానిఁ గూర్చి తా ననఁ దొడఁగెన్ 12.

కం. విను మా శక్రుని కథ రా
మ! నుడువగ మహా శుభమ్ము మఱి యీ దేశ
మ్మున జరిగిన వృత్తం బె
ల్లను గూడ వినుము పవిత్ర రఘుకుల వర్యా! 13.

ఆ.వె. అదితి పుత్రులు కల రా కృత యుగమున
మున్ను ధర్మరతులు సన్ను తార్యు
లెల్ల దితికిఁ గల్గి రెలమిఁ గుమారులు
వీర్యవంతు లెల్ల పృథ్వి రామ! 14.

ఉ. వారికిఁ గల్గెఁ జిత్తమున భావ మనాశ మరోగ మింకయున్
నేరక వార్ధకమ్మనఁగ నిత్యము నుండఁగ నెట్టు లంచు నా
నో రఘురామ తల్చు చటు లుండఁ దలంపు రసమ్ముఁ బొందఁగన్
క్షీర సముద్ర మంథనముచే నమృతమ్మును బుట్టె నంతటన్ 15.

తే.గీ. వాసుకినిఁ ద్రాడుగ నొనర్చి పర్వతమ్ము
మందరముఁ గవ్వముగఁ జేసి మంథనమ్ము
నిశ్చయించి వా రెల్లరు నివ్వటిల్ల
నోజఁ ద్రచ్చఁ జాగిరి వేగ యుదధి నంత 16.

శా. క్షీ రాంభోనిధి సిల్కఁ జిల్క విష మక్షీణమ్ముగాఁ జిమ్ముచున్
ఘో రాశీవిష ముగ్రతం గఱచెఁ దా ఘోరంపు దంష్ట్రమ్ములన్
వీ రావేశత ఱాళ్ల నగ్ని నిభమై పెంపారె హాలాహలం
బే రక్షస్సుర మానవాళి యుతమై యిద్ధాత్రి దగ్ధంబు గాన్ 17.

తే.గీ. శరణు వేడిరి సుర లెల్ల శంకరుఁ బశు
పతి మహాదేవు నరిగి కాపాడ మంచు
నార్తిఁ గైలాస నాథుని నభవు రుద్రు
భక్తి నార్త జనత్రాణు యుక్తముగను 18.

ఆ.వె. అమరు లెల్ల రిట్టు లర్థించు చుండఁగ
దేవదేవుఁడు హరి దివ్య శంఖ 19.

చక్ర ధారి యచట చక్కఁగఁ బ్రత్యక్ష
మయ్యె హర్ష మంద నంత సురలు

మ. చిరు నవ్వొల్కఁగ మోముపై హరుని నా శ్రీవర్ధనుం గాంచి ని
ర్జర కోట్యగ్ర భవుండ వీ వని సురవ్రాతాగ్ర గణ్యుండ! సా
గరముం ద్రచ్చుచు నుండగా నమరు లగ్రప్రాప్త మీ వస్తువున్
గరళమ్ముం దొలి యర్చ యంచుఁ గొను ముక్కంటీ! యనెం జక్రియే 20.

చం. అని హరి మాయ మయ్యె నమరాగ్రిముఁ డత్తఱి మాధవుం డటం
గని సుర భీతి నిర్జర ముఖమ్ముల దైన్యయుతమ్ము లింకయున్
మినుకులఁ జక్రి పల్కు విని మీఱిన హాలహలమ్ము నంతయుం
ద్రినయనుఁ డంత మ్రింగె సుధ దీ టని తోఁపఁగ నొక్క పెట్టునన్ 21.

ఆ.వె. విడిచి సురల నంత వెడలె శ్రీకంఠుఁడు
దేవదేవుఁ డెలమి దేవతలును
దైత్య వరులు తిరిగి త్రచ్చనారంభించి
రెల్ల రడరి మిగుల నినకుల వర! 22.

పృథివి. మథన మడరఁగ మాయగ నా
కుధరము త్రుటినిఁ గూలె నహో
పృథివికి దిగువ వింత సురల్
వ్యథను గొలిచిరి యా హరినిన్ 23.

ద్రుతవిళంబితము. గతివి భూత నికాయముఁ గావఁగా
పతివి యీ సుర వర్గము నెంచి సం
పతిత శైలముఁ బన్నుగ నెత్తుమా
సతము రక్ష నొసంగుమ కేశవా! 24.

తోటకము. విని యీ నుడులన్ హరి వేగమ గో
మునఁ గూర్మపు రూపము మూరఁగఁ గొం
డను వీపున నూని విలంబము దా
నొనరింపక యుంచెఁ బయోనిధినిన్ 25.

స్రగ్విణి. కొండ కఱ్ఱమ్ముగా నం గూర్చి హస్తమ్ము దా
నుండి దేవాంతరా శోత్తమ స్థాయియై
మండితుండై తగన్ మంథనం బా ముకుం
దుండు లోకప్రజాత్ముండు సేసెన్ వడిన్ 26.

ఉపేంద్రవ్రజము. సహస్ర వర్షమ్ములు సాగ వచ్చెన్
స్వహస్త సక్తోదక పాత్ర దుద్ధున్
వహించి ధన్వంతరి వచ్చె నా స్వ
ర్గ హంస యానావలి రాగ దీప్తిన్ 27.

దోదకము. అప్పును ద్రచ్చఁగ నందపు నారుల్
చప్పునఁ బుట్టఁగఁ జక్కఁగ వారిం
జెప్పుదు రచ్చర చేడియ లంచున్
మెప్పు వహింపఁగ మేదిని రామా! 28.

కం. అఱువది కో ట్లప్సరసలు
తఱచై పరిచారికలును దనరఁగఁ గాంతుల్
మెఱయఁగ దేహమ్ముల నం
దఱి కింపుగఁ బుట్టి రపుడు దశరథ తనయా! 29.

ఆ.వె. వారి దేవ దానవ తతి సెవ్వరు నొల్ల
కున్న దారలుగను జెన్ను మీఱఁ
జూమ లెంచఁ బడిరి సాధారణ లనంగ
వార లెల్ల రపుడు వారిజాక్ష! 30.

కం. పతి నాశించుచు వరుణుని
సుత పుట్టెను వారుణి యనఁ జోద్యం బలరన్
దితి పుత్రులు వల దనిరి య
దితి సూనులు గైకొనిరి యతివ నా విమలన్ 31.

కం. సుర నొల్ల కసురు లనగం
బరఁగిరి దైతేయు లెల్లఁ బడయంగ సురన్
సుర లై రదితి కుమారులు 32.

సురఁ గొని మురిసిరి కరమ్ము శూరవరేణ్యా!

తే.గీ. పుట్టె నుచ్చైశ్రవ మన నపూర్వ హయము
కౌస్తుభము మణిరత్నము కడలి యందు
నుద్భవించె నమృత మంత నుత్తమమ్ము
త్రచ్చఁ ద్రచ్చఁ గ్రమమ్ముగ రఘువరేణ్య! 33.

కం. అమృతమ్ము కొఱకు నయ్యెను
సుమహా వంశక్షయమ్ము సురవరు లచటన్
సమయించిరి దైత్య సమూ
హము నంత సమరము నందు నాగ్రహ మడరన్ 34.

తే.గీ. రక్కసు లసురు లెల్ల రలరి యొక టయి
పోర ఘోర యుద్ధం బయ్యె వీర! మూడు
లోకములు మోహ మందఁగఁ దాఁక ధ్వనులు
చెలఁగి దిక్కుల నన్నిటిఁ జెచ్చెర నట 35.

ఆ.వె. సర్వ లయము కాఁగ శక్తిమంతుఁడు విష్ణు
వతి బలుండు వచ్చి యమృతమును హ
రించెఁ జక్కఁగ ధరియించి మోహిని రూప
మడరి తూర్ణముగ మహాత్ముఁ డంత 36.

తే.గీ. అక్షయ పురుషోత్తమునకు నభిముఖు లయి
విష్ణువునకు భండనమున వీర దైత్య
వరులు ప్రభవిష్ణువునకు నపారముగ న
లిగిరి యెల్ల రసువులు వోవఁగ నరేంద్ర! 37.

ఆ.వె. దేవ దానవ సమితి నదితి పుత్రులు
వీర వరు లసురుల ఘోరముగను
యుద్ధము నొనరించి యుద్ధతిఁ జంపిరి
దోర్బలమ్ము చెలఁగ దుర్భరముగ 38.

కం. దితి పుత్రుల నిర్జించి సు 39.

గతిఁ బడసి పురందరుండు ఘన రాజ్యము దా
నతి ముదమునఁ బాలించె జ
గతుల సచారణ వరముని గణముల రామా!

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది యైదవ సర్గము.

# బాలకాండము

## సర్గము 46.

దితి పుత్ర శోకమున భర్త కశ్యపునిఁ దనకు నింద్రుని జంపు నట్టి పుత్రు నొసఁగు మనియుఁ దాను తపము చేయుటకు ననుజ్ఞ నిమ్మని వేఁడ నా వరమును బ్రసాదించుట, పిన తల్లి దితికి సేవలు చేయుచు నింద్రుఁడు తల్లి యశుచిగా నిద్రింప గర్భమునఁ బ్రవేశించి పిండము నేడు ముక్కలుగ వజ్రమున నఱుకుట.

కం. చన దివికిఁ గుమారులు వగ
పున దితి మారీచుఁ గశ్యపునిఁ గని భర్తన్
ఘన తాప తప్త యయి పలి
కెను వచనము లిట్లు రామ! కినుకయుఁ బొడమన్ 1.

ఆ.వె. పుత్ర హీన నైతిఁ బోరునఁ జంప నీ
పుత్రు లెల్ల మీఱి పూజ్య! శక్రుఁ
జంపఁ గలుగు సుతుని నింపయిన తపము
వలనఁ గల్గు వానిఁ బడయ నెంతు 2.

తే.గీ. ఏఁగెదఁ దపమ్ము సే నాచరింప నాథ!
గర్భ మొసఁగ వలయు నాకు నర్భకునిఁ బు
రందరునిఁ జంపు నీశ్వరు డెంద మలర
నాన తిమ్ము తపమునకు నూని కరుణ 3.

కం. దితినిన్ దారఁ బరమ దుః
ఖిత నరసి మహాత్ముఁడు విని గిరలం గరుణం
బతి కశ్యపుండు సంయమి
పతి బదులుగఁ బల్కె నిట్లు పన్నుగ రామా! 4.

ఆ.వె. అట్లగును దపోధనా! శుచి వగుమ భ
ద్ర మగుఁ గాక నీకు రమణి! మిగులఁ
బుట్టఁ గలఁడు సుతుఁడు పోరున నింద్రునిఁ
జంపు వాఁడు నీకు నింపొదవఁగ 5.

తే.గీ. వేయి యేండ్లు పూర్తి యయిన వెలఁది! నీవు
శుచిగ నుందు వేని సతము సూను నొందఁ
గలవు ముల్లోకములకును గాంతు నెలమి
శంక వల దింక నీ కిందుఁ జారువదన 6.

కం. పలికి పతి మహా తేజుఁడు
లలిత కరస్పర్శ సేసి లాలన వచన
మ్ములు స్వస్తి భాషణములం
బలికి తపము సేయఁ జనియెఁ బరమర్షి వడిన్ 7.

కం. చనఁ బతి పురుష శ్రేష్ఠా!
వనిత దితి ముదమ్ము వడసి పరమమ్ముగఁ దాఁ
జనియెఁ గుశప్లవనము సే
సెను దారుణ మైన తపము చిరకాలమ్మే 8.

ఆ.వె. తపము చేయు చుండఁ దల్లి సహస్రాక్షుఁ
డు పరిచర్యలను గడు వినయమున
గుణధనుండు సేసెఁ గూర్మి నిత్యమ్మును
భక్తి సంయుతమ్ము పరమపురుష! 9.

ఆ.వె. అగ్ని కుశలు కట్టె లప్పు ఫలములు మూ
లముల నన్యముల వలసిన వాని
నెల్లను సమకూర్చి యెలమి సేవలు సేయు 10.

చుండె భక్తి వాసవుండు వేగ

కం. చరణము లొత్తుటయు శ్రమము
పరిమార్పఁ దలంచి యట్టి పనులం దగు నా
దరమునఁ జేయుచు శక్రుఁడు
పరిచర్యలు నిత్య ముండె వారక రామా! 11.

తే.గీ. ప్రీతయై దితి పల్కెను వేయికిఁ బది
తక్కువగ నేండ్లు గడచిన మిక్కుటముగ
నా సహస్రాక్షు వీక్షించి హర్ష మడర
నివ్విధముగ నుచిత రీతి నినకులేంద్ర! 12.

కం. సురముఖ్య! నీ జనకుఁ డిడె
వరమ్ము నడుగంగ వేయి వత్సరములకుం
బరమునఁ బుత్రోదయమున్
జరుపంగఁ దపమ్ము నాకు సదమలచిత్తా! 13.

తే.గీ. ఆచరించుచు నుండ మహాతపమ్ము
తక్కు వయ్యె నింకఁ బది వత్సరము లిపుడు
వీర్యవంత! వీక్షింతువు బ్రీతి నపుడు
నీదు భ్రాతను భద్రము నీ కగుఁ జుమి 14.

ఉ. ఎవ్వని సెంచితిన్ నిను జయింప నొనర్తును నెమ్మి నాతనిన్
నొవ్వక మూడులోకములనుం దగఁ గెల్చెడు వీరు భంగిగా
నవ్వర పుత్రుతోఁ గలసి యాత్మఁ దొలంగ జ్వరమ్ము పుత్రకా!
నివ్వెఱ వీడి లోకములు నేర్పునఁ బాలన సేయు మింపుగన్ 15.

చం. తగ నపరాహ్ణ మైన దితి తల్లి వచించి బలారి కివ్విధిన్
మగువకు రాఁగఁ గూ ర్కడరి మత్తున నత్తఱి వేగ నోలె వీ
లుగఁ దల దిక్కు కాళ్లిడి పరుండెను గాలవశమ్మునం గటా
తగ దని యెంచ కింతయును దన్మయ మంది సరోరుహాక్షియే 16.

తే.గీ. శిరపు దిక్కునఁ గాళ్లును జరణములకుఁ 17.

దగిలి కురు లుండ వీక్షించి తల్లి నంత
వాసవుండు నవ్వొలయంగ వక్త్ర మందు
నంతరంగమున భృశము సంతసించె

ఆ.వె. సూక్ష్మ రూప మూని చోద్యపు ధృతిఁ జేరి
దితి శరీర వివర గతిని నంత
గర్భము గని యదయ ఖండించె నేడు ఖం
డములుగఁ దమకించి నరవరేణ్య! 18.

ఆ.వె. వంద యంచులు గల వజ్రమ్ముచే నట్లు
పగులఁ గొట్టఁ బడఁగ బాధ తోడ
పిండ మేడ్చె నంతఁ బెద్ద యెలుఁగు తోడ
నంత మేల్కొనె దితి యార్తి తోడ 19.

కం. రోదింపకు రోదింపకు
మో దితి పిండమ యనుచు నహో శక్రుఁడు దా
భేదించె నేడ్చు చున్నను
పే దయ నూనక మది బలభేది రఘువరా! 20.

కం. తగదు వధింప వధింపఁగఁ
దగ దని సంభ్రమమున ననఁ దల్లి దితి యటం
దగ గౌరవమే యేపా
రఁగఁ దల్లి వచనముల నుదరము విడి వచ్చెన్ 21.

ఆ.వె. ప్రాంజలి యయి చక్క వజ్రము తోడుతఁ
బలికెను దితినిఁ గని పదము లందుఁ
గురులు పడఁగ నిదురకు నశుచిగ నుపక్ర
మించి తీవు తల్లి యంచు వజ్రి 22.

కం. అద నది కొని శక్రు హరుని
విదారమున దేవి యేడు భిత్తమ్ములుగన్
మది భీతిలి చేసితి న
మ్మ దయన్ క్షమియింపు మని కుమారుఁడు వేఁడెన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది యాఱవ సర్గము.

## బాలకాండము

## సర్గము 47.

సప్త గర్భ శకలములు మరుద్గణములుగ దేవతలు కావలె నని దితి కోరుట  యింద్రుఁ
డంగీకరించుట, ఆ స్థలమున విశాల నగరమును నిర్మించిన నిక్ష్వాకు పుత్రుఁడు విశాలుని వంశ
చరిత్ర,  వైశాలుఁ డైన సుమతి విశ్వామిత్రుని పూజించుట.

కం.   శకలము లే డగుట యెఱిం
గి కడుపు దితి చిత్త మందు ఖేదము సెలఁగన్
వికలస్వరమునఁ గాంచి ప
లికెను దురాధర్షుని బలరిపు సాంత్వమునన్  1.

ఆ.వె.   ముక్క లయ్యె గర్భము సత తునుకలుగ
నాదు తప్పు వలన నీదు దోష
మేమి లేదు పుత్ర! యింద్రు దేవేశ! బ
లాసురారి! యంచు ననునయించె  2.

తే.గీ.   గర్భ భేద దుఃఖిత నైతి కరము నాకు
నొక్క ప్రీతి సేయుమ పుత్ర! చక్క నీ మ
రుత్తు లేడ్గుర కేడు గురుస్థల పరి
పాలనమ్ము నొసంగుమ భద్రముగను  3.

తే.గీ.   అలరి సప్తవాత స్కంధములకు నా కు
మారు లేడ్గురు విభులయి మారుతులుగ
దివిఁ జరింప వలయును గీర్తిని వహించి
దివ్య రూపములఁ జెలంగి దేవముఖ్య!  4.

ఆ.వె. బ్రహ్మ లోక మందుఁ బరఁగ నొకఁడు నింద్ర
లోక మందుఁ బరుఁడు వీఁక నుండ
నాకసమ్ము నందు నన్యుఁ డుండ వలయు
వాయు వనఁగ ఖ్యాతి వడసి పుత్ర! 5.

తే.గీ. నల్గు రింక సురశ్రేష్ఠ! నా తనయులు
దేవ భూతులై నీ యాజ్ఞ దిశలు నాలు
గింటఁ జరియింప వలయు నకంటకమ్ము
భద్ర మగు నీకుఁ బుత్రక! పనుపు మట్లు 6.

కం. పలుక జనని మాటల నా
బలసూదనుఁ డాలకించి ప్రాంజలియై తాఁ
బలికెను బురందరుఁడు క
న్నులు వేయి కలట్టి వాఁడు నుతియించి తగన్ 7.

తే.గీ. చెప్పినవి యెల్ల నట్లగు శీఘ్రముగను
సంశయమ్ము సుంతయు లేదు జనని నమ్ము
భద్ర మగు నీకుఁ జరియింత్రు వార లట్లు
దేవ నిభులు నీ తనయులు దేవి! వినుమ 8.

ఆ.వె. తల్లియుఁ దనయుండు తత్తపోవనమున
నిశ్చయించి యట్లు నెమ్మి దివికి
నరిగి రట కృతార్థులై యిద్ద ఱింపుగ
వింటి మిట్లు రామ! వీరవర్య! 9.

కం. ఇది యా దేశము కాకు
త్స్థ! దితి తపము సేయుచుండ శక్రుఁడు సేవిం
చి ధృతి నివాసం బున్న
ట్టిది సిద్ధి నొసంగినది కడింది శుభదమున్ 10.

మ. నర శార్దూల! యలంబుషా సతికి భూనాథుండు నిక్ష్వాకు నా
మ రవిప్రాభవ వంశ జాతునకు సన్మాన్యంపుఁ బుత్రుండుగాఁ 11.

బర మోదార విశాలుఁడే కలిగె నప్పార్థుండు నిర్మించె నీ
బుర రాజమ్ము విశాల నాఁ దనరగం బుణ్యంపు టిచ్చోటునన్

ఆ.వె. హేమచంద్రుఁడు సుతుఁ డీ విశాలునకు మ
హా బలుండు రామ! యతని పిదప
నయ్యె నతని తనయుఁ డా సుచంద్రుఁ డిల వి
ఖ్యాతుఁ డిద్ధ చరితుఁ డత్యధికము 12.

ఆ.వె. నందనుఁడు సుచంద్రునకును ధూమ్రాశ్వుఁడు
యశము వడసెఁ బుడమి నతని నంద
నుండు ఘనుఁడు సృంజయుం డుద్భవించెను
వంశ వర్ధకుండు పరమ పురుష! 13.

ఆ.వె. సృంజయుని సుతుండు శ్రీమంతుఁడు సహదే
వుఁడు ప్రతాపవంత పూరుషుండు
పరమ ధార్మికుండు వర సుతుండు కుశాశ్వుఁ
డతని కుద్భవించె నవని రామ! 14.

ఆ.వె. సోమదత్తుఁ డయ్యె సుతుఁడు కుశాశ్వున
కతఁడు విక్రముఁడు మహాయశస్వి
సోమదత్తు నకిల సూనుఁడు కాకుత్స్థ
నామ విశ్రుతుండు రామ! వినుమ 15.

ఆ.వె. సుమతి నాముఁ డతని సుతుఁడు తేజస్వి యి
ప్పురమునం దిపుడు రిపుగణ దుర్జ
యుఁడు వసించు చుండు నడరి సుర నిభుండు
రాజ వరుఁడు ధర్మ రతుఁడు రామ! 16.

తే.గీ. నృపులు వైశాలికులు దయ నెగడ మిగుల
వారి కిక్ష్వాకునిది యెల్ల వారు వీర్య
వంతులు సుధార్మికులు గుణవంతు లమల
చిత్తు లింక దీర్ఘాయువు లుత్తములును 17.

కం. నిలిచెద మిట యీ రాతిరి
యలరి నరవరేణ్య! జనకు నవనీ నాథుం
దెలవాఱినఁ జన్నం గనఁ
గలవు రఘుశ్రేష్ఠ! యంచుఁ గౌశికుఁ డనఁగన్ 18.

తే.గీ. నరవరుండు తేజస్వి ఘనయశుఁడు నృప
తి సుమతి విని విశ్వామిత్రు దివ్య సంయ
మీంద్రు రాక నచట కట్లు నింపుగ నెదు
రేఁగె సద్భక్తి మీఱంగ వేగ మురిసి 19.

కం. గురువులు బంధుజనులతో
నరుదెంచి సుమతి నరేశుఁ డచటికిఁ బ్రీతిం
గరములు మొగిడ్చి పూజ లొ
నరిచి కుశలమడిగి పలికె నమ్రత మునితో 20.

తే.గీ. ధన్యుఁడ నయితి మిమ్మిటఁ దాపసేంద్ర!
కాంచి నాదు పురమ్మునఁ గా లిడఁగ న
నుగ్రహమ్ముఁ బడసితి నేను బరుఁ డొకఁడు
ధన్యతరుఁ డెవండును లేఁడు తథ్యముగను 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది యేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 48.

గౌతమ మహర్షి సతి యహల్యా శాప వృత్తాంతము.

కం. కలయికఁ గుశలప్రశ్నము
లలరంగఁ గథాంత మందు ననె శుభ వాక్య 1.

మ్ముల నృపతీంద్రుండు సుమతి
లలితముగ మునీంద్రు తోడ రాగం బలరన్

మ. ముని చంద్రా! యగు నీకు భద్రము ఘనుల్ పుత్రుల్ సురాభుల్ సుమీ
ఘన శౌర్యమ్మున హస్తి సింహ గమనుల్ గాంచంగ శార్దూల ధు
ర్య నిభుల్ వీరులు పద్మపత్ర నయనుల్ రమ్యాశ్వినీ పుత్ర తు
ల్య ని జాకారులు ఖడ్గ తూణ గుణి విఖ్యా తావతంసద్యుతుల్ 2.

ఉ. యౌవను లిర్వు రిచ్చటకు నా దివి నుండి యథేచ్ఛ వచ్చిరా
పావన నిర్జ రేంద్రులు నపార కుతూహల చిత్తులై యనన్
భావన మాత్మ నేర్పడఁగఁ బాద చరత్వ విలాస లోలులై
యీ వన వీథి నేల యరుదెంచిరి యెవ్వరు వీరు చెప్పరే 3.

ఉ. పోలు చొకండు నొక్కనిని మూర్తినిఁ జేష్టల నింగితమ్ములన్
మే లగు నాయుధమ్ములను మీఱి వహించుచు ధైర్యవంతు లీ
నేల నలంకరించుచు వినీల నభో గత సూర్యచంద్రు లన్
లీలఁగ నేల యీ నర వరిష్ఠులు వచ్చిరొ చెప్పుఁ డింపుగన్ 4.

కం. విని రాజవరు వచనములు
ముని సిద్ధాశ్రమ నివాసము నసుర వధయున్
వినిపించె మహాత్ముఁడు జరి
గిన వృత్తాంతమ్ము నృపతికి నఖిల మంతన్ 5.

తే.గీ. క్ష్మాపతి కడు ముదం బంది కౌశికు పర
మర్షి గిరల దశరథు కుమారు లతిథు
లతి బలులను బూజార్హుల నర్హ రీతిఁ
దనరి పూజించెను యథావిధమ్ము ప్రీతి 6.

కం. నృపతి సుమతి గౌరవ మల
రి పడసి రాఘవులు రాతిరి వసించి యటన్
నృప నందనలు స ముని చయ
ము పయన మైరి మిథిల కతి ముదమున నంతన్ 7.

కం. కని జనకు శుభ పురము మిథి
లను సాధువు సాధువంచు రాజపురమ్మున్
ఘనముగ శ్లాఘించిరి య
ర్చన లిచ్చిరి చిత్తములను సముచిత రీతిన్ 8.

తే.గీ. నెమ్మి నప్పురంపు టుపవనమ్ము నందుఁ
జనిచని కని శూన్యంపు టాశ్రమము నొక్క
దాని రఘువరేణ్యుఁడు పురాతనము నిర్జ
నమ్ము నడిగె మునిఁ గుతూహలమ్ము సెలఁగ 9.

కం. సిరి చెలఁగు నాశ్రమ మనఁ ద
నరు ముని వర్జితమునై కనబడు మునీంద్రా!
పరమాత్మా! యిది యెవ్వరి
వరాశ్రమము మున్ను దెలియఁ బల్కుఁడు నాకున్ 10.

కం. విని పలికె వాక్య కోవిదుఁ
డనువుగ వాక్యమ్ములను మహా తేజుం డా
ముని పుంగవుండు రాఘవుఁ
గని విశ్వామిత్రుఁ డంతఁ గమనీయముగన్ 11.

కం. నుడివెద యథార్థముగ ని
య్యెడ నాశ్రమపద చరిత్ర సెల్ల నొక మహా
త్ముఁడు శపియించిన దానిని
బెడిదమ్ముగ రాఘవేంద్ర! విస్తారముగన్ 12.

ఆ.వె. దివ్య సన్నిభమ్ము దేవ సంచయ సేవి
తమ్ము నైన యాశ్రమమ్ము కలదు
మున్ను దనరి గౌతముండు మహాత్ముఁడు
వాస ముండ నందుఁ బరమపురుష! 13.

ఆ.వె. సతి యహల్యఁ గూడి సంవత్సరమ్ములు
పెక్కు తపములు విరివిగ నొనర్చు
చుండె రాజసుత! యశోవిరాజితుఁ డిందుఁ 14.

బరమ పావనుండు బ్రాహ్మణుండు

కం. తగిన సమయమ్ము నారసి
నగవైరి యడరి సహస్ర నయనుఁడు శచికిన్
మగఁ డింద్రుఁ డహల్యా దే
విఁ గదిసి మునివేష మూనిఁ బేర్మినిఁ బలికెన్ 15.

కం. ఋతుకాలము కొఱ కాగరు
లతాంగి! కామార్తు లీ యిల వనజనేత్రా!
మతి యాయెఁ జిత్తమున నో
సుదతీ! నీ సంగమమ్ము సుందరి! వినుమా 16.

ఆ.వె. వచ్చినట్టి వాని వాసవుం డని రామ!
కపట వేషు నెఱిఁగి కాంత కపుడు
దేవ రా జనంగఁ దెరలఁ గుతూహల
మతివ సమ్మతించె నంతఁ గుమతి 17.

తే.గీ. పూర్ణ కామ చిత్తమ్మున ముదిత పలికె
నంత నే కృతార్థ నయితి నమర ముఖ్య!
శీఘ్ర మేఁగుమ యిటనుండి చెన్నుగ విభు
గౌతముని నుండి నిను నన్ను గాచికొనుమ 18.

కం. పలికె నగుచు నింద్రుం డా
లలన నహల్యఁ గని దేవ రాజు ముదమునం
జెలఁగెఁ దనివి సుశ్రోణి! మ
రలెద యథాగతి ననుచు బలరిపువు రామా! 19.

ఆ.వె. భామఁ గూడి వీడి పర్ణశాల పురంద
రుండు వేగ గౌతముండు గాంచు
నంచు బయలు పడెను మించ సంభ్రమ మది
స్వీయ చిత్త మందు వెఱచి రామ! 20.

చం. కనె హరి యంత వే కదియు గౌతము సన్ముని నుజ్జ్వలత్తపో 21.

ధనుని సురాసు రాజితు నుదప్లుత గాత్రుని వహ్ని దీప్తునిన్
ఘన కర భాసి తాట్ట కుశుఁ గంజ వరాన్వయ వార్ధి చంద్రునిన్
మునిగణ పూజ్యమాను ఘను బుణ్య చరిత్రు విలోల చిత్తుఁడై

ఆ.వె. కని వివర్ణ వదన ఘన తాప తప్తుఁ డా
యె సురవిభుఁడు మునివరేంద్రుఁ డంతఁ
గని సహస్రనేత్రు ముని వేషధరు దుష్ట
వృత్తుఁ గినిసి సుగుణవృత్తుఁ డనియె 22.

ఆ.వె. నాదు రూప మూని యీ దుష్ట కార్యము
సేసి తీవు దుష్ట! సేయ రాని
కృత్యము నిటఁ గాన వృత్తహీన! యఫలుఁ
డౌదు వీవు సుర గణాధినాథ! 23.

కం. పలికిన తత్క్షణ మివ్విధిఁ
బలుకులు ముని సత్తముండు వాసవున కహో
యిల రాలె వృషణములు క
న్నులు వేయి కల సురపతి కనూహ్యముగ వడిన్ 24.

మ. ముని యా శక్రు శపించి శాప మొసఁగెం బూర్ణేందు బింబాస్యకున్
వనితాహల్యకు స్వీయ దారకును వే వర్షంబు లుండంగ ని
త్య నిరాహారము వాయు భక్షణమునం దాపమ్మునన్ భస్మ శా
యినియై యాశ్రమ మందుఁ గన్పడక తా నెవ్వారి కంచుం గటా 25.

ఆ.వె. ఎన్నఁ డీ వనమున కినకుల రాముం డ
జేయుఁ డరుగుదెంచుఁ జిగురుఁ బోడి!
నాఁడు శుచివి యై తనరుదువు దుర్వృత్త!
వేల వేల యేండ్లు క్రాల నట్లు 26.

ఆ.వె. అబల! యాతని కిడ నాతిథ్య మింపుగ
మూరి లోభ మోహము లణగంగ
స్వీయ దేహ మూని చేరుదు నన్నింక
ముదము వడసి చిత్తమున భృశమ్ము 27.

కం. పలికి ముని యిట్లు వేగమ
కలుష చరితఁ గాంచి యంత గౌతముఁ డా శీ
తల నగము సిద్ధ చారణ
కుల సేవిత మేఁగి చేసె ఘోరపుఁ దపమున్ 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది యెనిమిదవ సర్గము.

# బాలకాండము

## సర్గము 49.

ఇంద్రునకు మేష వృషణములను గూర్చుట, యహల్యా శాపవిమోచనము, గౌతముఁడు దారతోఁ గూడి రామలక్ష్మణులను సత్కరించుట.

కం. అవృషణుఁడు కాఁగఁ బరిత
ప్త వాసవుఁడు దేవ సిద్ధ వర గంధర్వ
ప్రవర సుచారణ యుత ముం
డ వహ్నితోఁ బలికె నలమట సెలఁగ మదినిన్ 1.

ఆ.వె. దేవ కార్య మడరి యీ వని గౌతమ
ముని తపంపు విఘ్నము దగఁ జేసి
తిఁ గినియంగఁ జేసి తీవ్రముగ మహాత్ము
నిపుడు సంతసమ్ము నీయ మీకు 2.

తే.గీ. నే నయితి నక్కట వృషణ హీనునిగను
భర్త వర్జిత యయ్యె నీ భామ యిపుడు
శాప మీయంగ నడరి రోషమ్ము నూని
యపహరించితి వేగ మా యనఘు తపము 3.

తే.గీ. అమర సాహాయ్యుని కమర నంచితంపు
టండకోశము లింపుగ నఖిల సురులు
చారణులు మునులును జేయ సముచితముగ
నుద్యమింప నర్థులు గారె హృద్యముగను 4.

తే.గీ. వాసవుని శతక్రతువుని వాక్కు లాల
కించి దేవత లెల్లరు నింపుగను మ
రుద్గణములతో నా యనలుండు ముందు
నుండఁ బితృదేవులను జేరి యుచిత రీతి 5.

ఆ.వె. పల్కి రిట్లు మేష వరము సవృషణ మి
ది యఫలుండు నయ్యె దేవపతియె
మేష ముష్కములను మీరు దేవ పతికిఁ
గూర్చుఁ డంచు వారు కోరి రంత 6.

ఆ.వె. అఫల మైన మేష మందించుఁ గడు తుష్టి
మీకు నారగింప మేదినీ జ
ను లొసఁగుదురు వీని నిల నంచితమ్ముగ
హర్ష మడరఁగ హృదయమ్ము లందు 7.

తే.గీ. అగ్ని మాటలు వినినంత నా పితరులు
శక్రున కిడిరి పెకలించి చక్క తగరు
నండకము లంత శీఘ్రమ యద్భుతముగ
సంతసింప నమరు లెల్ల శక్రుఁ గూడి 8.

తే.గీ. నాఁటి నుండి కాకుత్స్థ! యనవరతమ్ము
బీజ హీన మేషమ్ముల నోజఁ దింద్రు
పితరు లెల్ల కలసి యీయ బీజములు పు
రందరునకు నా రీతి గౌరవము సెలఁగ 9.

కం. గౌతము తపః ప్రభావము
చేత నజ వృషణుఁ డకట శచీపతి యయ్యెన్ 10.

వీత నిజ బీజుఁ డింద్రుం
డాతత బలవిక్రముండు నాదిత్యుండే

తే.గీ. రమ్ము రామ! పుణ్యుని యాశ్రమమ్ముఁ గాంచ
నిట మహాతేజ! తరియింప నీ యహల్య
ను సతి దేవరూపిణిని వినుత మహా త
పః పునీతను గాకుత్స్థ! భద్రముగను 11.

కం. విని తగ నా విశ్వామి
త్రుని వచనము లెల్ల ముని వరుఁడు ముం దలరం
గ ననుజుఁడు లక్ష్మణునితోఁ
జనె రాముఁడు ప్రీతిఁ బర్ణశాలకు నంతన్ 12.

చం. అడుగిడి కాంచె దాశరథి యాశ్రమ మందు నహల్య వ్యోమ భా
గుడు గణ కాంతి తుల్యఁ బ్రజ కుర్వి నగోచర మౌనికుల్య నా
పడతిని దీప్త కల్య రవిభాసన తుల్యను ధాతృమాయనున్
బడబ ధవానుకూల్యఁ దుహినస్థిత సాభ్ర సుధాంశు తుల్యనున్ 13.

తే.గీ. దుర్నిరీక్ష యయ్యె నహల్య పర్ణశాల
యందు ముల్లోకములకు మహర్షి గౌత
ముని వచనముల దర్శనము రఘు రాము
నిది కలుగు నంత వఱకు సునిశ్చయముగ 14.

కం. శాపాంతము చేరువ కా
నా పార్థ కుమారు లంత నట చేరంగం
జూపులకు గోచర మయిన
నా పడతికి మ్రొక్కి రిద్ద అప్పుడు భక్తిన్ 15.

కం. తలఁచి పతి గౌతము వచన
ములను బలికి స్వాగతము సముచితం బర్ఘ్య
మ్ములు పాద్యము లాతిథ్య
మ్ముల నీయ సతి రఘువరుఁడు ముదమున కొనియెన్ 16.

తే.గీ. పుష్ప వర్షము కురిసె విపులముగాఁ జె
లంగె దేవదుందుభులు వెలింగె నప్స
రసల నాట్యమ్ము గంధర్వ రమ్య సంఘు
మలరె నింపుగ విలసిల్లె హర్ష మచట 17.

ఆ.వె. పల్కి రెల్ల రంత బాగు బాగని ప్రీతి
సతి నహల్యఁ గాంచి నుతుల ముంచి
రి పతి వశగ నుచిత రీతిఁ దపో బల
శుద్ధ తన్వి వినుత బుద్ధి నడరి 18.

కం. తగఁ బూజించి రఘూత్తము
ని గౌతముఁడు తాపసుండు నిజ దార యుత
మ్మగ ఘన తేజుండు తపం
బు గరిమ నొనరింపఁ జాగె ముద మేపారన్ 19.

కం. రాముఁడు సుపూజ నంది మ
హా ముని గౌతముఁడు సేయ నంచిత రీతిన్
నీమముల నెంచి ప్రీతిని
నా మిథిలా నగరమునకు నలరుచు నరిగెన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది తొమ్మిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 50.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని మునులను గూడి జనకుని యజ్ఞ వాటమును జేరుట,
రాఘవులను జనకునకుఁ బరిచయము చేయుట.

కం. ముని విశ్వామిత్రుని నిడి 1.

మునుముం దీశాన్య దిశకుఁ బూర్ణోత్సాహ
మ్మున నేఁగి యజ్ఞవాట
మ్మును రాముఁడు లక్ష్మణుండు పొలసిరి ప్రీతిన్

కం. మునిశార్దూలునితోఁ దా
ననియె సలక్ష్మణుఁడు రాముఁ డానందమునన్
జనకుని మహాత్ముని వర స
వనపు సమృద్ధి విలసిల్లె బాగుగ నిచటన్ 2.

ఉ. వేల కొలంది బ్రాహ్మణులు భిన్న విభిన్న విదేశ వాసులే
మేలుగఁ జేరి రిచ్చటను మింతు రధీతిని నిత్య మెంచఁగం
జాల చెలంగు వాటికలు చక్కఁగ నిచ్చట నూఱు బండ్లలోఁ
దేలెను వస్తుసంచయము తెల్పుఁడి యెల్లర ముండఁ జోటునున్ 3.

కం. విని రాముని వచనమ్ములు
ముని విశ్వామిత్రుఁడు జలము విరివిగా నుం
డిన యేకాంతపుఁ జోటును
గని యెంచె వసింపఁగా సుఖమ్ముగ నంతన్ 4.

తే.గీ. కౌశికుని రాక విని జనక నృపతీంద్రుఁ
డతి రయమునఁ బురోహితుఁ డధ్యయన ర
తుని శతానందుఁ దోడ్కొని ముని వరేణ్యు
న కెదురేఁగె వినయము దనరఁగ భక్తి 5.

తే.గీ. ఋత్విజులు మహాత్ములు గొని యెలమి నర్ఘ్య
ములను సత్వరము సమంత్రము లొసఁగంగ
ధర్మయుతముగ నధ్వర కర్మరతుఁడు
తగ గ్రహించె విశ్వామిత్ర తాపసుండు 6.

కం. నృపతి మహాత్ముని జనకుని
సుపూజల గ్రహించి యా వసుమతీశునిఁ దా
నపుడు కుశలమ్ము నిఁక జ
న్నపు శుభ చరితమ్ము నంత నయముగ నడిగెన్ 7.

ఆ.వె. మునుల నొజ్జల నిఁక మూరి పురోహితు
లను యథా నయమ్ముగ నడుగఁ గుశ
లమ్ము మునివరుండు రహిఁ జేరి రెల్ల ర
చటకు సంయమీంద్రు సరస కడరి 8.

తే.గీ. అంత రాజు కృతాంజలుఁ డై మునీంద్రుఁ
గాంచి పలికె నిట్లు మునిపుంగవులఁ గూడి
దేవ యాసీనుఁ డవు కమ్ము దివ్యమైన
యీ వరాసనమ్మున నంచు నెడఁద వొంగ 9.

కం. ఆసీనుఁ డయ్యెఁ గౌశికుఁ
డాసనమున గురువు లింక నధ్వర్యులతో
నా సామాత్యుఁడు నృపతియు
నాసీనుం డయ్యెఁ బ్రీతి నా సమయమునన్ 10.

తే.గీ. అంద అప్పుడు గూర్చుండ నరసి రాజు
సముచితమ్ముగ నంతట సంయమీంద్రుఁ
గౌశికునిఁ గాంచి పల్కె వాక్యమ్ములు వచ
నజ్ఞుఁ డివ్విధి నెడఁద నానంద మడర 11.

తే.గీ. నేఁడు చేసిరి సురలెల్లఁ గూడి నాదు
యజ్ఞ సుసమృద్ధి సఫలమ్ము విజ్ఞ! నిజము
నేఁడు మీ రాక సేకూర్చె నెమ్మి నాకు
యజ్ఞ ఫలము సత్వరముగ నార్య నిజము 12.

తే.గీ. ధన్యుఁడ నయితి మిమ్మిటఁ దాపసేంద్ర!
కాంచి నాదు సవన వాటికను భృశము న
నుగ్రహమ్ముఁ బడసితి నేను ముని సంచ
యమ్ము తోడ మీ రడుగిడ సమ్మదమున 13.

ఆ.వె. సంయమీంద్ర దేవ! జన్నపుఁ బండ్రెం డ
హముల శేష మున్న దంచు నంద్రు 14.

విదులు సంతసమునఁ బిదప భాగార్థము
రాఁగఁ జూడ నగు సుర వరుల నిట

కం. అని ముని శార్దూలునితో
జనకుఁడు హర్షమునఁ దిర్గి సంయమి వరుతో
ననియెం బ్రాంజలి నివ్విధి
వినతు లొనర్చి నృపవరుఁడు వినయము దోఁపన్ 15.

మ. ముని చంద్రా యగు నీకు భద్రము ఘనుల్ పుత్రుల్ సురాభుల్ సుమీ
ఘన శౌర్యమ్మున హస్తి సింహ గమనుల్ గాంచంగ శార్దూల ధు
ర్య నిభుల్ వీరులు పద్మపత్ర నయనుల్ రమ్యాశ్వినీ పుత్ర తు
ల్య ని జాకారులు ఖడ్గ తూణ గుణి విఖ్యా తావతంసద్యుతుల్ 16.

ఉ. యౌవను లిర్వు రిచ్చటకు నా దివి నుండి యథేచ్ఛ వచ్చిరా
పావన నిర్జ రేంద్రులు నపార కుతూహల చిత్తులై యనన్
భావన మాత్మ నేర్పడఁగఁ బాద చరత్వ విలాస లోలులై
యీ వన వీథి నేల యరుదెంచిరి యెవ్వరు వీరు చెప్పరే 17.

ఉ. పోలు చొకండు నొక్కనిని మూర్తినిఁ జేష్టల నింగితమ్ములన్
మే లగు నాయుధమ్ములను మీఱి వహించుచు ధైర్యవంతు లీ
నేల నలంకరించిరి వినీల నభో గత సూర్యచంద్రులం
బోలుచుఁ గాక పక్ష ధర మూర్తులు వీరుల నెంతు నేరఁగన్ 18.

కం. విని జనకు నుడులను దశర
థ నందను లని యెఱిగించెఁ దద్దయు ప్రీతిన్
వినిపించె మహాత్ముని కా
ముని సిద్ధాశ్రమ నివాసము నసుర వధయున్ 19.

తే.గీ. దర్శనము విశాలుని మఱి దర్శనమ్ము
సతి యహల్యది గౌతమ సంయమీంద్ర
దర్శనము చూడ నిచ్చ సద్ధనువుఁ దెలిపి
యూరకుండె విశ్వామిత్రుఁ డుచిత రీతి 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబదవ సర్గము.

# బాలకాండము

# సర్గము 51.

గౌతమ నందనుఁడు శతానందుఁడు రామునకు విశ్వామిత్ర బ్రహ్మర్షి చరిత్రమును వివరించుట.

మ. వశి రోమాంచితుఁ డయ్యెఁ దా వినఁగ విశ్వామిత్ర వాక్యమ్ము లె
ల్ల శతానందుఁడు సత్తపో బల మహాప్రాశస్త్య విభ్రాజితుం
డ శమాక్రోధన గౌతమాత్మజుఁడు సూర్యామ్నాయ కాకుత్స్థుఁ గాం
చి శశాంకానను విస్మయమ్ము వడసెం జిత్రమ్ముగా నచ్చటన్ 1.

కం. కని రామలక్ష్మణు లిరువు
రను గూర్చుండ సుఖముగ నరశ్రేష్ఠు లటన్
ముని విశ్వామిత్రుం గని
యనియె శతానందుఁ డిట్టు లాశ్చర్యముగన్ 2.

కం. చూపితివే ముని పుంగవ
క్ష్మాప తనూజునకు నాదు జననిని సుమహా
తాపసిని యశస్విని నిజ
తాపము తీరఁగఁ గృశతర తన్విన్ ధన్యన్ 3.

కం. కొలిచినదే రాఘవుని న
ఖిల జన పూజార్హుని వరకీర్తన నిచయ
మ్ముల నా జననీమణి సద
మల చిత్తత సంయమీంద్ర! మఱి వన్యములన్ 4.

కం. తెలిపితివే మునివర ము
న్నల జరిగిన దెల్ల నట మదంబకు నకటా 5.

బలరిపుఁ డొనరించిన య
క్కలుషపుఁ గృత్యమ్ము గూర్చి కౌశిక! కరుణన్

కం. కలసినదే భద్రమ్మగు
నిల నీకు నిజ జనని గురు నినవంశజు ని
ర్మల దర్శనమ్ము వడసి వి
మలాత్మ యింపుగ మునిజన మాన్యవరేణ్యా! 6.

కం. పడసెనె రాముఁడు కౌశిక!
యడరుచు నా తండ్రి పూజ లానందమునం
బడసెనె జనకుఁడు రాముం
డడరి యొనర్చంగఁ బూజ లపుడు ముదమునన్ 7.

కం. ఒనరిచెనే శాంత మదిని
ముని పుంగవ! రఘువరుండు మురియుచుఁ దగ నా
జనకుండు రాఁగ నచటకు
వినయాన్విత వందనములు విశ్వామిత్రా! 8.

కం. అన విని విశ్వామిత్రుఁ డ
నెను వాక్యజ్ఞుఁడు కడింది నెమ్మి శతానం
దుని వాక్య కోవిదు నరసి
మినుకులు ప్రత్యుత్తరముగ మేటి గురుండే 9.

ఆ.వె. ఏది యేని విడువ లేదు మునిశ్రేష్ఠ
చేయఁ దగిన దెల్లఁ జేసితి నట
మునినిఁ గూడె పత్ని ముదమార భార్గవ
రేణుకలు కలసిన రీతి చెలఁగి 10.

కం. ముని విశ్వామిత్రు మినుకు
ల నా శతానందుఁడు విని రాముని వీక్షిం
చి నయముగ మహా తేజుం
డనె నీ విధి భాషణముల నాదర మలరన్ 11.

ఆ.వె. స్వాగతమ్ము పురుష శార్దూల! రాఘవ!
నీకు వచ్చి తీవు నెమ్మి నజితు
మునివరేణ్యునిం దపోధను ముందుంచి
యిట కదృష్ట మనఁగ నెంతు నెడఁద 12.

తే.గీ. నీ వెఱిఁగితె విశ్వామిత్రుని నతులప్ర
భా విలసితు బ్రహ్మర్షినిఁ బరమ గతియె
యెల్లర కనూహ్య కర్ముని నిద్ధ తపపు
బలము చేతను తేజస్విఁ బార్థ తనయ! 13.

ఆ.వె. అన్యుఁ డొకఁడు లేఁడు ధన్యతరుఁడు నిన్ను
మించి గొప్ప తపము మించి చేసి
న మునిపుంగవు వలన ఘన రక్షితుఁడవు
కౌశికు వలన భువిఁ గాంచ రామ! 14.

కం. కుశికాత్మజుని తపశ్శ
క్తి శుభ చరిత్రంబు నెల్లఁ గీర్తింతుఁ దగన్
దశరథ నందన! వినుమా
విశదమ్ముగ నే నుడువఁగఁ బ్రీతిన్ రామా! 15.

కం. చిరకాలము నేలె నితఁడు
ధరాతల మరిందమనుఁడు ధర్మజ్ఞుఁడు ధ
ర్మ రతుఁడు బ్రజా హితమ్ము నొ
నరించుచుఁ జదువరియై యినకుల వరేణ్యా! 16.

కం. కలడు ప్రజాపతి తనయుం
డిలఁ గుశ నామ ధరణీ పతీంద్రుఁ డతనికిన్
బలవంతుఁడు ధార్మికుఁడుం
గుల వర్ధన నందనుండు కుశనాభుండే 17.

తే.గీ. గాధి యన విశ్రుతుం డైన ఘనుఁడు నంద
నుండు కుశనాభునకు గుణమండితుండు
నతని సుతుఁడు విశ్వామిత్రుఁ డతి తపో ధ 18.

నుండు నృవరుండు నలఘు తేజుండు రామ!

కం. విశ్వామిత్రుం డేలెను
విశ్వంభర ధర్మ యుతము విఖ్యాతిఁ బ్రజా
విశ్వాసము సూఱ కొనుచు
శాశ్వత చిరకాల రాజ్య సౌఖ్యము లలరన్ 19.

తే.గీ. సైన్యము సమకట్టి తగ రాజన్యుఁ డొక్క
దివసమున మహా తేజుఁడు తేజ మలర
నొక్క యక్షౌహిణీ సేన యుండఁ బరివృ
త మయి విహరించె ధరణి నుత్సాహముననును 20.

ఆ.వె. తిరిగి తిరిగి వరుసఁ బురములు రాష్ట్రము
లేఱులు గిరులు పృథివీశుఁ డాశ్ర
మములు తుదకుఁ జేరె మహితంపు టాశ్రమ
మొక్కటి నట నుండ నక్కజముగ 21.

మ. నరనాథుండు వసిష్ఠు నాశ్రమము నానా వృక్ష నానా మృగ
స్థిర సంవాస సుశోభితమ్ము విలసద్దే వాసురవ్రాత కి
న్నర గంధర్వ ససిద్ధ చారణ వితానప్రార్థ నానీక సు
స్వర సువ్యాప్తముఁ బక్షి సంఘ హరిణచ్ఛాయా ప్రదీప్తమ్మునున్ 22.

మ. వర దేవర్షి గణార్చితమ్ము సుమహా బ్రహ్మర్షి దివ్యాంగ భా
సుర దేశమ్ముఁ దపో రతద్విజ గణాక్షోభ్యమ్ము నీరాశ నా
పర వాయ్వన్న కృశచ్ఛ దాశన మహా వన్యాశ నామ్నాయమున్
వర వైఖానస వాలఖిల్య గణ సంవాసమ్ముఁ గాంచెం దమిన్ 23.

తే.గీ. దాంతు లగ్నికల్పులు మహత్తర మనో వి
రాజితులు గత రోషులు నా జితేంద్రి
యులు నిరంతరం బుండంగ నెలమి నచట
నట్టి పుణ్యాశ్రమము గాంచె నలర మనము 24.

తే.గీ. కనియె నపరంపు బ్రహ్మ లోకమ్మనంగ 25.

వెల్గెడు వసిష్ఠుని మఠము వీరవరుఁడు
బల్లిదుండు విశ్వామిత్ర పార్థివుండు
దుర్జయశ్రేష్ఠుఁడు మది సంతోష మడర

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది యొకటవ సర్గము.

## బాలకాండము

## సర్గము 52.

విశ్వామిత్రునకు స్వాగతము పలికి బ్రహ్మర్షి వసిష్ఠుఁడు రాజునకు ససైన్య మాతిథ్య మిచ్చుటకు
నిర్ణయించి శబలినిఁ గామధేనువును సంభారములను సమకూర్చుటకు నాదేశించుట.

కం. కని తాప సోత్తము వసి
ష్ఠుని విశ్వామిత్రుఁడు బలి సుక్షత్రియుఁ డా
ననము వికసింపఁ బ్రీతిని
వినయాన్వితుఁ డయి నతు లిడె వీరుం డంతన్ 1.

ఆ.వె. స్వాగతమ్ము పలికి సంయమీంద్రుఁడు వసి
ష్ఠుండు రాజ సత్తముండు కౌశి
కునకు నాసనమ్ము కూర్మి నాదేశించె
భగవ దాభుఁ డడరి బ్రాహ్మణుండు 2.

ఆ.వె. వెలయ నాసనమున నలరి విశ్వామిత్రుఁ
డు తగినట్టి రీతి వితత సఫల
మూలముల నొసంగె మునివర శ్రేష్ఠుండు
గౌరవమ్ము తోడ నారగింప 3.

ఆ.వె. తా గ్రహించి పూజఁ దాపసోత్తముఁ డీయ
రాజ సత్తముండు నోజ నడుగ 4.

నగ్నిహోత్ర శిష్య యజ తపస్తరు కుశ
లముల సర్వము కుశల మనియె ముని

కం. కని విశ్వామిత్రు సుఖము
గ నాసనమున వరజపి నికాయ శ్రేష్ఠుం
డు నలువ పట్టి వసిష్ఠుఁడు
ఘన తాపసి యంత నడిగెఁ గౌశికు నిట్లున్ 5.

తే.గీ. క్షేమమె నరేంద్ర! పాలింతువే మహి నల
రంగఁ బ్రజలు సధర్మము రాజ నీతి
దలఁచి ధార్మిక! నిత్యము దయ నరయుదె
భృత్యు లెల్లరను వశులె పేర్మి నీకు 6.

ఆ.వె. రిపు నిషూదన! తవ రిపు వర్గము జయించి
తె బల కోశ సఖులు సెల్ల రింక
నీవుఁ బుత్ర పౌత్ర నిచయమ్ము క్షేమంబె
యంచుఁ బార్థివేంద్రు నడుగఁ బ్రీతి 7.

తే.గీ. అంతటఁ గుశలము మునీంద్ర యని వచించె
వినయముననను విశ్వామిత్రుఁడు నగ వలర
నొండొరులు చిరకాలము యుక్త రీతిఁ
జలిపి భాషణములు ప్రీతి నలరి రంత 8.

కం. నగుచుం దుదను వసిష్ఠుఁడు
భగవంతుఁడు రఘువరేణ్య! పన్నుగ మధురం
బగు వచనమ్ములు భద్ర
మ్ముగ విశ్వామిత్రు తోడ ముదముగఁ బలికెన్ 9.

కం. ఎంచితి నాతిథ్యము సే
నంచితముగ వీర్యవర్య! యర్హ విధముగన్
మించ రుచుల నీకును బల
సంచయమున కీయ నీదు సమ్మతి నిమ్మా 10.

కం. పర మాతిథి వీ విచటఁ ది
విరి చేయం దగును బూజ విశ్వామిత్రా!
సురుచిరము సేయ కార్య మ
లరి నేను గ్రహించు టొప్పు రాజవరేణ్యా! 11.

కం. పలుక వసిష్ఠుం డివ్విధి
విలసిల్ల ముఖ కమలమ్ము విశ్వామిత్రుం
డలరుచుఁ బ్రియమార నపుడు
పలికె నొనర్చితివి దేవ! పన్నుగ నంచున్ 12.

చం. ఫలములు మూల సంచయము పాద్యము నాచమ నీయ మిచ్చి మా
కలరుచు నాశ్రమ స్థితము లంచితపున్ నిజ  దర్శనాది పూ
జ లిడితి రర్హ రీతి నిట సంయమి పుంగవ! మీకు వందన
మ్ములు నను స్నేహభావమున ముద్దుగఁ గాంచుఁడి పోయి వచ్చెదన్ 13.

ఆ.వె. ఇట్టు లనిన నరవరేంద్రుని వచనము
లాలకించి ముని మహాత్ముఁ డాగ
క మఱి మఱి యడిగెను గౌశికు నాతిథ్య
మలరి సమ్మతింపు మంచు రామ! 14.

కం. మంచిది యనె గాధేయుం
డెంచి వసిష్ఠు వచనముల నెల్ల ననియె మీ
రెంచిన యట్టి విధమ్ముగ
నంచితముగ నగు మునీంద్ర! యంచు ముదమునన్ 15.

తే.గీ. ముదము నంది మహాత్ముఁడు మునుల నుత్త
మ తముఁడు వసిష్ఠుఁ డలఘుఁ డమలమతి యెల
మిఁ బిలిచె నపుడు కల్మాషినిఁ బరమంపు
గోవు నా కామధేనువు దేవ సముఁడు 16.

తే.గీ. రమ్ము రమ్ము శబల వచనమ్ము లాల
కింపు సబలము రాజున కేను ప్రీతి
నీయ సత్కార మెంచితి నింపు గొలుపు 17.

భోజ నాదుల సమకూర్పు పుణ్యచరిత!

తే.గీ. ఎవ్వ రెవ్వరి కేమేమి యిష్ట మగునొ
వాని నెల్లఁ దత్క్షణమ యవారితముగ
షడ్రసోపేతములను నొసంగ వలయు
నా కొఱకు సమస్తముల ననాయసమ్ము 18.

తే.గీ. సరస విమల పానీయ చోష్య వరలేహ్య
భక్ష్య భోజ్య సంచయము లపారముగను
సకల వస్తు నికాయము సమ్మతముగ
శబల! రయమునఁ బుట్టించు ప్రబల మహిమ 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది రెండవ సర్గము.

## బాలకాండము

## సర్గము 53.

ససైన్యము విశ్వామిత్రునకు కామధేనువు విందు సమకూర్చుట, గో మహిమకు మెచ్చి వసిష్ఠునిఁ గామధేనువు నిమ్మని విశ్వామిత్రుఁడు వేఁడ బ్రహ్మర్షి నిరాకరించుట.

కం. అన నరిసూదన! యివ్విధి
మునీశుఁడు వసిష్ఠుఁడు విని మూరి శబల కో
రిన నెల్లం గూర్చెను గో
రిన వారికి వా రడిగిన రీతి రయమునన్ 1.

ఆ.వె. చెఱకు ముక్క లింకఁ జేరుల్లు తేనియ
లు మఱి పానకమ్ము లమర భక్ష్య
ములు మహత్తరములు మూర మైరేయము 2.

లలరెఁ బాత్ర లందు నంచితముగ

మ. ధవళో ష్ణావిర ళాన్న రాసులు మహాధాత్రీ ధరాభమ్ములున్
నవ మృష్టాన్నము లిద్ధ సూపములు సన్నద్దేద్ధ దధ్యంబుధుల్
వివి ధానేక రసోత్తమమ్ములును హృద్వేద్యమ్ములౌ షడ్రుచుల్
ఛవిమద్గౌడ విశేష భక్ష్య తతి సంసర్గంపుఁ బాత్రాళియున్ 3.

తే.గీ. సర్వము విలసిల్ల నపుడు సంయమి వరుఁ
డా వసిష్ఠుఁ డీయఁగఁ దృప్తి నంది రెల్ల
జనులు గాధేయుని మహిత సైన్య మందు
సంతసించిరి రాఘవ! స్వాంతములను 4.

తే.గీ. అంతిపురపుఁ బూఁబోడుల నవని సురుల
నిజ పురోహితులను గూడి నెమ్మి నొంది
రాజమౌని విశ్వామిత్రుఁ డా జనపతి
వొందెఁ బుష్టి తనివి విందు నంది యట్లు 5.

తే.గీ. సచివ సామాత్య నిజభృత్య సహిత మవని
విభుఁడు పూజింపఁబడి యట్లు విరియ హర్ష
మంతరంగ మందు వసిష్ఠు నరసి బ్రహ్మ
ఋషినిఁ బలికె విశ్వామిత్రుఁ డిట్లు రామ 6.

ఆ.వె. గౌరవింపఁ బడితి గౌరవార్హముగను
దేవ! చేయ మీరు దివ్యముగను
వాక్య కోవిదులరు వాక్య మొక్కటి విన్న
వింతు నేను దాని వినుఁడు ప్రీతి 7.

తే.గీ. శబల నిండు గో శత సహస్రముల నిత్తు
దేవ! దీనికి మారుగ ధీ వరేణ్య!
రత్న మిది రత్న హరుఁ డగు రాజు భువిని
శబల నీయ ధర్మ మగును సత్య మెంచ 8.

చం. అన ధరణీధవుండు కుశికాత్మజుఁ డట్లు వసిష్ఠుఁ డంతఁ బ 9.

ల్కెను వచనమ్ము లిట్టులు విరించి నికాశుఁడు ధర్మయుక్తముల్
దనరి యొసంగ గోవుల శతమ్ములు నింక సహస్ర కోటులున్
ఘన కలధౌత రాసులును గామదుహమ్ము నొసంగ భూవరా!

ఆ.వె. సజ్జనునకుఁ గీర్తి సదృశముగ శబల
శాశ్వతమ్ము నాకు సమ్మదముగ
నిమ్మహి రిపుదమన! యెమ్మెయి నా చెంత
వీడ రానిది పృథివీధవుండ! 10.

తే.గీ. ఇదియ యాధారము నరవరేంద్ర నాదు
హవ్య కవ్యములకుఁ బ్రాణ యాత్ర కింక
నగ్నిహోత్ర హోమములకు నర్పణముల
కును శబలఁ గామధేనువుఁ గోరఁ దగదు 11.

కం. చను నిది స్వాహాకార
మ్మునకు వషట్కారమునకు భూపా! విద్యా
ది నిచయముల కాధారము
గను సకలమునకు నరేంద్ర కన నిశ్శంకన్ 12.

తే.గీ. నిక్క మెంచ సర్వస్వము చక్కఁగ నిది
నాకు రాజన్య! తుష్టిని నాకు నొసఁగు
నిత్యము కలవు హేతువు లత్యధికము
లీయఁ జాల నీ శబలను వేయు నేల 13.

కం. అన బ్రహ్మర్షి వసిష్ఠుఁడు
విని విశ్వామిత్రుఁడు ముఖ విజ్ఞుం డనియెన్
మినుకుల నతి సంరంభ
మ్మున రాజ వరేణ్యుఁ డంతఁ బ్రోత్సాహముగన్ 14.

తే.గీ. పసిడి మొలనూలు మెడనూలు వంకియ లల
రంగఁ దిరుగాడు నేనుఁగులను మునీంద్ర!
యిత్తుఁ బదునాల్గు వేలను మొత్తములను
సత్వరమ్ముగ నీఁక నైన శబల నిమ్ము 15.

తే.గీ. పుత్తడి యరదమ్ములు కట్ట నుత్తమములు
తెల్లనివి గుఱ్ఱములు నాల్గు కళ్లెములును
బరఁగఁ జిరుగంట లెనిమిది వంద లిత్తు
సత్వరమ్ముగ నీఁక నైన శబల నిమ్ము 16.

తే.గీ. మంచి తెగఁ బలు నేలల నంచితముగఁ
బుట్టి నట్టి దిటవు గుఱ్ఱములను బదు నొ
కండు వేల నిత్తు మునీంద్ర! మండితముగ
సత్వరమ్ముగ నీఁక నైన శబల నిమ్ము 17.

తే.గీ. రంగు రంగుల గోవులు రంజిలంగ
యౌవనమ్మున మిక్కిలి యంద మొలుక
నొక్క కోటి నొసంగుదు నక్కజముగ
సత్వరమ్ముగ నీఁక నైన శబల నిమ్ము 18.

తే.గీ. వేఁడి నన్ని రత్నమ్ములు వేఁడి నంత
పైఁడి నైన నిప్పట్టున వార కిత్తు
మునివరేణ్య! సర్వంబును బుణ్యపురుష!
సత్వరమ్ముగ నీఁక నైన శబల నిమ్ము 19.

కం. విని విశ్వామిత్రు గిరలు
మను జాధీశా! తగ వినుమా నే నెబ్బం
గిని నైనను నీ కీఁ జా
ల నని వసిష్ఠుండు వలికె రఘుకుల వర్యా! 20.

ఆ.వె. ఇదియె నాదు రత్న మిదియె నాదు ధనము
సర్వ మిదియె నాకు శంక యేల
నాదు జీవితమ్ము నరనాథ! యెంచంగ
నిదియె చుమ్ము బ్రతుకఁ బదిలముగను 21.

తే.గీ. సవనములు దర్శ పూర్ణమాసమ్ము లింక
నపర దక్షిణ సహితంపు యాగములను 22.

నా కగు నిదియె రాజన్య! వీఁకఁ జేయఁ
టెక్కు కర్మము లందును దిక్కు సుమ్ము

కం. మూల మిదియ సందేహం
బేల సకల కార్యములకు నెంచఁగ నా కీఁ
జాల నిలఁ గామధేనువు
నేల వదరఁ టెక్కు మాట లివ్విధి నధిపా 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది మూడవ సర్గము.

# బాలకాండము

## సర్గము 54.

విశ్వామిత్రుఁడు కామధేనువును బలమునఁ గొనిపోవుచుండ వసిష్ఠు ననుమతి శబల సైన్యమును సృష్టించి కౌశికుని సైన్యమును బరిమార్చుట.

కం. మునివరుఁడు వసిష్ఠుఁడు శబ
లను దన కీకున్నఁ గనలి రాజవరుం డే
మని యందుఁ గామధేనువుఁ
గని బల్మినిఁ గొని తరలెను గాకుత్స్థ! వడిన్ 1.

కం. అపహృతము కా మహాత్ముని
నృపు విశ్వామిత్రు చేత నిర్వేదమునం
దపియించి శబల రాఘవ!
విపరీతమ్ముగఁ దలఁచెను వేదన నిట్లున్ 2.

ఆ.వె. దీన నైతి దుఃఖ మూనితి నక్కట 3.

యేల విడిచె నన్ను నీ ముని వరుఁ
డదయ నీ మహాత్ముఁ డజ సన్నిభుఁడు వసి
ష్ఠుండు రాజభటులు చూఱకొనఁగ

ఆ.వె. భావితాత్ముఁ డేల నీ వసిష్ఠుఁడు నన్ను
విడిచె నెట్టి తప్పు కడఁగితి నని
యిష్ట నేను భక్త నిట్టి యమాయకఁ
దాపసుండు పరమ ధార్మికుండు 4.

చం. మదినిఁ దలంచి యివ్విధము మాత కడుంగడు నిశ్వసించి యా
పదిలపు రాజసైన్యమును బక్కకుఁ ద్రోసి బలమ్ముఁ మీఱఁగాఁ
బొదివెను బర్వు లెత్తుచు విమోచనయై వడి మౌనిపుంగవుం
బదయుగ మూల మందుఁ దమి భద్రముగాఁ బడె శత్రుసూదనా! 5.

తే.గీ. శబల మూల్గుచు నేడ్చుచు సంయమి వరు
చెంత నిలిచి పలికె నిట్లు వంత తోడ
మేఘ దుందుభి రవముల మించు కంఠ
నిస్వన మడరంగ నపుడు నీరజాక్ష! 6.

కం. నే నేల విడువఁ బడితి నృ
పానీకమ్ముఁ గొని పోవ నన్యాయముగా
నో నలినజ పుత్రా! దే
వా! నీ సముఖమ్ముఁ నుండి యకటా చెపుఁడీ 7.

కం. అని పలికిన విని శోకా
ర్తను నిజ సోదరి యనంగఁ దపియించెడు దా
నినిఁ గని బ్రహ్మర్షి వచిం
చె నిట్టు లాదర మడర నుచిత వచనమ్ముల్ 8.

మ. శబలా నే నిను వీడ లేదు కన దోషం బింత నీయందుఁ జూ
సబలుం డా సుమహద్బలుండు గొనెనే సమ్రాట్టు గర్వాంధుఁడై
యబలుండం బ్రియ నేను దుల్యుఁడను గా నా భూపకున్ క్షత్రియుం
డ బలుం డీధర తిర్గి తా నచలకీ లాధీశుఁడై నిల్చెనే 9.

ఆ.వె. అరయు మీవు పూర్ణ మక్షౌహిణీ సేన
హస్తి వాజి రథ సమావృతమ్ము
ధ్వజ విరాజితమ్ము దాన నతఁడు బల
వత్తరుండు శబల! పార్థివుండు 10.

చం. పలుక వసిష్ఠుఁ డీ విధము వాక్యము లత్తఱి యాలకించి యా
వల బదు లిచ్చె వాక్యవిద బ్రహ్మ ఋషీంద్రునిఁ గాంతిమంతుఁ గాం
చి లలిత భాషణమ్ములు వచించుచు రాజ బలమ్ము దేవ కా
దిల బలవత్తరం బధిక మీ ద్విజ వర్య బలమ్ము దివ్యమై 11.

తే.గీ. అప్రమేయము నీ బల మా నరేంద్రు
బలము కన్న మిన్న మునీంద్ర! పరుల కిల దు
రాసదము నీదు తేజము భాసురమ్ము
దివ్య పురుష! విశ్వామిత్రు తేజ మెంత 12.

తే.గీ. నన్ను బంచు మహాభాగ మిన్న యైన
నీదు బ్రహ్మ బలయుతను నెమ్మి యా దు
రాత్ము దర్ప బలము నెల్ల నాత్మ బలము
చేత నాశన మ్మొనరింతుశీఘ్రముగను 13.

కం. రిపుబల నాశకమౌ బల
మపారముగ నుద్భవిల్లు నట్టుల నొనరిం
పు పదిలముగ నిప్పు డని ము
నిపతి వసిష్ఠుఁ డనియె విని నీరజనయనా! 14.

తే.గీ. ముని పలుకు లాలకించి యబ్బురముగ సృజి
యించె సురభి తత్క్షణము కోపించి పహ్ల
వుల నిజాంభారవమున వందల కొలంది
చూచుచుండ రాజు బలము నోలె చచ్చి 15.

చం. కని బల నాశనం బటులఁ గౌశికుఁ డాగ్రహ కంపితుండునై
ఘనతర మైన స్యందనము గ్రక్కున నెక్కి కనుల్ విశాల మై 16.

తనరఁగఁ జంపెఁ బప్లవుల దారుణ శస్త్రచయమ్ము లేసి య
జ్జన పతి యస్త్ర శస్త్ర సువిశారదుఁ డుద్ధతి నంత రాఘవా!

తే.గీ. నిర్జితులను విశ్వామిత్రుని వలన ననిఁ
గాంచి సృష్టించెఁ బప్లవ కాయ మంతఁ
దిరిగి శబల శక యవన ధీర వరుల
వందలును వేల సంఖ్యలఁ బంతముననను 17.

తే.గీ. శక యవన మిశ్రమమున విశాల భూమి
యెల్ల నిండె మహా వీరు లెంచ హేమ
కేసరాభులఁ దేజో విలాసవంత
వీర్య వంతు లకుంఠిత ధైర్య వరుల 18.

ఆ.వె. పీత వస్త్ర ధరులు భీమాసి పట్టిశ
ధరులు బలుల చేత దగ్ధ మయ్యె
రాజసైన్య మెల్ల నోజ మండె డనల
మందు దగ్ధమైన చంద మపుడు 19.

కం. కని విశ్వామిత్రుఁ డలిగి
ఘనాస్త్ర నిచయమ్ము విడిచెఁ గాలుని భంగిన్
ఘన పప్లవ కాంభోజ య
వన వరు లాకులితు లైరి పరమాస్త్రములన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది నాల్గవ సర్గము.

## బాలకాండము

## సర్గము 55.

కామధేనువు తిరిగి సృజించిన బలముతో విశ్వామిత్రుని సైన్యము హతము కాఁగ మఱియు

నూర్గురు సుతులు దగ్ధము కాఁగ విశ్వామిత్రుఁడు శివుని గూర్చి తపము సేసి దివ్యాస్త్రములను బడసి బ్రహ్మర్షి వసిష్ఠుని యాశ్రమము నెల్ల ధ్వంసము సేయ ముని కోపించుట.

కం. నృవరా! విశ్వామిత్రా
స్త్ర విమోహితులం గని యటఁ దాపస వర్యుం
డు వసిష్ఠుఁ డరసి యా ధే
నువు యోగ బలమున నింకను సృజింపు మనెన్ 1.

మ. అఱవం బుట్టిరి కామధేను వట దీప్తాంశాభ కాంభోజులుం
దఱచై పుట్టిరి యూధ మందు హను హస్తశ్రేణితోఁ బహ్లవుల్
మఱియుం బుట్టిరి గర్బమందు యవనుల్ మర్కమ్మునం దత్పకుల్
నెఱులన్ మ్లేచ్ఛ కిరాతక వ్రజముతో నిర్భీత హారీతులున్ 2.

తే.గీ. వారి చేతను రఘువర! భటులఁ గూడి
రథము లశ్వచయము గుంజర వ్రజమ్ము
నృపవరేణ్య విశ్వామిత్రునివి లయమ్ము
నందెఁ దత్‌క్షణంబ సమర మందు వింత 3.

ఉ. అమ్మను జేశ్వ రాత్మజులు నారసి నూర్వురు మ్రగ్గినట్టి సై
న్యమ్ము వసిష్ఠుచేత వివిధాయుధ ధారులు పర్వు లెత్తఁగా
నమ్ముని చెంత కత్తఱి మహోగ్రహ మూని తపోవరిష్ఠుఁడే
హుమ్మని హుంకరించి వడి నొక్కఁడ దగ్ధులఁ జేసె వారినిన్ 4.

కం. ఆ వనమం దశ్వ రథ స
హావృత విక్రమ పదాతు లంత క్షణమునన్
వావిరి భస్మీకృతు లై
రా విధము వసిష్ఠు చేత నాశ్చర్యముగన్ 5.

ఆ.వె. సమసిన నిజ సుతుల సైన్యమ్ము వీక్షించి
యమ్మహాయశుండు వమ్ము వోయి
యుమ్మలికము మీఱఁ గ్రమ్మఁగ సిగ్గు త
లంపఁ జాగె నెడఁద రాజవరుఁడు 6.

తే.గీ. వడి సడలి కనిపించెడు గడలి వోలె
పన్ను లూడిన యట్టి సర్పమ్ము వోలె
రాహువు కినిసి పట్టిన రవి యనంగఁ
గాంతి హీనుఁ డయ్యె నృపతి కౌశికుండు 7.

తే.గీ. మక్క నిజ సుతులు బలము వెక్కసముగ
ఱెక్క లూడఁగ విలపించు పక్కి వోలె
నుక్కు దర్ప ముత్సాహమ్ము నొక్క త్రుటిని
నూడ నిర్వేదమును రాజు కూడి యుండె 8.

కం. అంత నొక సుతుని రాజ్యం
బంతయుఁ బాలింపు మనుచు ననిపి వడి వనో
పాంతమున కేఁగె మదిఁ దాఁ
జింతించి క్షితిపతి నియతిఁ జేయఁగఁ తపమున్ 9.

కం. అతఁ డేఁగి హిమాద్రికి సం
తత కిన్నర నాగ సేవితమ్మునకు నుమా
పతి సుప్రసాదమునకై
రతిఁ జేసె మహాతపమును రాఘువ! నిష్ఠన్ 10.

కం. కనిపించెఁ గొంత కాల
మ్మునకును వృషభధ్వజుండు ముక్కంటి మహా
త్మునకు మహా వీర్యున కా
వని విశ్వామిత్రున కట వరదుం డంతన్ 11.

ఆ.వె. ఏల యీ తప మవనీశ కాక్షింతు వె
ద్దాని నడుగు మిత్తు దాని నీ య
భీక్షితమ్ము నంచుఁ బ్రీతిఁ బలికె నంత
చంద్రశేఖరుండు శైల ధన్వి 12.

ఆ.వె. దేవదేవుఁ డిట్లు తియ్యఁగఁ బలికినఁ
దాపసుండు నమ్రత నతు లొసఁగి
వినిన యంతఁ గరము ప్రీతి విశ్వామిత్రుఁ 13.

డిట్లు పలికె వాక్కు లీశ్వరుఁ గని

తే.గీ. తృప్తిలినఁ దపమున మహాదేవ! యంగ
ములు నుపాంగములను మర్మముల సహితము
నుపనిషత్తు ధనుర్వేద ముచిత రీతి
నిమ్ము నాకు ననఘ! పార్వతీశ! సదయ 14.

ఆ.వె. సురల మునుల రక్కసు లసుర గంధర్వ
యక్ష గణము లందు నలరు నస్త్ర
కోటు లెల్ల ననఘ! కూర్మి నా యందు భా
సిల్లఁ జేయు మయ్య యుల్ల మలర 15.

కం. నీ దయ నా యీ కోరిక
పే దేవా తీరనిమ్ము వేఁడఁగ నిట్లుం
డాఁ దగఁ దథాస్తని చనె మ
హా దేవుఁడు గరళకంఠుఁ డక్షరుఁ డంతన్ 16.

తే.గీ. అంతఁ బొంది విశ్వామిత్రుఁ డస్త్ర రాజి
దర్ప మూని భృశమ్ము చిత్తమున నయ్యె
రాజ ఋషియె గర్వాంధుఁడు రామచంద్ర!
బల్లిదుఁడు గాధిపట్టి యప్పట్టు నందు 17.

కం. పెరిఁగి బలమ్మునఁ బున్నమిఁ
బెరుఁగు సముద్రంపు భంగి విశ్వామిత్రుం
డరసె వసిష్ఠుని సంయమి
వరు హతుని విధమ్మెడందఁ బార్థివ తనయా! 18.

ఆ.వె. ఆశ్రమమున కేఁగి యడరి విశ్వామిత్రుఁ
డస్త్రములు విడిచిన యంత ముని త
పోవనమ్ము సర్వము త్రుటి దగ్ధం బయ్యెఁ
జూచుచుండ మునులు చోద్యముగను 19.

ఆ.వె. భీతి పర్వు లిడిరి యా తపోధను లెల్లఁ 20.

గాంచి మండ వనము గాధి సుతుని
యనల సన్ని భాస్త్ర ఘన సంచయమ్మున
సకల దిక్కులకు నశాంతి చెలఁగ

ఆ.వె. కౌశి కాస్త్ర భీత కాననాంతర మృగ
పక్షి నిచయ సహిత పరమ శిష్య
గణము దశదిశలకుఁ గరము సంభ్రమమునఁ
బర్వు లెత్తెఁ గలఁగి రుర్వి జనులు 21.

కం. ఒక్క త్రుటి శూన్య మయ్యెను
జక్కటి యాశ్రమము వింత శబ్దరహితమై
చిక్కెఁ జవుటి నేల పగిది
నక్కౌశికు నస్త్ర మహిమ ననివార్యముగన్ 22.

తే.గీ. వలదు భయము భయమ్మది వల దనుచుఁ ది
రిగి తిరిగి వసిష్ఠుఁడు పల్కి ఋషివరుండు
గాధిపట్టిని నిపుడు భాస్కరుఁడు మంచుఁ
ద్రుంచు నట్లు వధింతును గాంచుఁ డనియె 23.

కం. పలికి మఱి మహాతేజుం
డలుక వసిష్ఠుఁడు మునివరు లందు ఘనుఁడు దాఁ
బలికెను విశ్వామిత్రుని
నల గాంచి వచనములు వసు థాధీశునితో 24.

తే.గీ. చిర సమృద్ధాశ్రమమ్మును జేసి తీవు
నాశనము దుశ్చరితుఁడవు నాశ మొందు
దాన మూఢాత్మ కౌశిక తథ్యముగను
సంభ్రమమ్ముగ బ్రహ్మర్షి చాటి యిట్లు 25.

కం. అతి కృద్ధుఁడై వసిష్ఠుఁడు
గత ధూమ ప్రజ్వలితము కాలాగ్ని యనన్
నుత పర యమ దండ మన ల
సిత నిజ దండమ్ము నెత్తెఁ జేతం బరమున్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది యైదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 56.

విశ్వామిత్రుఁడు రోషమూని ప్రయోగించిన నానాస్త్రములు బ్రహ్మర్షి వసిష్ఠుని బ్రహ్మదండముచే శాంతింపఁగా క్షాత్రవ బలము బ్రహ్మ బలమునకు సరితూఁగ దని యెఱింగి బ్రహ్మత్వము నొంద నిశ్చయించుట.

కం. పలుక వసిష్ఠ మహా ముని
బలి విశ్వామిత్రుఁ డలిగి పర మాగ్నేయా
స్త్ర లపనములు చదివి పలికె
నిలు నిలు మని హుంకరించి నీరజనయనా! 1.

ఆ.వె. బ్రహ్మదండ మెత్తి వర కాలదండ మై
పరఁగు దాని కినిసి బ్రహ్మఋషి వ
సిష్ఠుఁ డపుడు తగఁ బటిష్ఠంపుఁ బల్కులు
పలికె నివ్విధమ్ము పరుషములను 2.

తే.గీ. క్షత్రి యాధమ! నిల్చెదఁ జక్కఁగ నిట
నెట్టి బల మున్నయది నీకు నట్టి బలము
చూపు మిఁక నేడు నీ శస్త్ర శుష్మ మింక
దర్ప మడతు గాధికుమార తథ్యముగను 3.

తే.గీ. క్షత్రియ కులపాంసన! చూడు క్షాత్ర వీర్య
మెక్కడ మఱి బ్రహ్మ బలంబు నెక్కడ యర
యవలయు నిపుడు నాదు దివ్యంపు బ్రహ్మ
బలము కౌశిక! చూపుమ పార్థ బలము 4.

కం. నరవరు నాగ్నే యాస్త్రము
వరముని దండమున శాంతిఁ బడసె ననల భీ
మ రయము తోయమ్మున నన
వరతం బాఱెడు విధంబ బలహీనంబై 5.

ఉ. వారుణ మైంద్ర రౌద్రములు బాశుపతమ్ము నుషీక శస్త్రమున్
దారుణ మైన మానవము దారణ మున్నత మోహనమ్మునున్
దారుణ జృంభణమ్మును సుతాపన దివ్య విలాపనమ్ములన్
ధీరత స్వాపనమ్ము మఱి ధీర జనార్దన మాదనాదులన్ 6.

తే.గీ. శోషణమ్ము గాంధర్వము శూర దుర్జ
యమ్ము వజ్రాస్త్ర మింక బ్రహ్మ వర పాశ
మింకఁ గాలపాశము వారు ణేద్ధ పాశ
ము దయితమ్ము నార్ద్రము శుష్కము లుభయములు 7.

తే.గీ. అశని పైనాక పైశాచ భృశత రాస్త్ర
ములు ఘన క్రౌంచ దండాస్త్రములు సురుచిర
ధర్మ విష్ణు కాలాఖ్య నుత వర చక్ర
ములను వాయువ్య మథ నాస్త్రములను మఱియు 8.

తే.గీ. హయ శిరోఽస్త్రము శక్తిద్వయమ్ము ముసల
మింక వైద్యాధర మహాస్త్ర మింక భయద
ములగు కంకాళ కాలాస్త్రములను వేసెఁ
గనలుచుఁ ద్రిశూల కాపాల కంకణముల 9.

కం. వేసిన యస్త్రము లెల్లను
దా సమయించె నిజ దండదర్శనముననే
యా సంయమి బ్రహ్మాస్త్రము
వే సంధించి విడిచె నీఁకఁ బృథివీశుఁ డహో 10.

మ. కని బ్రహ్మాస్త్రము సాగ్నిదేవ వరులున్ గంధర్వ నాగాళియున్
ఘన దేవర్షి గణమ్ము మిక్కుటముగాఁ గంపించె ముల్లోకముల్ 11.

వనటం బొందె దిశాప్త తాపమున నాబ్రహ్మాస్త్ర సందీప్త వ
హ్నిని గాఢమ్ముగఁ దత్క్షణంబ మదులన్ నిస్తేజ మేపారఁగన్

తే.గీ. బ్రహ్మ మస్త్రమును గ్రసించె బ్రహ్మ దండ
మునసె బ్రహ్మ తేజ మడర ముని వరుఁడు వ
సిష్ఠుఁ డతి ఘోరమును గూడ శీఘ్ర గతిని
రఘు కులాంబుధి హిమధామ! రామచంద్ర! 12.

కం. కబళింపఁగ బ్రహ్మాస్త్రముఁ
దబిసి వసిష్ఠుఁడు వడసెను దారుణ రూప
మ్ము బెదరి మూర్ఛిల ముజ్జగ
ము బెడిదముగ మండు టగ్నిఁ బోలుచు నంతన్ 13.

ఆ.వె. అమ్మహాత్ముని సక లాంచిత రోమ కూ
పముల ధూమ సహిత వహ్ని శిఖలు
కిరణ తతుల భంగిఁ దరళమ్ముగ వెడలె
భీతిలంగ సర్వ లాతతముగ 14.

ఆ.వె. వెల్గె నట వసిష్ఠ విప్రవరుని చేతి
దండము పొగ లేని మండు టగ్ని
భంగి మిక్కుటముగఁ బర యమ దండమో
యనఁగ భ్రాంతిఁ జెంద నక్కజముగ 15.

కం. మీ బల మమోఘ మైనది
నాఁ బొగడి యనిరి మునులు ఘన ముని వసిష్ఠున్
మీ బహుళ తేజమున నిట
నీ బిగి తేజమ్ము నాపుఁ డెలమిని నంచున్ 16.

ఆ.వె. తాపసుఁడు మునీంద్ర! తగ్గె విశ్వామిత్రుఁ
డిపుడు నీ వలననె యింకఁ గరుణఁ
జూడు లోకములను వీడి వెత మనఁగఁ
దాపస గణ ముఖ్య! యాపి కినుక 17.

కం. విని యాపలుకులు దా శమ
మును బొందెను దాపసోత్తముండు వసిష్ఠుం
డు నరపతి తా నణపఁబడి
మునివరుచే నిశ్వసించి మూల్గుచు ననియెన్ 18.

తే.గీ. అల్ప బల మిసీ యీ క్షత్రియ బలము ద్విజ
పరమ తేజోబలమ చుమ్ము బలము బ్రహ్మ
దండ మొక్కటి సమయించె గండు మీఱ
నస్త్ర రాజము లన్నిటి నలపు లేక 19.

కం. తలఁచి నృవరుఁడు ప్రసన్నత
యలవడ మన మందు మిగుల నాత్మఁ దలంచెన్
లలితమ్ముగఁ జేయఁ దపము
ఫలం బరసి కౌశికుండు బ్రహ్మత్వమ్మున్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది యాఱవ సర్గము.

# బాలకాండము

# సర్గము 57.

వశిష్ఠ మహర్షిపైఁ గోపముతో విశ్వామిత్రుఁడు ఘోర తపమును జేయ బ్రహ్మ దేవుఁడు దర్శన మిచ్చి రాజర్షి పదవి ప్రసాదించినఁ దృప్తిఁ జెందక తిరిగి తపము చేయుట, తత్కాలమున నిక్ష్వాకు చక్రవర్తి త్రిశంకుఁడు సశరీరము దివికిఁ జేరుటకు యజ్ఞము జరిపింపు మని వసిష్ఠునిఁ బిమ్మట వాసిష్ఠులను గోరుట.

కం. మునితో విశ్వామిత్రుఁడు
ఘన వైరం బూని కలఁపఁగఁ బరాజయ కో
టి నిజ మనమ్మును దుఃఖ
మ్మున నిట్టూర్చుచు భృశమ్ము మునిఁగెను రామా! 1.

ఉ. చని నిజ భార్యఁ గూడి వడి సంయమనీ పతి దిక్కు రాఘవా!
మనమున దాంత మూని పరమంపుఁ దపమ్మును ఘోర భంగినిం
దనరుచుఁ గౌశికుండు వసుధాపతి సత్ఫల కంద మూల భో
జనుఁ డయి చేసె నచ్చట నచంచల దీక్ష వహించి నిత్యమున్ 2.

తే.గీ. అంతఁ గొంత తఱిని హవిష్యందుఁడు నన
ఘుఁడు మధుష్యందుఁడు దృఢ నేత్రుఁడు మహా ర
థుఁడు ననంగ నల్వురు సుపుత్రు లుదయించి
రాతనికి సత్య ధర్మ ర తాత్మ లెలమి 3.

మ. పరి పూర్ణంబయినన్ సహస్ర సమ లప్పద్మాసనుం డేఁగుదెం
చి రహిం బల్కె జగత్పితాముహుఁడు దాక్షిణ్యమ్ము దీపింపఁగా
వర రాజర్షి! జగమ్ములన్ గెలిచి విశ్వామిత్ర! రాజర్షి నా
బరఁగం జాలుదు వీవు ధాత్రి నీఁక సంభావ్యుండవై యం చటన్ 4.

కం. లోకేశ్వరుఁ డిట్లు పలికి
నాకమ్మున కేఁగె బ్రహ్మ నళినజుఁడు సురా
నీకము గూడి యపుడు నిజ
లోకము తేజోవపువు సురుచి రాధ్వమునన్ 5.

కం. విని విశ్వామిత్రుఁడు సి
గ్గునఁ దల వాంచి వగ పింకఁ గోపం బడరన్
మనమునఁ గరమ్ము దాఁ బ
ల్కెను వచనమ్ములు ముఖమ్ము గెంపాఱంగన్ 6.

తే.గీ. చేసితి నిట గొప్ప తపము భాసురముగ
సురలును సురర్షిగణము కని రకట నను
గేవలమ్ము రాజర్షిగ నా వర తప
పు ఫల మది శూన్య మని యెంతు మురియ నేల 7.

ఆ.వె. తిరిగి చేయఁ దొడఁగెఁ బరమంపుఁ దపమును
దలఁచి యిట్లు మదినిఁ గలఁత నంది 8.

వినుత పరమ చిత్త ఘనుఁడు విశ్వామిత్రుఁ
డలఘు ధృతి ధరుండు ఫలము నెంచి

తే.గీ. సత్యవాది జితేంద్రియ చక్రవర్తి
యా తరుణ మందు విఖ్యాతుఁ డా త్రిశంకు
నాముఁ డిక్ష్వాకు కుల వర్ధన నృవరుండు
కలఁడు నిజ రాజ్య మేలుచు ఘనుఁడు రామ! 9.

తే.గీ. నిజ శరీరముతో దివికిఁ జను నిచ్ఛ
తోడ యజ్ఞ మొకటి సేయ వేడుక తన
రెను మదిని దృఢతరముగ ఘనున కవని
పతికి నా త్రిశంకున కిన వంశ రామ! 10.

తే.గీ. అతఁడు పిలిపించి బ్రహ్మర్షి నా వసిష్ఠు
నంతఁ దెలిపె మనోరథ మలరి నృపతి
యది విని యసాధ్య మనియె మహాత్ముఁ డపుడు
ఖేద మడరంగ నెడఁద దుఃఖింప రాజు 11.

కం. కా దన వసిష్ఠుఁడు చనియెఁ
దా దక్షిణపు దిశకు ముని తనయులఁ గాంచన్
సాదరముగ వేఁడఁ దలఁచి
వే దీర మనోరథమ్ము పృథివీ పతియే 12.

చం. చని కనె నా త్రిశంకుఁ డట సంయమి నందను లైన వంద మం
దినిఁ జిర కాల మచ్చట రతిం దప మింపుగ నాచరించు వా
రిని నిజ తేజముల్ పరఁగ లీల దిశావళి భాసురమ్ముగం
దనరెడు వారి సంతస మెదన్ విలసిల్లఁగఁ గీర్తిమంతులన్ 13.

ఉ. చేరి తగన్ మహాత్ముల వసిష్ఠ కుమారుల నెల్లరన్ మహీ
భార ధరుండు దల్చి తగఁ బ్రాయపు వావిరి వందనమ్ములం
దీరుగఁ జేసి సిగ్గు కొలఁదిం దల వంచి కృతాంజలుండునై
వారల తోడఁ బల్కె నిటు పన్నుగ వాక్య విదుండు ప్రీతినిన్ 14.

కం. శర ణాగతుఁడను శరణము
శరణ మొసఁగు వారి వేఁడఁ జనుదెంచితి భూ
సుర వర్యులార శుభమగుఁ
గరమ్ము మీకు జనకుండు కాదనె నడుగన్ 15.

ఆ.వె. నతు లొసంగుచు గురు సుతుల నర్థింతును
గ్రతువు నొకటిఁ జేయ లలితముగఁ ద
లంచితిని ధరణి సుర వరులార యనుజ్ఞ
నొసఁగ నర్హులు దయ నుంచి నాకు 16.

తే.గీ. శిరసు వంచి మ్రొక్కుదు నేను ధరణి సురులు!
మీకు నాదు కోరిక తీర మీఱి తనువు
తోడ దివి కంపు జన్నము తుష్టిఁ జేయ
నిండు మీరు ఋత్విజు లయి యుండి ప్రీతి 17.

తే.గీ. త్రోసిపుచ్చ వసిష్ఠుఁడు తోఁప రెవ్వ
రింక గతి నాకు శోధింప నెందు గురు త
నయులు మీరు దక్కంగ నన్య నరు లందుఁ
దాప నోత్తములార యీ ధాత్రి లోన 18.

తే.గీ. గతి పురోహితు లిక్ష్వాకు పతుల కెల్ల
రాజులఁ దరింపఁ జేయఁ గలరు పురోధ
లరయ విద్వాంసు లెల్ల రనంతరమ్ము
మీర దేవుళ్లు నాకెంచఁ దోరముగను 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది యేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 58.

వసిష్ఠుని నూర్గురు పుత్రులు తిరస్కరించి శపింపఁ ద్రిశంకుఁడు విశ్వామిత్రుని శరణు వేఁడి
యజ్ఞమును జరిపింపు మని వేఁడుకొనుట.

కం. విని యా త్రిశంకు మాటలు
ముని పుత్ర శతమ్ము రాజ పుంగవుఁ గని ప
ల్కె ననూన రోష సంభృత
మనో నికాయమ్ము తోడ మనుజవరేణ్యా! 1.

తే.గీ. సత్యవాది కా దని యన చనునె రాజ
యేల దాని మీఱుచు నిట్లు నితర మార్గ
ములు వెతకు దీవు మాతండ్రి ముఖము లన్న
గౌరవమ్ము పాటింపవె కపట బుద్ధి 2.

కం. గతి యిక్ష్వాక్వన్వయ భూ
పతుల కిలఁ బురోహితులె యవార్య గురువులున్
నుత సత్యవాదుల నృపుల
కతిక్రమింపఁ దర మగునె యావం తైనన్ 3.

ఉ. శక్యము కాదనంగ ముని సత్తముఁ డప్పుడు రాజసత్తమా!
వాక్యము లెన్న కా క్రతువుఁ బన్నుగఁ జేయఁ దరమ్మె మాకు నా
ధిక్యము నూని యేఁగుమ త్వదీయ పురమ్మున కింకఁ దాన యౌ
శక్యుఁడు జన్నముల్ సలుప క్ష్మాపతి కోటికి ముజ్జగమ్ములన్ 4.

కం. నరవర జన్నము నీకు నొ
నరించి నీ పల్కిన విధి నయ మెంచ కెదన్
గురువున కవమానమ్మును
దరమే చేయంగ మాకు దారుణ రీతిన్ 5.

చం. అన విని కోప వాక్యముల నద్ధరణీపతి యంతఁ దిర్గి యి
ట్లనె వచనమ్ము లారసి సుతాలి వసిష్ఠుఁడు మీరు నన్నుగా
దని రిట నింక నేఁ జనుదు నన్యునిఁ గోరఁగ మీకు భద్రమై
తనరును గాక సంతతము తాపస పుంగవు లార నా ననెన్ 6.

మ. విని యా పల్కులు తాపసాత్మజు లహో బీరమ్ముగా పల్కగం
గనలం బంది భృశమ్ము చిత్తముల ధిక్కారమ్ము నోర్వంగ లే
క నరాధీశు శపించి యాక్షణమ యీ కాంతుండు చండాలుఁడై
మను గాకంచును బల్కి వారు నిజ సద్మం బేఁగి రొక్కుమ్మడిన్ 7.

కం. కడవఁగ రాతిరి యంతం
దడయక చండాలుఁ డయ్యె ధాత్రీ పతియే
పుడమి సురల శాపమ్మును
గడవం దరమే మహీశ గణమున కెంచన్ 8.

తే.గీ. నీల వస్త్ర ధరుం డయ్యె నీల కాయుఁ
డయ్యె జుట్టు చెదరె బూది యలమి యుండెఁ
గాటి దండ లమరె మేనఁ గాంచనమ్ము
వోయి కలిగె నంత నినుప భూషణములు 9.

తే.గీ. కాంచి చండాల రూపుని మించి పర్వు
లిడిరి విడిచి మంత్రులు పౌరు లింక రాజ
భటులు ననుయాయు లెల్లరు భయము తోడ
వేగముగ దశ దిశలకు వింత రామ! 10.

తే.గీ. ఒక్కఁడె మహాత్ముఁడు నృపతి యోర్పు నూని
నెమ్మి రేలు బవళ్లు చని చని చేరె
దహ్యమానుఁ దపోనిధి సాహ్య మరసి
రాజ ఋషిని విశ్వామిత్రు రఘువరేణ్య! 11.

కం. కనఁ జండా లాకృతు హత
మనోరథు ధరాధినాథు మౌనీంద్రునకున్
ఘనతరముగ విశ్వామి
త్రునకుం గారుణ్య మడరెఁ దూర్ణమ్ము మదిన్ 12.

కం. దయ తోడ మహాతేజుఁడు
నయవిదుఁ డా ధార్మికుండు నరనాథుం గాం 13.

చి యనియె వాక్యములు వికృత
మయిన శరీరు నృప! భద్ర మగు నీ కనుచున్

తే.గీ. వచ్చిన పని యదేమి నృవర యయోధ్య
కుం బతివి బల్లిదుండ! శాపంబున నయి
తీవు చండాలుఁడవు వసుధావరా! ప
లుకు మభీతిని నంచుఁ బలుకఁగ నంత 14.

మ. విని యా వాక్యము లా నరేంద్రుఁడు మహా వీరుండు చండాలుడున్
వినయుండై వడి మోడ్చి హస్తముల నావేశంబునం బల్కె రా
ఝ్మని వీక్షించి తిరస్కృతుండ నయితిం బుత్రాలిచే నొజ్జ చే
తను నా కోర్కెను బొంద నైతి విపరీతం బయ్యె నా కక్కటా 15.

తే.గీ. దివికి సశరీర మేఁగ మునివర! నాదు
వాంఛితము సుమ్ము సేసితి వంద క్రతువు
లింపుగఁ దమి వాని ఫలమ్ము నెన్నఁ డేనిఁ
గాంచ నేర విశ్వామిత్ర! కొంచె మైన 16.

ఆ.వె. అనృత మేను మున్ను మునివర పలుక లే
దింకఁ బలుక నేర నెట్టి కష్ట
ము లెదు రైన నేమి పలుకను నీ మీద
నొట్టు రాజ ధర్మ ముంచి యెడఁద 17.

తే.గీ. జన్నములు పెక్కు చేసితిఁ గన్న బిడ్డ
ల వలెఁ బ్రజల రక్షించితి లాలనమునఁ
బెద్ద లెల్లరు నా శీల వృత్త మరసి
యంతరంగమునఁ గనిరి సంతసమ్ము 18.

ఆ.వె. ధర్మ మనుసరించి తాపసేంద్ర! క్రతువు
సేయ నెంచఁగఁ గమనీయముగను
నాదు గురువు లకట మోద మంద రనుజ్ఞ
నీయ రేమి యందు నెందుఁ జనుదు 19.

కం.  దైవ బలం బది గొప్పది
కేవల మానవ బలమ్ము గిట్టును వమ్మై
దైవంబే పరమపు గతి
దైవం బది యాక్రమించు ధరణిని సెల్లన్ 20.

తే.గీ.  అట్టి యార్తుండ నన్నిఁక నిట్టి తఱిఁ బ్ర
సాదమును గోరు వానిని నాదరించి
తేర్పఁ దగు దీవు రాజర్షి! దేవ నిహతు
నింక భద్ర మగును గాక యెలమి నీకు 21.

కం.  ఇతరంపుఁ బ్రాపుఁ జేరను
గతి లే దన్యమ్ము నాకుఁ గౌశిక యింకన్
వితత పురుష యత్నమ్మున
సతతము దైవకృతముఁ దగ శమియింప వలెన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది యెనిమిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 59.

త్రిశంకునిచే యజ్ఞము జరిపింప నెంచి విశ్వామిత్రుఁడు సక లాధ్వరులను మునులను విప్రుల నాహ్వానింప నాజ్ఞాపింప నెల్ల రచటకు నేతెంచుట, మహోదయునితోఁ గూడి వశిష్ఠ పుత్రులు పరుష వచనము లని తిరస్కరింప వారిని విశ్వామిత్రుఁడు శపించుట.

కం.  నృపు మాట లెల్లఁ దా విని
కృపతోఁ గుశికాత్మజుండు కృత దృఢ చిత్తుం
డు పలికెఁ జండా లాకా
ర పురేశునితో మధురతరమ్ముగ రామా! 1.

తే.గీ. స్వాగతము నీకు వత్స! యైక్ష్వాక నిన్నె
ఱుఁగుదు ధార్మిక! నే శర ణగుదు రాజ
పుంగవ! భయమ్ముఁ వలదింకఁ బుణ్య చరిత!
చిత్త మందు నించుక యేని నిత్తఱి నని 2.

చం. మునులను బుణ్య కర్ములను భూవర యాగ సహాయ విప్రులన్
ఘనముగ నాచరింప నవికారత యాగము నిప్డు పంచి తె
త్తును గురు శాప కల్పితపు దుస్స్పహ రూప శరీర యుక్తముం
జనెదవు హస్త లభ్య మగు స్వర్గము చేర శరణ్యు నన్నిటన్ 3.

చం. పలికి మహాత్ముఁ డట్లు తన ప్రాజ్ఞ కుమారులఁ బంచె వస్తు కో
టులు సవ నార్థ మన్నిటిఁ గడుం గడు వేగమ కూర్ప స్వీయ శి
ష్యులఁ బిలిపించి పంపెను యశోధనులం గొని తే సశిష్య మౌ
నుల శ్రుతి విజ్ఞ ఋత్విజులనుం జెలికాండ్ర నిజాజ్ఞఁ దెల్పుచున్ 4.

ఆ.వె. ఎవ్వ రేని యాలకించి నా యీ వచ
నమ్ము లెద్ది పల్కిన నది యెల్ల
గౌరవమ్ము సూపక పలికినవి యెల్లఁ
జెప్ప వలయు నాకుఁ దప్పకుండ 5.

తే.గీ. గురువు నాజ్ఞను దలఁ దాల్చి కూర్మి నేఁగి
రెల్ల దిశలకు వేదజ్ఞు లెల్ల వేగ
తిరిగి వచ్చి యంతఁ దిరిగి దేశదేశ
ములు సమీపించి రెల్లరు మునివరేణ్యు 6.

కం. చేరి కలసి వా రెల్లరు
నా రాజర్షిన్ జ్వలిత మహా తేజస్విన్
ధారుణి నరసిన శ్రుతి చయ
పారంగతుల నుడు లెల్లఁ బల్కిరి మునితో 7.

కం. విని మునివరేణ్య మీ గిర
లను వచ్చుచు నుంటిరి సకల ద్విజ వరులుం
జనుదెంచి రెల్ల దేశము 8.

ల నుండి రానట్టి వాఁ డల మహోదయుఁడే

తే.గీ. రోష మూని వసిష్ఠ పుత్రు లగు నూర్వు
రనిన యట్టి పల్కుల నన్నిటిని వినుండు
క్షత్రియుండు చండాలుఁడు కాఁగ యాజ
క యజమానులు హవిఁ గొందురె యిల సురలు 9.

తే.గీ. బ్రాహ్మణులును విశ్వామిత్రు పంచఁ జేరి
కుడిచి చండాలు నింటను గుడుపు నకట
యందఁ గలవారె స్వర్గము నంద టెంచ
బాగు బాగని పల్కిరి వ్యంగ్యముగను 10.

తే.గీ. ఎల్లరు వసిష్ఠ నందను లల్ల యా మ
హోదయునిఁ గూడి నిష్ఠుర మైన వాక్య
ములను రోషమ్ముగ మునీంద్ర! పలికి రచట
నరుణ పూరిత నేత్రులు దరమె నుడువ 11.

ఆ.వె. అట్లు వార లంద అన్న వి యాలకిం
చి మునిసుతుల నుడులు చెన్ను మీఱి
నట్టి కన్ను దోయి బిట్టదరఁ బలికె
గాధిపట్టి యలుకఁ గఠినముగను 12.

కం. ఉగ్ర తప మందు నిల్చి స
మ గ్రాదుష్టపుఁ జరిత్ర మసలెడు వానిన్
నిగ్రహు నను దూషింతురె
యాగ్రహమున దుష్టులు మసు లౌదు రశంకన్ 13.

ఆ.వె. నేఁడు కాలు నిల్లు తోడికొని చనంగఁ
గాలపాశ మహిమ జాలి కొలుప
జనువు లేడు నూర్ల సంతతమును బీనుఁ
గు గమి కూడు వీరు కుడుచు చుండ్రు 14.

కం. వికృతులు విరూప తను లై 15.

సకల సుతులు శునక మాంస సంభోజనులై
యకృపఁ జరింత్రు సతము ము
ష్టికా కులము నందుఁ బుట్టి చిత్రముగ నిలన్

ఉ. నన్ను ననిందనీయుని ఘనమ్ముగ నింద యొనర్చె దుష్టుఁడై
క్రన్నన నా మహోదయుఁడు గర్వి జగమ్ముల దూషితంబుగా
నున్న నిషాద వంశమున నుర్వి జనించును గాక నిక్కువం
బిన్నర లోక పాంసనుఁడు హీన చరిత్రఁ జరించు నిత్యమున్ 16.

తే.గీ. పరుల ప్రాణ ఘాతకుఁడై కృపా విహీనుఁ
డై చరించును జిరకాల మతఁడు దుష్ట
వర్తనమ్మున నాదు కోపంపుఁ బెంపు
వలన నమ్మహోదయుఁడు కపటపు బుద్ధి 17.

కం. మునుల నడుమ నిల్చి తపో
ధన విశ్వామిత్రుఁడు ఘనతర తను తేజ
స్వి నుడుల నివ్విధి నని యా
పెను బల్కులు కౌశికుండు పెనుకోపముతో 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నేఁబది తొమ్మిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 60.

విశ్వామిత్రుఁడు త్రిశంకుని స్వర్గమునకుఁ బంప నింద్రాది సురులు వెనుకకుఁ బంపఁ బ్రత్యేక
స్వర్గమును సృష్టించి దేవతలను సమ్మతింపఁ జేసి యందు నతని నిల్పుట.

కం. తనదు తపో బలమున హత
మొనరించి ఘనుఁడు మహోదయునితో ముని నం 1.

దన శతము నెల్లఁ గౌశికుఁ
డనియెను మునుల నడుమను మహా తేజుఁ డిటుల్

మ. ఇతఁ డీశుండు త్రిశంకు నామ విభుఁ డా యిక్ష్వాకు దాయాదుఁడే
నుత ధర్మిష్ఠ వదాన్యుఁడే కదిసి నన్నున్ భక్తినిం గోరె నా
తత రక్తిన్ శరణమ్ము కోరి త్రిదివస్థానమ్ము దేహమ్ముతోఁ
గ్రతువుం జక్కఁగ నాచరించుటకు భూకాంతుండు నమ్రుండునై 2.

తే.గీ. ఈతఁడు సశరీరము దివి కేఁగు నట్లు
తగెడు యజ్ఞము నొకదానిఁ దనరి మీరు
నన్ను గూడి యారంభింపఁ బన్నుగ నిట
నుద్యమింపుఁడు మునులార హృద్యముగను 3.

కం. విని యా విశ్వామిత్రు వ
చనములు ధర్మజ్ఞులు ముని సత్తము లంతన్
మినుకులు ధర్మ యుతమ్ముల
ననిరి కలసి యెల్లరు తగ సాలోచనులై 4.

తే.గీ. కుశిక దాయాదుఁ డీతఁడు కోప ముండు
మెండుగ జ్వలి తానల సన్నిభుం డితండు
నుడివి నట్టి కార్యముఁ జేయ నొప్పు మనకుఁ
జేయకున్న శపించు నమేయముగను 5.

చం. కనుక త్రిశంకుఁ డేఁగఁగ సకాయము కౌశికు తేజపుం బల
మ్మున దివి కింపుగం గ్రతువు పూని యొనర్పఁగ నుద్యమింపుఁడీ
యని ముని లెల్ల కార్యముల నందఱు సేయఁ దొడంగి రింపుగా
ననల నిభుండు తాపసుఁడు యాజకుఁ డయ్యెను గౌశికుం డటన్ 6.

తే.గీ. ఋత్విజులు మంత్ర కోవిదు లెల్ల రపుడు
క్రమముగఁ బను లడర యథోక్తముగఁ గల్ప
సమ్మతముగ మంత్రమ్ములు చదువుచు జరి
పించి రా యజ్ఞరాజము నంచితముగ 7.

కం. చిరకాలమునకు సంయమి
వరుండు భాగములను గొన వర మంత్రములన్
సుర వరుల నెల్లరఁ బిలిచెఁ
బరమానందమ్ము తోడఁ బావనుఁ డంతన్ 8.

ఉ. పిలిచిన స్వీయ భాగములు పేర్మి గ్రహింపఁగ దేవతా గణ
మ్ముల నకటా నొకండును నపూర్వ మనంగను రాక యున్నచో
నలిగి కరమ్ము మౌనివరుఁ డంత స్రువమ్మును మించి యెత్తి తాఁ
బలికెఁ ద్రిశంకుఁ గాంచి యటఁ బల్కుల నివ్విధి సంభ్రమమ్మునన్ 9.

తే.గీ. స్వార్జితమ్మగు నా తపోబలము నిపుడు
రాజ కనుమ పంపుదు శరీరమ్ము తోడ
నిన్ను దివమున కింపుగ నిజ శరీర
మరుగుమ దురాపము దివికి నరవరేణ్య! 10.

ఆ.వె. కొంచె మైన నున్న సంచితంపుఁ దపః ఫ
లమ్ము నాకు స్వార్జితమ్ము దాని
తేజ మూని నీవు దివి కేఁగుమ సశరీ
రమ్ము రాజ! సంశయమ్ము లేక 11.

కం. అనఁగ ముని యివ్విధము నిజ
తను సహితం బేఁగె దివికి ధరణీ పతియే
మును లెల్లఁ గాంచు చుండగఁ
గనుల కొసఁగుచుఁ గడు విందు కాకుత్స్థ వరా! 12.

ఆ.వె. దేవ లోక మందు దేవేంద్రుఁడు త్రిదశ
గణము తోడ నుండి కని త్రిశంకుఁ
బలికె రాఁగ నిట్లు వచనమ్ముల నలుక
కానిపింప నిజ ముఖమ్ము నందు 13.

తే.గీ. స్వర్గ మిది నీకు కాదు వేశ్మమ్ము నిలువఁ
బొమ్ము తిరిగి త్రిశంకు వేగమ్ముగ గురు
శాప హతుఁడవు కనలేవు చదలు మూఢ! 14.

నేలఁ గూలుమ తల క్రింద నెగడ నీవు

ఆ.వె. పలుక నింద్రుఁ డిట్లు పడెను దిరిగి యా త్రి
శంకుఁ డంతఁ గావు శరణ మంచు
వేఁడి కొనియెఁ గరముఁ భీతి విశ్వామిత్రు
నా తపోధనుని ధరాధిపతియె 15.

తే.గీ. అఱచు వాని యార్తుని పల్కు లాలకించి
కౌశికుఁడు తాపసుండు భూకాంతుఁ గాంచి
రోష మూని భృశమ్ము పల్కులను రాజ!
నిలు నిలు మనుచుఁ బల్కెను నీరజాక్ష! 16.

ఉ. దక్షిణ దిక్కులో ఋషుల ధాత పరుం డన పెల్గి యేడ్వురన్
దక్షత నిల్పి యన్యులను దాపస సత్తముఁ డింక నింపుగా
నక్షయ రీతి నభ్రమున నంత సృజించె వ రాన్య తారలన్
దక్షిణ దిక్కు నందుఁ దగఁ దాపసు లెల్లరు చూచు చుండఁగన్ 17.

మ. తగ సృష్టించి సరోష చిత్తుఁడు మహా తారాళి గాధేయుఁడే
పగ మీఱం బలికెం బురందరుఁ బరున్ భవ్యున్ సృజింతున్ వడిన్
జగమం దింద్రుఁడు లేనిచోఁ దగదు నా సంరంభియై దేవతా
సు గణం బెల్ల సృజింపఁగాఁ దొడఁగెఁ దాఁ జోద్యంపు టుద్యోగియై 18.

తే.గీ. అంతఁ గలవర మంది సురాసుర స మ
హర్షి సంఘములు పలికె సానునయ వ
చనము లడలి విశ్వామిత్ర సంయ మీంద్రుఁ
జేరి వినయ మతిశయిల్ల శీఘ్ర గతిని 19.

తే.గీ. ఈతఁడు గురు శాపక్షతుఁ డిద్ధ చరిత!
మునిగణారాధ్య! సశరీరము దివి నుండ
నర్హుఁ డరయఁ గాఁ డెన్నఁడు నవధరింప
నర్హుఁడవు నీవు పరికింపు మాత్మ లోన 20.

కం. విని యా దేవత లందఱి 21.

వినయంపు వచనము లెల్ల విశ్వామిత్రుం
డు నిఖిల సుర గణముం గని
మునిపుంగవుఁ డిట్టు లనియె ముఖములు శుభముల్

ఆ.వె. మేని తోడ దివికి నే నంపెద నని ప
లికి నృపవరు తోఁ బలుకఁగ నన్నృత
మెట్లు తగును నాకు నెవ్విధి నైనను
భద్ర మగును మీకు పరమ సురులు! 22.

తే.గీ. స్వర్గ మగుఁ గాక సతము త్రిశంకున కిది
యుండు సశరీర మిచ్చట యుండు నా యొ
నర్చినట్టి నక్షత్ర గణమ్ము లెల్ల
శాశ్వతమ్ముగ వెలసి యీ విశ్వ మందు 23.

తే.గీ. ఎంత వఱకు లోకము లుండు నంత వఱకు
నుండు నివి యెల్ల భాసిల్లుచుండి భృశము
నా సృజించి నట్టివి యెల్ల నో సురవరు
లార యర్హులు మీరెల్ల ననుమతింప 24.

కం. అన విశ్వామిత్రుఁ డిటులఁ
జను నట్టుల సంయమీంద్ర! చక్కఁగ నింకన్
విను నిల్చు నెల్ల నంతట
ఘన భద్రము నీ కనె సురగణ మా మునితో 25.

తే.గీ. గగన మందు నక్షత్ర నికాయ మెల్లఁ
బరఁగు వైశ్వానర పథము బయటఁ దార
ల నడుమ త్రిశంకుఁడు వెలుంగు ఘనుఁడ! యమర
సముఁడు తల క్రిందుగ నమరి సమ్మదమున 26.

తే.గీ. కీర్తి మంతుఁ గృతార్థునిఁ గృత విలసిత
తార లెల్ల ననుసరించు ధరణి పతిని
స్వర్గ లోక మేఁగిన వాని చంద మలరి
నిత్యము ప్రభల తోడ మునివర గణ్య! 27.

ఆ.వె. సకల సురులు మునులు సన్నుతింప భృశము
ముని మహాత్ముఁ గౌశికుని ముదమ్ము
వడసి తృప్తిఁ జెంది పరమర్షి యమరులఁ
గాంచి మంచి దనెను గరము ప్రీతి 28.

కం. పన్నుగ సమాప్తమై చన
జన్నమ్ము మహాత్ములు మునిచయమున్ సురలుం
గ్రన్ననఁ దాపస వర్యులు
నెన్ని తొలుతఁ జేరిన గతి యేఁగిరి రామా! 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 61.

అంబరీషుని యజ్ఞాశ్వము నింద్రుఁ డపహరింప ఋచీక ముని పుత్రుఁడు శునశ్శేఫుఁడు తన్ను
యాగ పశువుగా నంబరీషునకు సమర్పించుకొనుట.

కం. తా నంపి ఋషులఁ గానన
మౌనివ్రాతమ్ముఁ గాంచి మాన్యచరిత్రా!
మౌనిప విశ్వామిత్రుఁడు
వీనుల కింపుగఁ బలికెను వీరవరేణ్యా! 1.

తే.గీ. దక్షిణ దిశ మనకుఁ గల్గెఁ దద్ద విఘ్న
మిట్లు కాన నేఁగెద మింక నితర దిశకు
నెల్లరము సమ్మదమ్ముగఁ బెల్లుగఁ దప
మాచరింతము నిశ్చింత పే చని యట 2.

ఆ.వె. పశ్చిమమునఁ గలదు పరమ తపోవని
పుష్కర మనఁగ ఘనముగ విశాల
మైనది తప మచట నందఱ మింపుగ
నాచరింప నగు మహాత్ములార! 3.

కం. పలుక మహాతేజుఁడు వా
ర లా మహా మునులు పుష్కరమ్మునఁ దినుచున్
ఫలములు నంచిత మూల
మ్ము లుగ్ర మతి దుర్భర తపమున నిల్చి రటన్ 4.

శా. ఆ కాలమ్మున నంబరీషుఁడె యయోధ్యా నాథుఁ డిష్టిన్ ధరం
జేకూరంగ నమేయ లాభములు సచ్ఛీలుండు సేయం దమిం
బాకారాతి ప్రయాగపుం బశువు నశ్వశ్రేష్ఠమున్ దొంగిలెన్
పే కాపట్యమునన్ వచించిరి నృపున్ వీక్షించి విప్రోత్తముల్ 5.

తే.గీ. అపహృతం బయ్యె రాజేంద్ర! యాగపశువు
నీదు దుర్నయ మక్కట పాదుకొనఁగ
రక్ష నీయంగఁ జాలని రాజు నతని
దోషములు నశింపఁగఁ జేయుఁ దూర్ణముగను 6.

చం. నృవర వరేణ్య గొప్ప దగు నిష్కృతి దీనికిఁ జేయ నొప్పగున్
సవనపుఁ గార్య సంచయము సాగెడు కాలము మించకుండఁగన్
నృవరునిఁ గాని యప్పశువునిం బదిలమ్ముగఁ గాంచుమీ వడిన్
హవ ఫలితమ్ము నెంచి మది నట్టుల భూవర! యుద్యమింపుమీ 7.

తే.గీ. ఒజ్జల పలుకులను విని యజ్జనపతి
బుద్ధిమంతుఁ డన్వేషించె భూతలమున
యాగపశువు నరు సహస్ర గోగణముల
నీయ నరుదెంచు వాని నరేంద్రవర్య! 8.

కం. ఆ యా దేశము లూరులు
నా యా నగరమ్ములు వను లాశ్రమ తతులున్
వేయేల నన్నియు వెదక 9.

నా యవనీపతి విరివిగ నయ్యె యెడలన్

కం. కనె నా రాజు సదార స
తనయ ఋచీక మునిని భృగు ధాత్రీధర మం
దు నవనిసురుఁ గూర్చుండఁగ
నిన వంశాంభోధి సోమ! యింపారంగన్ 10.

తే.గీ. కని నమస్కరించి వడసి కరుణఁ బుడమి
భర్త తేజస్వి రాజర్షి బ్రహ్మఋషిని
నిజ తపఃప్రభా దీప్త మునివర ముఖ్యు
సంతసముగ క్షేమ మడిగి సర్వులకును 11.

ఆ.వె. లక్ష గోవులకు వరసుతుని భార్గవ!
పశువు గాఁగ యజ్ఞ వరము నందు
నమ్మఁ దలఁచినన్ మహాభాగ! కృతకృత్యు
నౌదు నే నని ముని నడిగె నతఁడు 12.

కం. తిరిగితి దేశము లెన్నియొ
వర యజ్ఞార్థమ్ము గాంచఁ బశువు మునీంద్రా!
కరుణ నొక సుతుని నిమ్మా
విరివిగఁ గొని మూల్య మింత విప్రవరేణ్యా! 13.

కం. నరనాథుం డన నవ్విధిఁ
బరమర్షి ఋచీకుఁ డనియెఁ బార్థుని తోడన్
గురుతేజుఁడు యగ్ర తనయు
ని రాజవర విక్రయింప నేరను జుమ్మీ 14.

కం. విని పతి గిరల విమలముల
జనని తపస్విని నరవర శార్దూలుని గాం
చి నళినదళ నేత్ర తగు వ
చనమ్ములు వలికె నొకింత చంచల మతినిన్ 15.

చం. పలికెనె యమ్మ లే ననుచు భార్గవుఁ డాతని పెద్ద బిడ్డనున్ 16.

వల పది చంటి బిడ్డ పయిఁ బార్థివ మెండగు నాకుఁ గావునన్
వలవదు విక్రయింప మఱి వానిని నే శున కాఖ్యు నెవ్విధిం
దలఁపఁగఁ దండ్రి కగ్రజుఁడు తల్లికిఁ బ్రీతి కనిష్ఠుఁ డిద్ధరన్

కం. విని తల్లిదండ్రుల పలుకు
ల నా శునశ్శేఫుఁ డంత రామ! స్వయముగా
ననె మధ్యమ నందనుఁడు వ
చనమ్ము లివ్విధి నొకింత సంతాపమునన్ 17.

తే.గీ. తండ్రి పలికె జ్యేష్ఠుని నమ్మఁ దగ దని నృప!
తల్లి యమ్మ ననెఁ గనిష్ఠ తనయు భూప!
విక్ర యార్హుఁడు మధ్యముఁ డా క్రమమున
నన్నుఁగొనిపొమ్ము రాజేంద్ర! జన్నమునకు 18.

ఆ.వె. లక్ష యాల నొసఁగి రాజన్యుఁ డా శున
శ్శేఫునిఁ గొని చనెను శీఘ్రముగను
ముద మెడంద మీఱఁ బూర్ణ మనోరథుఁ
డయ్యె నట్లు రఘుకులాబ్ధి సోమ! 19.

కం. తగ నంబరీషుఁడు ముద
మ్మగ రాజర్షభుఁడు త్వరితము శునశ్శేఫున్
సుగుణాత్ముని ముని నందను
నిఁ గొని రథమ్మునఁ జనియెను నీరజ నయనా! 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది యొకటవ సర్గము.

## బాలకాండము

## సర్గము 62.

విశ్వామిత్రుఁడు తన కుమారులను శపించి శునశ్శేఫునకు మంత్రముల నుపదేశించి కాపాడి తిరిగి తప మాచరించుట.

కం. నుత కీర్తి యంబరీషుం
డతని శునశ్శేఫుఁ గూడి యరిగి యరిగి భూ
పతి మధ్యాహ్న మునకు రఘు
పతి! పుష్కర తటికిఁ జేరి పడసె నవరతిన్ 1.

ఆ.వె. విశ్రమించు చుండఁ బృథివీపతి యశస్వి
ముని కుమారుఁడు కరము వగ పున్న
యతఁడు పుష్కరమ్ము నందు విశ్వామిత్రు
మేనమామ సర్వ మౌనిఁ గాంచె 2.

తే.గీ. దప్పియు నలసట యతని ముప్పిరిగొన
ముఖము వెలవెలఁబాఱఁగ ముని సుతుండు
సంకటమున విశ్వామిత్రు నంకతలము
నఁ బడి తత్క్షణంబ పలికె గుబులు తోడ 3.

కం. జనకుఁడు లేఁడు మునీంద్రా!
జననియు లే దకట సౌమ్య! జ్ఞాతులు చుట్టా
లును లేరు నాకు ధర్మ
మ్ము నరసి రక్షింపు మీవ పుణ్యాత్మ! ననున్ 4.

చం. నలుగుర కీవ త్రాతవు ఘనమ్మగు బంధువు తాపసేంద్ర! యా
వలఁ గృతకృత్యుఁడై నృపతి పన్నుగ భాసిలు నట్టు లింక నే
నిలను జిరాయువుం బడసి యింపుగఁ జేసి తపమ్ము లుత్తమ
మ్మల దివి కేఁగి సౌఖ్యముల నందెడు రీతిగఁ బ్రీతిఁ జూడుమా 5.

తే.గీ. నాథుఁడవు నీవ నాకు ననాథున కగు
మ కృపఁ జూపి నా పయి భవ్యమానసమునఁ
బుత్ర వరుఁ గాంచు జనకుని బోలి ధర్మ
చిత్త రక్షింపు నన్ను విపత్తు లందు 6.

కం. విని విశ్వామిత్ర మహా
ముని యా గిర లనునయించి ముని పుత్రుఁ దగం
దనయుల వీక్షించి పలికె
మినుకులు ధర్మ సహితము లమేయము లంతన్ 7.

కం. పరలోక హితమ్ము శుభము
లరసి సుతులఁ దండ్రు లేల యవనిఁ దమి సృజిం
తురొ యక్కాలమ్ము తగం
బరఁగె నిపుడు పుత్రులార పన్నుగఁ గనుఁడీ 8.

కం. శరణము నన్నీ బాలుఁడు
వరముని పుత్రుండు వేఁడెఁ బరమప్రీతిం
గరుణను మే మీతని కిట
జరుగఁగ జీవితము నిండు సత్పాత్రునికిన్ 9.

తే.గీ. మంచి పనులు చేయుదు రెల్ల రంచితముగ
ధర్మరతులు మీరెల్లరు ధరణి లోన
యాగపశువుగ రాజున కచట కేఁగి
తృప్తి పఱచుఁ డగ్ని నడరి హృద్యముగను 10.

ఆ.వె. నాథవంతుఁ డగు శునశ్శేపుఁడు క్రతు వ
విఘ్న మగును సురలు ప్రీతిఁ జెందఁ
గలరు నాదు వచనములు నిజము లగును
బుత్ర వర్యు లార! పూనుకొనుఁడు 11.

మ. విని యా పల్కులు తండ్రి యట్టు లనఁగన్ విభ్రాంత చేతస్కులై
యని రంతన్ వచనమ్ము లివ్విధి మధుష్యందాది పుత్రుల్ మదిం
దనరన్ దర్పము లీల తోఁపఁ గరముం దండ్రిన్ సమీపించి పే
వినయం బించుక లేక వర్తనములన్ బీరమ్ముగా నెల్లరున్ 12.

ఆ.వె. స్వీయ సుతులఁ దండ్రి! వీడి పరుల పుత్రు
ల కిడఁ దివిరి నీదు రక్షణం బ
కార్య మనుచుఁ దోఁచుఁ గాంచ మాకు శునక 13.

మాంస మన్న మందు మరగు నట్లు

కం. కొడుకు లనిన మాటలు విని
యడరిన కోపమున నెఱ్ఱ నయి కన్నులు మం
డెడి నిప్పును బోలి కనం
బడఁ బలుకఁ దొడంగె నిట్లు పల్కులు రామా! 14.

కం. భయ మించుక లేక భృశ మ
నయములు రోమాంచపు వచనమ్ము లకట మీ
ర యతిక్రమించి నా నుడు
లె యంటి రిట్లేమనఁ దగు సెల్లర మిమ్ముున్ 15.

తే.గీ. కుక్క మాంసమ్ము తిను జాతి నక్కజముగఁ
బుట్టుఁ డింక వాసిష్ఠులఁ బోలె ధరణి
వేయి యేండ్లు పూర్ణమ్ము జీవించు చుండి
సంచరింతురు గాక నిస్సంశయముగ 16.

ఆ.వె. శాప మిచ్చి యిట్లు సంయమీంద్రుఁడు నిజ
నందనులకు నార్తున కభయమ్ము
నిచ్చి పలికె నిట్టు లెలమి శునశ్శేఫుఁ
గాంచి తీర్ప బాధఁ గౌశికుండు 17.

తే.గీ. ఎఱ్ఱ చందన మద్ది మే నెఱ్ఱ బట్ట
లు తొడిగి పవిత్ర పాశములు తగిలించి
కట్ట యూపమునకు నిన్ను బట్టి! యిట్టి
పల్కు లగ్నితో నింపుగఁ బల్కు మడరి 18.

తే.గీ. రెండు దివ్యంపు గాథలు లీలఁ బాడు
మంబరీషుని యజ్ఞము నందు వీని
దానఁ బొందఁ గలవు సిద్ధి తథ్యముగను
బలికి యిచ్చెఁ దా నా మంత్రములను బ్రీతి 19.

తే.గీ. మంత్రములను గ్రహించి సమాహితంపు 20.

మది శునశ్శేఫుఁ డా రెంటిఁ గదిసి రాజ
సింహు నంబరీషు ఘనుని శీఘ్రముగ వ
చించె నివ్విధి ముని సుతుఁ డంచితముగ

ఆ.వె. రాజసింహమా! పరమ సత్వ! శీఘ్ర మేఁ
గెదము నీదు యజ్ఞ సదసుఁ జేర
దీక్ష నూన వలయుఁ దివిరి నిర్వర్తింపు
కార్య తతుల నెల్ల నార్య! యడరి 21.

కం. అలసత్వము లేక నృపతి
పలుకు లతం డనఁగ వేగఁ బయనం బయ్యెం
జెలఁగ మహానందము మది
లలిత క్రతువాటిక కవిరామం బంతన్ 22.

ఆ.వె. ఈయ నా సదస్యు లెల్ల ననుజ్ఞ నె
జ్ఞని వలువలు పూతలను నలఁది ప
విత్ర లక్షణునిగ వే చేసి యతని బం
ధించె యూప మందు మించి రాజు 23.

తే.గీ. బంధితుం డయి యుత్తమ వాక్కుల ముని
సుతుఁడు తనియఁ జేసెను మునిపతి నుడివిన
యట్టి రీతి నింద్రుని వాని యనుజు మంత్ర
యుగ్మమున నా శునశ్శేఫుఁ డుచిత రీతి 24.

కం. ప్రీతి వడసి దేవేంద్రుం
డాతని గుప్తస్తుతులఁ జిరాయువు నొసఁగెన్
వీతభయ శునశ్శేఫున
కా తఱి నాశ్చర్యముగ నినాన్వయ వర్యా! 25.

ఆ.వె. పూర్తి చేసి యజ్ఞమును భూపతి పురంద
రుని ప్రసాద మలర రుచిర ఫలము
లు బహు గుణము లందెను బురుషపుంగవా!
యంబరీషుఁ డంత సంబరముగ 26.

కం.	ముని విశ్వామిత్రుండును
ఘన ధర్మపరాయణుండు కౌశికుఁ డంతన్
వన మా పుష్కర మందున్
సనియతి వేయేండ్లు తపము సల్పెను రామా!	27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది రెండవ సర్గము.

## బాలకాండము

## సర్గము 63.

విశ్వామిత్రుఁడు వేయి సంవత్సరములు తిరిగి తపస్సు చేయ బ్రహ్మదేవుఁడు మెచ్చి ఋషిగ
గుర్తింప నింకను దప మాచరించు చుండ నప్సరస మేనకును గాంచి దశ వర్షము లామెతోఁ గూడి
యుండి తపో భంగపుఁ బశ్చాత్తాపమునఁ దిరిగి ఘోర తపము చేయ బ్రహ్మ మహర్షి పదవి
నిచ్చినను దిరిగి తపము చేయుట. ఇంద్రుఁడు భీతిల్లి రంభను బంప నెంచుట.

కం.	పూర్ణము కా వే సమ ల
భ్యర్ణము జేరిరి మునికిఁ దపః ఫల మిడ సౌ
వర్ణ ప్రభా విలసిత కృ
పార్ణవ సురు లజునిఁ గూడి యానందమునన్	1.

ఆ.వె.	నళిన సంభవుండు పలికె విశ్వామిత్రుఁ
జేరి మధుర గిరలు స్వీయ కర్మ
ముల శుభముల భద్ర మలరు స్వార్జితముగ
నైతి వీవు ఋషివి యాదరముగ	2.

ఆ.వె.	త్రిదివ మేఁగెఁ బలికి దేవేశుఁ డివ్విధిఁ
దిరిగి యంతఁ దపము తిరిగి గాధి
జుండు చేయఁ దొడఁగెఁ జుమ్మి విశ్వామిత్ర	3.

ముని ఘనతర తేజుఁ డనిల నిభుఁడు

కం. దివసమ్ములు కొన్ని చన న
తివ మేనక యచ్చర దమిఁ దీర్థం బా పు
ణ్యవిశేష పుష్కరమ్మున
కు వచ్చి తా స్నాన మాడఁ గోమలి నృవరా! 4.

ఆ.వె. కాంచె నప్సరసను గాధి సుతుఁడు మహా
తేజుఁ డభ్ర మందు దీపితంపు
మెఱపు వంటి దాని మేనక నసమాన
రూప నచట ముని వరుండు ప్రీతి 5.

చం. కని మద నాతు రాత్ముఁ డయి కౌశికుఁ డామెను మేనకా సతిన్
ముని వృషభుండు పల్కె రతి ముద్దియ! స్వాగత మప్సరోమణీ!
తనరి మదాశ్రమ ప్రచుర ధామ నివాసము నెంచుమా మదిం
గొను దయ నంగ జార్తు నను గొమ్మరొ! నీ కగు భద్ర మింపుగన్ 6.

చం. అన విని చేసె వాస మట నచ్చర యన్నుల మిన్న యింపుగం
జనె నివసింప నప్సరస చక్కఁగ వర్ష దశమ్ము లచ్చటన్
ఘనముగ సంతస మ్మలరఁ గౌశికు నాశ్రమ మందు రాఘవా!
యనవరతమ్ము సౌఖ్యముల నవ్వనితా మణి ముంచ సంయమిన్ 7.

మ. చనినం గాలము సిగ్గు గల్గ మది విశ్వామిత్రుఁ డుద్వేగియై
ఘన చింతా కలి తాంతరంగుఁడు మహా కామాంధతా తప్తుఁ డై
తినె యే మందుఁ దపంపు భంగమున కీ దేవాలి కౌటిల్యమే
కన నిక్కార్యము నాఁ దలంచి మదినిం గాకుత్స్థ రోషమ్మునన్ 8.

ఉ. రేలు దివమ్ము లెల్లఁ జన లీల గతించె దశాబ్దముల్ వడిం
గ్రాలితిఁ గామ మోహమునఁ గల్గెను ఘోరపు విఘ్న మివ్విధిం
గాల వశుండ నైతి నని కౌశికుఁ డార్తిని నిశ్వసించి తా
నా లలితాంగి భీతిలుచు నంజలి నుండగఁ గాంచి యచ్చరన్ 9.

తే.గీ. తియ్యని పలుకులు పలికి దేవ కాంత 10.

మేనకను విడనాడెను దా నరిగెను
గుశిక వంశజుఁ డుత్తర దిశపుఁ బర్వ
తమున కంత రఘువరేణ్య! తాపసుండు

ఆ.వె. పూని నైష్ఠికంపు బుద్ధి జయింపఁ గా
మమ్ము నిఁక యశస్వి నెమ్మిఁ జేరి
కౌశికీ తటి వడిఁ గౌశికుం డొనరించె
ఘోర తపము దా నకుంఠితమ్ము 11.

ఆ.వె. అంత వర్షములు సహస్రము లతి ఘోర
ముగ నుదీచి గిరిని ముని వరేణ్యుఁ
డడరి తపము సేయ నాదిత్యులకు భీతి
కలిగె మిక్కుటముగఁ గలఁత రామ! 12.

తే.గీ. చేరి సుర లందఱును ముని శ్రేణిఁ గూడి
తలఁచి రివ్విధముగ సమ్మతమ్ము చుమ్మి
యిచ్చిన మహర్షి పద మిఁక నీతనికిఁ గు
శిక తనూజున కీ ముని శ్రేష్ఠున కని 13.

కం. విని దేవతల పలుకు లె
ల్లను లోక పితామహుండు బ్రహ్మ ముదం బా
ర నలినజుఁడు విశ్వామి
త్రుని తోడఁ దపస్వితో మధురముగ ననియెన్ 14.

ఆ.వె. స్వాగతమ్ము సుత! మహర్షి! మెచ్చితి నీ త
పమ్మునకు మహత్వ పదము ఋషుల
నీ కొసఁగితి నేను నెమ్మినిఁ గౌశిక!
సంతసింపు మింక చింత వీడి 15.

ఆ.వె. సంతసమ్ము గాని చింత యేనియు సుంత
కౌశికునకు లేదు కమల గర్భు
మాటల విని నంత మాన్య మహర్షికి
సర్వ లోక విభు వచనము లయిన 16.

కం. అంజలి ఘటించి నతు లిడి
కంజునకుఁ బితామహునకు గౌరవ మొప్పన్
మంజు వచనమ్ములఁ గుశిక
సంజాతుఁడు పల్కె నిట్లు సంయమి వరుఁడే 17.

తే.గీ. స్వీయ శుభకర్మముల గ్రహించితి నతుల మ
హర్షి శబ్ద మనఁగ దేవ యనుకొనంగఁ
దగునె యింద్రియములను నేఁ దగ జయించి
తి నని చిత్తము హర్షింపఁ దెల్లముగను 18.

కం. అనఁ గాదని బ్రహ్మ పలికి
మునివరుతోఁ దప మొనర్పుము మునీంద్ర! జయిం
ప నెడఁద నెంచినఁ దథ్యము
గను నీ యింద్రియముల నని కంజుం డేఁగెన్ 19.

కం. చన నలువ సుర గణము తో
డను విశ్వామిత్ర ముని యడరి యాధార
మ్మును లేక యూర్ధ్వ బాహుం
డు ననిల మానుచుఁ దపము పటువుగాఁ జేసెన్ 20.

చం. నిలఁబడి యేను వహ్నులకు నిత్యము మధ్య నిదాఘ వేళలన్
నిలఁబడి నింగి క్రిందుననె నిత్యము వారక వాన వేళలన్
సలిలము నందు నిల్చి తమిఁ జక్కఁగ రే పవ లెల్ల సీతునం
జలిపెను వేయి యేం డ్లటులు సంయమి ఘోర తపమ్ము వింతగన్ 21.

కం. ముని విశ్వామిత్రుఁడు తప
ము నప్పగిదిఁ జేయ ఘోరముగ గలవర మ
య్యెను సురగణమ్మునకు నిం
ద్రునకు భృశమ్ముగ నపుడు సరోరుహ నయనా! 22.

కం. కని యప్సరసను రంభను
ఘనులు మరుత్తుల యుతము నగద్విషుఁ డనియెన్ 23.

మినుకులు హితమ్ములు సురల
కు నహితములు కౌశికునకు గుబులు చెలంగన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నలువది మూడవ సర్గము.

# బాలకాండము

# సర్గము 64.

ఇంద్రు నాజ్ఞఁ దపోభంగము సేయ వచ్చిన యప్సరస రంభను చిరకాలము శిలగాఁ బడియుండ
మని శపించి యొక విప్రోత్తమునిచే శాప విమోచన మగు నని యనుగ్రహించుట, తిరిగి వేయేండ్లు
ఘోరముగాఁ దప మొనరింప దీక్ష వహించుట.

కం. అమర శుభ కార్యము గలదు
విమలా! రంభా! మునీంద్రు విశ్వామిత్రున్
భ్రమపఱచి కామమోహ వ
శమందుఁ గూల్ప వలయుఁ జుమి సముచిత రీతిన్ 1.

కం. సుత్రాముని పల్కులు విని
యాత్రమ్ముగఁ బ్రాంజలి యయి యచ్చర లజ్జన్
గోత్రారితోఁ బలికె మృగ
నేత్ర ప్రతి వచనము లిట్లు నీరజనేత్రా! 2.

కం. సురనాథ! యీ మహాముని
వర విశ్వామిత్రుఁ డూను బరమామర్ష
మ్మరయంగ నన్ను నవ్విధి
నరయను సందేహ మిందు నావం తైనన్ 3.

కం. అదియే నా భయ మమర గ
ణ దేవ! పేధించుఁ గరము నన్నిట మది లో 4.

న దయం జూపుమ నా పయి
సుదతి యనఁగ భీతి నిట్లు సురపతి రామా!

కం. కని రంభ నంజలించిన
వనిత భృశార్తను నగారి పలికెను భద్ర
మ్ము నరయుదు భీతిలకు నుడి
విన కార్యమ్ము నొనరింపు ప్రీతిని రంభా! 5.

ఆ.వె. మనసును హరియింపఁ దనరు కోకిల రూప
మున వసంత వేళ ముసురఁ జారు
తరువుల నడుమ నల మరుఁ డుండ నా తోడ
నీదు చెంత నుందు నీరజాక్షి! 6.

ఆ.వె. అందమైన రూప మడరఁ జేసి వెలుఁగు
లీన నీవు పరమ ఋషినిఁ జేరి
కౌశికునిఁ దపః ప్రకాశుని భేదింపు
తపము రంభ! మూరి తరళనయన! 7.

ఆ.వె. అవ్వచనములు విని యత్యుత్తమంపు రూ
పము ధరించి రంభ వదన మందు
నవ్వులరఁగ నంత నాతి విశ్వామిత్రు
లోభపఱుపఁ జాగె శోభఁ జూపి 8.

తే.గీ. మధుర మైన కోకిల కంఠ మంజు సుస్వ
నమ్ములు వినిపింప నిజ మనమ్ము రంజి
లంగఁ గరము విశ్వామిత్రుఁ డంగన నటఁ
గాంచెఁ గన్నులు తెఱవంగఁ గట్టెదుటను 9.

ఆ.వె. సంశయమ్ము కలిగె సన్మునికి విని నం
త మధురస్వన ముచితంపు గాన
మింక రంభ యునికి యంకము నందట్టు
లరయ డెంద మందు నబ్బురముగ 10.

కం. ఎఱిఁగి సహస్రాక్షుని యా
వెఱ పెఱుఁగని దుష్కృతమ్ము విశ్వామిత్రుం
డఱిముఱిఁ జెలంగఁ గోపము
తఱచై యా రంభ కొసగెఁ దగు శాపమ్మున్ 11.

తే.గీ. ఇల జయింపఁ గామక్రోధములను గోరు
పురుషు లోభపఱుప నెంతువు నను నీవు
రంభ! దుర్భాగ్యురాల! శిల వయి నిల్తు
వింక వేయేండ్లు ధాత్రిని శంక లేక 12.

ఆ.వె. విప్రుఁ డొకఁడు లోక వినుత తపస్వి మ
చ్ఛాప దూషిత నిను జామ! యుద్ధ
రించు నంత రంభ! యంచితముగను ద
పోబలమ్ము చేత ముదము నొసఁగ 13.

కం. అని యిట్లు మహాతేజుఁడు
ముని విశ్వామిత్రుఁడు మనమున క్షోభించెం
దన కోప మాపఁ జాలని
తనముం జింతించి యంతఁ దద్ద రఘువరా! 14.

ఆ.వె. పెద్ద ఱాయి యయ్యెఁ బెను శాపమున రంభ
విని ముని గిర లెల్ల వెఱచి మన్మ
థుండు దేవపతియుఁ దూర్ణ మేఁగిరి నిజా
లయములకుఁ బరుగున రఘువరేణ్య! 15.

తే.గీ. కోపమున మహాతేజుని కుశికపుత్రు
తపపు హరణపుఁ గతన సంతప్తుఁ డయ్యె
నమ్ముని యజితేంద్రియుఁ డయ్యె నంత నిజ మ
నమ్మున నశాంతుఁ డయ్యెను జుమ్మి రామ! 16.

ఆ.వె. పోవ నిజ తపమ్ము మునిప విశ్వామిత్రుఁ
డెడఁదఁ జింత నంది యెన్నఁ డలుగ
నింక నెన్నఁ డేని నేను బలుక కుందు 17.

నంచు నిశ్చయించి యాతఁ డింక

ఆ.వె. తలఁచె మఱియు నిట్లు దా నూపిరిఁ గొనక
వంద యేండ్లయినను బరఁగి యింద్రి
య జయ మరయ నెంచి యంగమును గృశింపఁ
జేయు చుందు నంచుఁ జింత తోడ 18.

తే.గీ. బ్రాహ్మణత్వము నేఁ బొందు వఱకు స్వార్జి
త తపము వలన శ్వాస నింతయును దీయ
కయు నశన మింతఁ గుడువక కాల మెంత
గడచినను నిల్చి యుందును గాఢ ధృతిని 19.

తే.గీ. తపములో నుండ క్షయము నొంద వవయవము
లెల్ల నావి యని తలఁచి యింపుగ వెయి
యేండ్లు దీక్ష నుండఁ బ్రతిన నెలమిఁ జేసెఁ
గౌశికుఁడు మునీంద్రుఁడు రామ! కఠినముగను 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది నాల్గవ సర్గము.

## బాలకాండము

## సర్గము 65.

విశ్వామిత్రుఁడు వేయేండ్లు ఘోరమైన తపము సేసి జితేంద్రియుఁడై బ్రహ్మదేవునిచే బ్రహ్మర్షి పదవి
నంది వసిష్ఠని చే సమ్మతింపఁ జేసికొని తపము చాలించి వసిష్ఠునిఁ బూజించుట. జనకునిచేఁ
బూజింపఁబడి రామలక్ష్మణులతో వసతిగృహమున కేఁగుట.

కం. శీతాద్రి దిక్కు వదలి మ
హా తాపసి కౌశికుఁడు వరైంద్రికిఁ జని రా
మా! తపము దారుణమ్ముగ 1.

వీతామర్షమ్ముఁ సేసె విద్యోతముగన్

కం. మౌనము నూని సహస్ర స
మా నిచయము ఘోరముగ సమంచిత బుద్ధిం
దా నాచరింపఁ జాగె న
హో నిష్ఠఁ దపము మునివరుఁ డుత్సాహముగన్ 2.

ఉ. నిండఁగ వేయి యేండ్లు మునినిం గృశునిం గడు పెద్ద విఘ్నము
ల్మెండుగ నావహించినను గ్లేశము నొందఁడు దా నొకింతయున్
దండిగ నిశ్చయించి మది దారుణ మైన తపంపు దీక్షలో
నుండును సంతతమ్మును మహోన్నత మానస ధీవరుండునై 3.

తే.గీ. ఆతని సహస్ర వర్ష వ్రతాంత మందు
నన్న మింత విశ్వామిత్రుఁ డాన సెంచి
యున్న తరుణమ్ముఁ నందు రఘూత్తమ! యరు
దెంచి యన్నము ద్విజుఁ డయి యింద్రుఁ డడిగె 4.

ఉ. అన్నము సిద్ధ మైనది ధరామరుఁ గాంచి యొసంగె ధీరతం
గ్రన్నన శేష మించుకయుఁ గానక యుండెఁ దపో విశిష్ట సం
పన్నుఁ డభుక్తుఁడై మఱియుఁ బల్కఁడు విప్రుని తోడ నెద్దియుం
బన్నుగ నూనె మౌనమును శ్వాసను వీడి సహస్రవర్షముల్ 5.

తే.గీ. విరహి తోచ్ఛ్వాసు తల నుండి వెల్వడుచును
ధూమరాశి వ్యాపించెను ద్యో తలమ్ముఁ
నందు నెల్లెడ ముజ్జగ మందు మంట
పెట్టి నట్లు భీతిఁ గొలుప బెట్టిదముగ 6.

తే.గీ. దేవ రాక్షస గంధర్వ దివ్య పన్న
గోర గాదులు నిజ కాంతు లాఱ మోహి
తు లయిరి తపః ప్రభావ మతులము పరఁగ
మూరి నజునితోఁ బల్కిరి ముఖము లిట్లు 7.

ఆ.వె. చూప నాశ లడరి కోపింప యత్నింపఁ 8.

టెక్కు భంగు లకట వీస మైన
దోస మెద్ది తోఁపదు మునీంద్రు నందుఁ ద
పమ్ము వృద్ధి సెందుఁ బమ్మి కరము

కం. పాపము సుంతయు మునిలో
తోఁపదె యీ కున్నఁ గోర్కి దుస్సహ తపమే
యోపును లోకమ్ముల నౌ
రా పరిమార్ప సచరాచరము నిక్కముగన్ 9.

చం. కన దిశ లెల్లఁ దప్తములు కాంతి విహీనము లయ్యె నక్కటా
యనయము గాంచ క్షోభితము లంబుధు లన్నియు మిక్కుటమ్ముగన్
ఘనముగఁ బృథ్విని౦ జెలఁగెఁ గంపనముల్ గతి నేర కుంటిమే
యనిలము వీచె నుద్ధతిని నబ్జజ! నాస్తికు లుద్భవింతురో 10.

తే.గీ. ప్రజలు ముల్లోకముల యందు వ్యాకులమున
మూఢు లట్టుల నున్నారు గాఢ మైన
తపపుఁ గాంతి సూర్యుని కాంతి తగ్గె నకట
పద్మసంభవ! మునివరు ప్రభలు మించె 11.

తే.గీ. అగ్ని రూపుఁడు ప్రభ లందు నాత్మఁ దలఁచు
వఱకు సర్వనాశ మొనర్ప వాని నింపు
గా ననుగ్రహింప నిపుడు కార్య మగును
దేవ! యిమ్మహామునిని గాధి సుతు నెలమి 12.

కం. మును ముల్లోకములం గా
ల్చిన కాలాగ్ని వలెఁ గాల్పఁ జెల్లును జుమ్మీ
ముని దేవ రాజ్య మడిగిన
ను నీయఁ దగుఁ గౌశికునకు నుత సంయమికిన్ 13.

కం. అంత నలినజుని మున్నిడి
చెంతకుఁ జేరి యమరులు కుశిక నందనుతో
నంత మరసి తపమునకున్
సంతసమున దియ్యనౌ వచనము లని రిటుల్ 14.

ఆ.వె. స్వాగతమ్ము నీకు బ్రహ్మర్షి! యానంద
మాయె భృశము మాకు నంది తీవు
పరమ తపపు మహిమ బ్రాహ్మణ్య మిప్పుడు
స్వార్జితముగ నింక సముచితముగ 15.

తే.గీ. ఇత్తు దీర్ఘాయువును బ్రాహ్మ ణేంద్ర! యీ మ
రుద్గణమ్ములఁ గూడి సురుచిర భద్ర
మగును బొందఁ గలవు స్వస్తి యరుగు మింక
సౌమ్య! సుఖముగ వలసిన చంద మెలమి 16.

కం. పలుకులు పితామహునివి స
కల దేవతలవి విని ముని కౌశికుఁ డెద లో
నలరి మిగుల వందనములు
పలికి యరసి వారి ననియె వచనము లిట్లున్ 17.

మ. అన మీ రిట్టులు నాకు దక్కె నని బ్రాహ్మణ్యమ్ము దీర్ఘాయువుం
ఘన వేదమ్ములు సమ్మతించునె వషట్కారమ్ము నోంకారముం
గనుఁడీ యవ్విధి నుండు నట్టుల దయన్ క్షాత్రశ్రుతి బ్రహ్మ వే
ద నికాయజ్ఞుఁడు నా వసిష్ఠుఁడు ననుం దా నట్లుఁ బిల్వం దగున్ 18.

ఆ.వె. శాంతిపఱుప నమరు లంత వసిష్ఠుఁడు
ముని వరుండు కౌశికుని సమీప
మునకు వచ్చి స్నేహముం జేసి పలికె బ్ర
హ్మ ఋషి వీ వనుచు ముదావహముగ 19.

తే.గీ. అంతయుఁ దగ సిద్ధించు బ్రహ్మర్షి వీవు
సంశయం బించుకయు లేదు సంయ మీంద్ర!
నాఁ బలికి సుర వరులెల్ల నాకమునకుఁ
జనిరి సంతస మలరంగ స్వాంతములను 20.

ఆ.వె. పొంది కౌశికుండు మూరి బ్రాహ్మణ్య మా
రీతి నంత బ్రహ్మఋషి వసిష్ఠుఁ 21.

బూజ సేసెను ముదమునను విశ్వామిత్రుఁ
డు తగ బ్రహ్మఋషి వినుత యశస్వి

కం. కృత కామియై తపసునన్
స్థితుఁడై ధర సంచరించెఁ జిత్తం బలరన్
స్తుతమతి శ్రమించి యివ్విధి
నితండు బ్రహ్మర్షి యయ్యె నినకుల రామా! 22.

తే.గీ. ఇతఁడ మునివరుం డితఁ డగు సుతప మునకు
మూర్తిమంతుఁ డితఁడె ధర్మ మూర్తి నిత్య
మెంచఁ దాపసుల కితఁడ యెన్న లక్ష్య
మగును రఘురామ! తామరసాక్ష! నిజము 23.

తే.గీ. విప్రుఁ డా శతానందుఁడు విశ్రమించె
నంత వచియించి యీ రీతి చెంత నుండి
రామ లక్ష్మణులకు విని ప్రాంజలి యయి
పలికె మిథిలాధిపతి గాధిపట్టి తోడ 24.

ఆ.వె. ధన్యుఁడ నయితిఁ దమ దయ నందితి ముని వ
రేణ్య! రాఁగ రఘు వరేణ్యుల సహి
తమ్ము నా సవన వరమ్మును వీక్షింప
మీరు ధార్మిక వర! గారవమున 25.

కం. మీ దర్శనము పునీతుని
గాఁ దనరిచె నను మునీంద్ర! యానందదమై
మీ దర్శన మాత్రమ్మునఁ
బొదుకొనెను గుణము లార్య! బహు పద్ధతులన్ 26.

ఆ.వె. విస్తరముగఁ జెప్ప వింటిని మీ గొప్ప
తపము కీర్తితం బనుపమ మెన్న
రాముఁడును వినంగ నో మహాత్మా! దివ్య
మైన నీదు గాథ వీను లలర 27.

తే.గీ. మీ తపం బప్రమేయము మీ బలమ్ము
నప్రమేయము గుణములు నప్రమేయ
ములు సుమి కుశికాత్మజ! సతము సదసునకు
వచ్చిన సదస్యులు వినిరి యచ్చెరువున 28.

ఆ.వె. తనివి తీర దెంత తడవు వినిన నద్భు
తంపుఁ గథలు మీవి తాపసేంద్ర!
కర్మ కాల మయ్యె ఘర్మగభస్తియుఁ
జాగెఁ బశ్చిమాద్రి సంయమీంద్ర! 29.

ఆ.వె. ఎల్లి రేపకడ మునీంద్ర కాంచ నగును
నన్ను స్వాగతమ్ము నా కనుజ్ఞ
నిమ్మ కృప వహించి సెమ్మిఁ దేజోమయ!
యంచు వేఁడ జనకుఁ డంచితముగ 30.

కం. అన విని విశ్వామిత్రుఁడు
జనకుఁ బ్రశంసించి పురుష సత్తమునిఁ దగన్
మన మలరఁగ సంప్రీతుని
ముని వీడెను దత్క్షణంబ భూవరు నంతన్ 31.

కం. పలికి జనకుఁ డట్టుల నొ
జ్జలఁ గూడి ప్రదక్షిణమ్ము చక్కఁగ సంబం
ధుల తోడను జేసెఁ దమి మి
థి లాధి నాథుండు మునికి దేవ సమునికిన్ 32.

కం. మునివరుల పూజలం గై
కొని యా రాఘువులఁ గూడి కుశికాత్మజుఁ డం
త ని జావాసమ్మున కేఁ
గెను విశ్వామిత్రుఁ డెలమిఁ గీర్తింప జనుల్ 33.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది యేనవ సర్గము.

## బాలకాండము

## సర్గము 66.

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులు విల్లును వీక్షింప వచ్చిరని జనకునకుఁ జెప్పఁగ నా రాజు శివ ధనుస్సును దాను బొందిన విధము నెల్ల నుడివి రాముఁడు విల్లు నెక్కుపెట్టఁ గలిగిన నాతనికిఁ దన పుత్రిక సీత నిచ్చి వివాహము సేసెద నని వచించుట.

కం. తెలవాఱఁ బ్రభాతమున వి
మలమునఁ గృత కర్మ భాసమానుం డంతం
బిలిచెను విశ్వామిత్రుని
నిలాపతి సరాఘువ యుగు నింపుగ భక్తిన్ 1.

కం. జనక నృపతి ధర్మాత్ముఁడు
ముని విశ్వామిత్రు రాజ పుత్రుల నామ్నా
య నియతిఁ బూజించి మహా
త్ముని గౌశికుఁ గాంచి పలికె ముదమున నంతన్ 2.

కం. స్వాగత మో దేవా! నీ
వే గతి కార్యమ్ము గోరు దిమ్మానతినిన్
వేగం బాజ్ఞార్హుఁడ నే
నో గురువర్యా! సభక్తి నొనరింప నిటన్ 3.

కం. విని ధర్మాత్ముని నా జన
కు నమ్మహాత్ముఁడు పలికెను గుశికాత్మజుఁ డం
త నృవీరుం గని వాక్యము
లను వాక్యజ్ఞుం డతి మధురమ్ముగ నిట్లున్ 4.

తే.గీ. వీ రిరువురు దశరథ పృథ్వీశ పుత్రు
లసదృశులు జగద్విశ్రుతు లవని నాథ!
ఘనులు సుక్షత్రియులు నీదు కడ గలట్టి
గొప్ప వింటిఁ గాంచఁగ వచ్చి రిప్పురుషులు 5.

తే.గీ. భద్ర మగు నీకు రాజేంద్ర! పరమ ధనువు
వీరి కింపుగఁ జూపింపఁ దీర వీరి
కోరిక యెలమి మది నంది కోరి నట్టి
చోటునకు నేఁగఁ గలవారు సుమ్మి వీరు 6.

ఆ.వె. మునివరేణ్య పల్కులను విని జనకుండు
బదు లొసంగె నిట్లు మృదు ఫణితుల
నుడివెద వినుఁ డా ధను విచట నున్న కా
రణము నెల్లను వివరమ్ముగాను 7.

తే.గీ. కలఁడు దేవరాతుఁ డనఁగ ఖ్యాతిఁ బడసి
రాజు నిమికి నాఱవ వాఁడు తేజ మలర
వాని హస్తము నందుంచెఁ దాను గుదువ
నా మహాదేవుఁడు మహాత్ముఁ డార్య! విలును 8.

తే.గీ. మున్ను దక్ష యజ్ఞక్షయము నొనరించి
నప్పు డలుక రుద్రుఁడు గాంచి యమర గణముఁ
బలికె భీషణ వాక్కులు వారి తోడ
ధనువు నెత్తి హస్తమ్మున దారుణమును 9.

ఆ.వె. స్వీయ భాగములను స్వీకరింపఁగ నుత్స
హించి త్రిదశులార యుంచ రకట
నాదు వంతు మీరు నఱకెద వింటి చే
మీ వరాంగములను జేవ మీఱ 10.

కం. విమనస్కులై యమరు లె
ల్ల మునీంద్ర! శరణము వేఁడ రాజధరుఁడు ప్రీ
త మనస్కుఁ డయ్యె భవుఁ డా
యుమా ధవుండు కరుణా పయోనిధి యంతన్ 11.

చం. ముదమున చంద్రశేఖరుఁడు ముచ్చట నిచ్చె ధనుస్సు నంత నా
త్రిదశుల కుంచ భద్రముగ దిగ్వసనుండు త్రినేత్రుఁ డిచ్చినం 12.

బదపడి న్యాస భూతముగ వారలు దాని నొసంగి రింపుగా
మ దుచిత వంశపూర్వునకు మౌనివరా! యిది గాంచ నయ్యదే

తే.గీ. దున్ను చుండ క్షేత్రము నేను దొరకె నాకు
బాల యొకనాఁడు నాఁగటి చాలు నందు
క్షేత్ర శోధన మడరంగ సీత యన్న
నామ మందు విశ్రుత యయ్యె నామె ధరను 13.

ఆ.వె. భూతలమ్ము నుండి పుట్టి వర్ధిల్లెను
నా తనయగ మించి సీత తా న
యోనిజ పెరుఁగంగ యోచించితిని వీర్య
శుల్కము పడుచునకు సురుచిరముగ 14.

ఆ.వె. పుడమిఁ బుట్టి మఱియు నడరి వర్ధిల్లు నా
తనయఁ గాంచి వచ్చి తాపసేంద్ర!
రా కుమారులు కడు వీఁక వరించిరి
పరిణయమ్ము నెంచి తరుణి తోడ 15.

తే.గీ. వీర్యమును శుల్కముగ నెన్నఁ గార్య మంచు
వారికి వరించి వచ్చిన పార్థివులకుఁ
బలికి కన్య నొసఁగ లేదు వారి కెవ్వ
రికినిఁ దాపస పుంగవ ప్రకటిత మతి 16.

ఆ.వె. స్వీయ శక్తి నిచట వీక్షింప శీఘ్ర మే
తెంచ రాజ సుతులు మించి కలసి
యెల్ల రుత్సహించి యుల్లమ్ము లలరంగ
మిథిల కపుడు సంయమి వర గణ్య! 17.

ఆ.వె. స్వీయ బాహు వీర్య జిజ్ఞాసుల కొఱకు
ధనువును గొనితేరఁ దత్క్షణమ్ము
వా రకట గ్రహింప నేరక యెత్తఁగ
లేక నిలిచి రెడఁదఁ బ్రాఁక సిగ్గు 18.

కం. తెలియఁగ వీర వరులలోఁ
గల వీర్యం బల్ప మని ప్రకటముగ విను వా
రల నేఁ దిరస్కరించితి
లలితమ్ముగ మునివరేణ్య! రాజాత్మజులన్ 19.

ఆ.వె. కోప మావహింప భూపతులకు నంత
సందియమ్ము వారి శక్తిఁ గలిగి
ముట్టడించిరి నిజ పురము మిథిల నెల్ల
వారు మునివరేణ్య పగ వహించి 20.

కం. అవమానింపఁ బడి రనుచు
నవని పతులు దల్చి మనము లందుఁ గినుకతో
నవియ హృదయమ్ములు మిథిల
ను వెతల పాల్సేసి రత్యనుచిత విధములన్ 21.

చం. కడవఁగ నొక్క యేఁ డటులఁ గాఱియ నిండు కొనంగ వస్తువుల్
వడసితి దుఃఖ మగ్గలము స్వాంతము నందు మునీంద్ర! యత్తఱిం
గడఁగి తపమ్ము సేసి సురకాయము నెమ్మి నుతింపఁగా దయన్
వడి చతురంగ సైన్యమును బన్నుగఁ బంపిరి నాకుఁ దోడుగన్ 22.

తే.గీ. వీర్య హీనులు మఱి నిజ వీర్య సంశ
యులు నృపతు లెల్ల శీఘ్రమ యుద్ధ భగ్న
హన్యమాను లయి సమంత్రు లాశలకుఁ బ
రువులు పెట్టిరి పాపకర్ము లడలి కడు 23.

ఆ.వె. అట్టి కాంతిమంత మైన యా ధనువును
రామలక్ష్మణులకు నో మునీంద్ర!
సువ్రతా! ముదముగఁ జూపింపఁ గలవాఁడ
వారి కోర్కి దీర వలయు మఱియు 24.

ఆ.వె. విల్లు నెక్కు పెట్ట విజయుండు రఘురాముఁ
డైన మునివరేణ్య! నేను నా త
నయ నవనిజ సీత నారీమణిని నిత్తు 25.

దాశరథికి మది ముదమ్ము మీఱ

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది యాఱవ సర్గము.

## బాలకాండము

## సర్గము 67.

రఘురాముఁడు శివధనుస్సును గరమున గ్రహించి నారి సంధింప నా విల్లు పెల్లున విఱిఁగిన జనకుఁడు సంతోషించి విశ్వామిత్రుని యనుజ్ఞతో మంత్రులను దశరథ చక్రవర్తి నాహ్వానించి తోడ్తేర నాదేశించుట.

కం. జనక విభు భాషణమ్ములు
విని విశ్వామిత్రుఁ డవని విభువరుతోఁ బ
ల్కెను మిథిలాధీశా! ధను
వును జూపుమ రామున కని పుణ్యాస్త్రమ్మున్ 1.

తే.గీ. అంత జనకుఁ డాదేశించె సంతసమున
మంత్రులను దివ్యతమ ధనుర్మణిని గంధ
మాల్య సువిభూషితమ్మును మానితమును
దీసికొని రావలయు నంచు భాసితమును 2.

కం. జన కాజ్ఞం జని సచివులు
జనక పురికి నా పటు వగు చాపముఁ దమతోఁ
గొని శీఘ్రమ్ముగ వారలు
సనుదేరం జాగి రంత సముచిత రీతిన్ 3.

చం. నరులు మహా బలాఢ్యులు సనాద సుదీర్ఘ శరీరు లింపుగా
నరుగఁగ నైదు వేల భటు లాయత బాహులు లాగుచుండి భీ
కరమును లోహపుం బదరికమ్మున నుంచిన చాప రాజమున్ 4.

గురుతర బాధ కోర్చి యటకుం దమిఁ జేరిరి యెట్టకేలకున్

తే.గీ. ఇనుప పెట్టెలోఁ బెట్టిన ఘన ధనుస్సు
ను గొనితెచ్చి యమాత్యులు తగఁ బలికిరి
సుర సమాను మహాతేజు నరసి రాజ
సత్తముని నతు లొనరించి సమ్మదముగ 5.

కం. ఇది యా కార్ముక రత్న
మ్ము దేనిఁ జూపింప నీవు పూనితి నృవరా!
సదమల చిత్త! సకల రా
ట్సదర్చితము సన్నుతమ్ము సద్గుణధామా! 6.

కం. విని వారి భాషణములను
ముని విశ్వామిత్రుని రఘుపుత్రద్వయముం
గని కరముల నుంచి నుదుట
జనకుఁడు రాజర్షి యనె వచనముల నిట్లున్ 7.

ఆ.వె. ఈ ధనుర్వరమ్ము గాధేయ! జనకుల
చేతఁ బూజితమ్ము శ్రేష్ఠ వీరు
లు నృప పుంగవులును మును దగఁ బూరింప
మూరి వా రశక్యు లైరి దేవ! 8.

చం. సురలును రాక్షసాసురులు శూర వరోరగ యక్ష వీర కి
న్నర గణ దేవగాయనులు నైపుణ హీను లనంగ నెత్తఁగా
నరిఁ దగఁ గూర్ప లాగఁగ మహాత్ములు మోయఁగ దాని నక్కటా
నరులను పేఱ గాధి వరనందన! చెప్పఁగ నేల యిచ్చటన్ 9.

ఆ.వె. అట్టి పెల్లు విల్లుఁ బెట్టితి మిచ్చటఁ
గోరి నట్టి రీతి కుశికపుత్ర!
రాజపుత్రలకుఁ గర మనురక్తిం జూపుఁ
డింక దీని సన్మునీంద్ర! యిపుడు 10.

కం. విని విశ్వామిత్రుఁడు జన 11.

కుని భాషితములను రామ! కోదండమ్ముం
గనుమూ వత్సా! యని ప
ల్కెను గాకుత్స్థుం గని ముని కేళీ లీలన్

కం. విని బ్రహ్మర్షి వచనములు
ఘన పేటికఁ దెఱచి ఘనుఁడు కాకుత్స్థుం డా
ధనువు నటఁ గాంచి గురు వ
ర్యునితోఁ బ్రీతిం బలికె సముచిత వచనముల్ 12.

తే.గీ. విల్లు దొడ్డది యిది దేవ! యుల్ల మలరెఁ
గాంచ దీని నబ్బురముగ మించి నేను
ముట్టఁ గోరుదుఁ జేతిని నట్టె యెత్తి
దీనిఁ బూరింప యత్నింతు మౌనివర్య! 13.

ఆ.వె. మంచి దనిరి రాము మాటల నాలకిం
చి పుడమి పతియు మునిశేఖరుండు
ముని వచనములు విని మూరి పట్టె ధనువు
నడుమ లీలఁగాను నరవృషభుఁడు 14.

తే.గీ. నరులు పేవురు వీక్షింప నర వరుండు
రఘుకుల తిలకుండు సలీల రాముఁ డంత
నారి సంధించె ధను వెత్తి నలిన నేత్రుఁ
డెలమి ధర్మాత్ముఁ డానంద మెడఁద నిండ 15.

మ. అరి సంధించి నరోత్తముండు ఘన ధర్మాత్ముండు పూరింప నా
వర కోదండము మధ్యలో విఱుగ శబ్దం బయ్యె నిర్ఘాత సు
స్వర తుల్యంబుగఁ గంపనమ్ము లిలఁ గన్పట్టెన్ సు ఘోరమ్ముగా
గిరి సంఘాతము ముక్కలయ్యెఁ గడు సంకీర్ణమ్ములై యెల్లెడన్ 16.

తే.గీ. కూలిరి పుడమి మూర్ఛిల్లి ఘోర మైన
శబ్దముల నాలకించి యశని నిభముల
నెల్ల నరులు రాఘవులు మునీంద్రుఁ డింక
రాజు దక్కంగ నచ్చట రాళ్ల పగిది 17.

ఆ.వె. తేఱుకొనఁగ జనులు ధీనిధి పతి భీతి
దొలఁగ వాక్యవిదుఁడు దోయిలి ఘటి
యించి వాక్యములు మునీంద్రుని వీక్షించి
పలికె నింపు కొలుప నలరి యంత 18.

తే.గీ. దేవ! కంటి రాముని వీర్య మీ విధముగ
దశరథాత్మజుని బల మత్యద్భుతం బ
చింత్య మింక ననూహ్యము చేవఁ గాంచ
సంతసం బయ్యె మిక్కిలి సంయమీంద్ర! 19.

కం. జనక కులకీర్తిఁ బెంచును
ఘనముగ నాదు సుత సీత కర మంది మహా
త్ముని రాముని దశరథ నం
దనుని యెలమి సంయమీంద్ర! తత్పరత వెసన్ 20.

తే.గీ. నా ప్రతిన వీర్యశుల్క మనంగ నయ్యె
ది నిజ మయ్యెఁ గౌశిక! ఘన మునివరేణ్య!
ప్రాణ సమను సీతను సుత రామునకు నొ
సంగ వలయు నిశ్చింతగ సంతసమున 21.

కం. మీ యనుమతి నా మంత్రులు
వే యరుగ నయోధ్య కిండు ప్రీతిని మీ ర
ట్లీయఁగఁ బంపుదు రథముల
నాయతముగ భద్ర మగు మహాత్మా! మీకున్ 22.

తే.గీ. వీర్యమునకుఁ గానుక సీత వీరవరుఁడు
రామున కొసంగుట పలికి రమ్య రీతి
నెల్ల నిఁకఁ బ్రీతి భాషల నెలమి రాజుఁ
దోడితెత్తురు మిథిలకుఁ దూర్ణ మార్య! 23.

ఆ.వె. రామలక్ష్మణులు వరముని గుప్తు లనియు
దశరథునకుఁ దెలిపి ధరణి పతికిఁ 24.

బ్రీతి నొంది నట్టి పృథివీపతినిఁ గొని
తెత్తు రిటకు వేగ దేవ! మీఱి

కం. ముని యట్లె యనఁగ నరపతి
తన మంత్రుల సంప్రదించి ధర్మాత్ముఁడు పే
పనిపె నయోధ్యకు సచివుల
ను నుడివి కథ నెల్ల రాజును గొని మరలఁగన్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది యేడవ సర్గము.

## బాలకాండము

## సర్గము 68.

జనకుని యాజ్ఞతో దూత లయోధ్యకుఁ జేరి దశరథునితో రామలక్ష్మణులు విశ్వామిత్రు రక్షణములో
నున్న వారని, శివ ధనుర్భంగ వృత్తాంతము, జనకుని వీర్యశుల్క విషయ ప్రతినను దెలిపి
జనకాత్మజ సీతను రాముని కీయ దశరథుని యనుమతి జనకుఁడు కోరి మిథిలకు
నాహ్వానించుటను దెలిపిన దశరథుఁడు మంత్రులను సంప్రదించి యంగీకరించి మిథిలకు
మరునాఁడు ప్రయాణమును దలపెట్టుట.

కం. జనకుని యాదేశమ్మునఁ
జని దూతలు గడపి మున్నిశలు మార్గం బం
దు నలసిన గుఱ్ఱములతో
ఘనపుర రాజం బయోధ్యఁ గదిసిరి ప్రీతిన్ 1.

ఆ.వె. రాజ భవనమునకు నోజ దూతలు సేరి
ద్వారపాలకులను గోరి రిట్లు
జనక రాజదూత లని మమ్ముఁ దెల్పుఁడు
రాజనకు త్వరితము రాజ భటులు! 2.

తే.గీ. రాఘవునకు నివేదింప రాజ భటులు
రాజు ననుమతిఁ జేరిరి రాజగృహము
దూత లంతఁ గాంచిరి దేవ తుల్యు నా ద
శరథుని నృపతి వృద్ధుని సంతసమున 3.

తే.గీ. కేలు ముకుళించి దూతలు మేలి మాట
లిట్లు రాజు తోడఁ బలికి రింపు కొలుప
గౌరవముగ విగతభీతి వార లెల్ల
మధురమైన భాషణములు మంత్రు లరయ 4.

మ. మిథి లాధీశుఁడు ధీవరా! జనకుఁ డమ్మేధావి మిమ్మున్ మహా
రథ! క్షేమంబును వృద్ధినిం దమిని సంప్రశ్నంబు సుస్నేహపుం
బథ మూహించి పురోహితవ్రజ మహోపాధ్యాయులం గూడి యో
పృథివీశా! నిరతాగ్నిహోత్ర యుత! సంప్రీతమ్ము సేసెం దగన్ 5.

తే.గీ. అడిగి నిఃక్షోభము కుశల మవనినాథ
మునివరేణ్యుఁడు కౌశికు ననుమతిఁ గొని
జనకుఁడు మిథిలాధీశుఁడు చక్కఁగ వచ
నములు వైదేహుఁడు పలికె నయము లిట్లు 6.

తే.గీ. మున్ను నా చేసిన ప్రతిన కన్నియ కగు
శుల్క మది వీర్యమే యని సువిదతమ్ము
వీర్య హీనుల విడిచితిఁ బెల్లు కోప
మూని రెల్లరు రాజులు దాన రాజ! 7.

ఆ.వె. అట్టి నాదు తనయ నంత విశ్వామిత్రు
తో నరుగుచు నిచ్చ తోడ వచ్చి
రిటకు నీ తనయులు పటువీర వరు లందు
నగ్రజుఁడు జయించె నవని నాథ! 8.

కం. పెనువిల్లు దివ్య మయ్యెను
ధ్వనితో భగ్నము మహాత్ము బాహువు లందున్
జను లెల్లరు చూడఁగ రా 9.

మునిచే రాజేంద్ర! నడుమ ముచ్చట గొలుపన్

తే.గీ. సుతను సీతను వర వీర్యశుల్క నీయఁ
దగు మహాత్మునకు నరేంద్ర! దాశరథికిఁ
బ్రతినఁ బూరింప నెంతును బన్నుగా న
నుజ్ఞ నీయ నర్హులరు ధర్మజ్ఞ! మీరు 10.

కం. ఒజ్జలు పురోహి తాదిగ
సజ్జనులం గూడి రండు సముచితముగ వే
యిజ్జగతి భద్ర మగు మీ
కిజ్జనవర రాఘవులను నీక్షింపఁ దగున్ 11.

ఆ.వె. ప్రీతిఁ గూర్పఁ దగుదు పృథివీశ! తగ నాకుఁ
బ్రతిన నిజము కాగ రహి చెలంగు
పుత్ర యుగ్మముఁ గని ముదము నొందఁ గలవు
చిత్త మందు రాజ సత్తమ! కడు 12.

తే.గీ. అనుమతింప విశ్వామిత్ర ముని వరుండు
గొని శతానందు నభిమతమును విదేహ
రాజు పలికె నిట్టులు మధురపు గిర లని
ప్రీతి నాగిరి శంకతో దూత లంత 13.

కం. విని దూతల పల్కులు వొం
దెను బరమానందము నృపతి దశరథుం డి
ట్లనె వామదేవుని వసి
ష్ఠుని మంత్రుల నన్య జనులఁ జూచి వచనముల్ 14.

కం. ఘన కౌసల్యానందద
తనుండు కౌశికుని యండఁ దమ్ముఁడు సౌమి
త్రునితో విదేహ దేశ
మ్ము నందుఁ దమి నున్నవాఁడు పుత్రుం డెలమిన్ 15.

తే.గీ. వీర్య సుపరీక్షితుఁడు నరవర్య జనకు 16.

చేతఁ గాకుత్స్థుఁడు సుతను సీత నీయ
రామునకు నిష్ట పడుచుండె రాజవరుఁడు
సంతసమున మహాత్ముఁడు క్షత్రియ ఋషి

కం. జనకుని వృత్తము నచ్చిన
జననాథు మహాత్ముని దెదఁ జనెదము నగర
మ్మునకు పెస నేల కాల
మ్మును వ్యర్థము సేయ మనకుఁ బురమున కేఁగన్ 17.

తే.గీ. మంత్రులు మహర్షు లెల్లరు మంచి దనిరి
విని నృపతి పలుకులు ప్రీతి దనర మదుల
నంత మంత్రులతో ననె సంతసమున
నెల్లి పయన మంచు నరేంద్రుఁ డుల్ల మలర 18.

కం. సర్వ గుణముల విరాజిలు
నుర్వీశుఁడు సత్కరింప నుప్పొంగి మ హా
ఖర్వ మమాత్యులు రాతిరి
సర్వమ్మును గడపి రంత సంతోషముగా 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది యెనిమిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 69.

తెల్లవాఱఁగ దశరథుఁడు సుమంత్రునితోఁ బ్రయాణ సన్నాహములను జేయ మని కోశాధికారి పుష్కలముగ ధన రత్నాదులతో ముందు చనవలె నని రాజాజ్ఞ నొసఁగి యమాత్య వసిష్ఠాది పురోహితులతో మిథిలకుఁ జేరుకొనుట, జనకుని సత్కారము లందుకొని యా రాత్రి గడపుట .

కం. చన రాత్రి యుపాధ్యాయులఁ 1.

దన చుట్టమ్ములను గలసి ధరణిపతి సుమం
త్రునితో దశరథుఁడు ముద
మ్మునఁ బల్కెను మధుర వచనముల నిబ్బంగిన్

కం. ధనముం గొని పుష్కలముగఁ
జనఁగ ధనాధ్యక్షులు మును సర్వులు వేగ
మ్మున నానా రత్నములను
గొని రాజాజ్ఞ యని పల్కి కూర్పుము వారిన్ 2.

కం. చతురంగ బలమ్ములు చన
నతి శీఘ్రమ్ముగ మదాజ్ఞ నఖిలమ్ములు నా
తత యానమ్ములును సుమం
త్ర! తరల వలయుం జుమి యుచిత గతిని వినుమా 3.

తే.గీ. వెస వసిష్ఠుఁడు వామదేవ సహితము చి
రాయువుండు మార్కండేయుఁ డతుల తాప
సుండు జాబాలి కాత్యాయనుండు నింక
కాశ్యపుఁడు మున్ను విప్రు లేఁగంగ వలయు 4.

కం. సమకూర్పుము నా రథమును
సుమంత్ర! యాలస్య మేల సుమతీ! యింకన్
సమదం బేఁగ వలయు ద్వరి
తమ చనఁ దగు నంచు దూత తతి వచియించెన్ 5.

తే.గీ. ఱేని యానతి వేగ మఱి చతురంగ
బలము ఋషులఁ గూడి చనఁగ నలరి ముందు
వెనుకఁ దాఁ గదలెం బృథివీ ధవుండు
సంభ్రమముగ దశరథుండు సద్గుణుండు 6.

కం. చని నాల్గహముల మార్గ
మ్ము నవ్విదేహ విషయమ్ము మూరి కదియఁగన్
జనకుం డెఱింగి యద్దా
నిని సత్కార మొనరించె నెయ్యము మీఱన్ 7.

ఆ.వె. అంత రాజు వృద్ధు నా దశరథు సమీ
పించి సంతసమ్ము మించి పడసె
నెడఁద జనకుఁడు మిథిలేశుండు వాక్య వి
శారదుండు వినుత చక్రవర్తి 8.

తే.గీ. పలికె నా నరశ్రేష్ఠుఁడు పన్ను గ నర
పుంగవుని తోడ స్వాగతమ్ము నృపవర్య
కంటి భాగ్యవశమున రాఘవ! పడయుదు
ప్రీతిఁ గాంచి వీర సుతుల విరివి నిచట 9.

తే.గీ. కంటిని వసిష్ఠు నిచ్చటఁ గర మదృష్ట
మనఁగ సకల ద్విజుల మధ్య నలరి మిగుల
దేవతలఁగూడి నలరెడి దేవపతి శ
తక్రతు నిభమై యింపుగఁ దనరు వాని 10.

తే.గీ. కృప దొలంగె విఘ్నము లెల్లఁ గృప చెలంగఁ
బావనం బయ్యెఁ గులము సంబంధ మమర
రాఘవుల తోడ వరవీర రాజ వరుల
తో మహాత్ముల తోడ సంతోషముగను 11.

తే.గీ. ఎల్లి యుదయమ్ము భూవరేం ద్రేంద్ర నెమ్మి
పరిణయమ్మును జరిపింప నరవరేణ్య!
యర్హుఁడవు నీవు జన్నంపు టంత మందు
సంయమీంద్రుల కెల్లను సమ్మతమ్ము 12.

కం. అన విని ముని వర్యుల మ
ధ్యను వాక్య విశారదుండు ధరణీపతి య
జ్జనకుం గాంచి నృప వరేం
ద్రునిఁ బ్రత్యుత్తరము నిచ్చెఁ దుష్టాత్ముండై 13.

తే.గీ. పుచ్చుకొనుట యిచ్చెడు వాని యిచ్చ నుండు
నంచు వింటిమి మున్ను మే మంచితముగఁ 14.

బరమ ధర్మజ్ఞ మీరెట్లు పల్కు నట్లు
చేయఁ గల వారలము మేము వేయు నేల

తే.గీ. అచ్చెరువు నందు మునిఁగెఁ దా నప్పలుకుల
నాలకింపంగ నత్తఱి నా యశస్వి
ధర్మతత్పరుండు నుత సత్యవచనుండు
దశరథుం డన జనకుండు ధరణి ధవుఁడు 15.

కం. మును లెల్లరును గలసి యొక
రి నొకరు హర్షమ్ము నందిరి మదుల మిగులం
దనరుచు నిష్టాగోష్టిన్
ఘనులా ద్విజులు గడపిరి సుఖమ్ముగ రాత్రిన్ 16.

కం. కని రామలక్ష్మణుల సుతు
లను బరమానందము దశరథ నృపుఁ డందెన్
జనకుని సత్కారమ్మును
ఘనముగ నంది గడపెను సుఖమ్ముగ రాత్రిన్ 17.

తే.గీ. జనకుఁ డా మహా తేజుఁడు ఘనుఁడు తత్త్వ
వేత్త క్రతు ధర్మ సత్కార్య వితతి పుత్రి
కా ద్వయ విహిత కార్య నికాయము లొన
రించి రాత్రి గడపెఁ బ్రీతి నంచితముగ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు నఱువది తొమ్మిదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 70.

జనకుఁడు పిలువఁ దమ్ముఁడు కుశధ్వజుఁడు మిథిలకు వచ్చుట, దశరథుని కోరిక మేర వసిష్ఠుఁడు

## దశరథుని వంశ క్రమమును వర్ణించుట.

కం. అంత నుదయంపుఁ బను లవి
యంతము కా మునుల కెల్ల నవని పతి మనః
శాంతమున శతానందుని
యంతికమున కేఁగి పల్కె నలరుచు నిట్లున్ 1.

మ. నిజ సద్భ్రాత మహా ప్రభా తనుఁడు సన్నిష్ఠాత్ముఁడుం దాఁ గుశ
ధ్వజ నాముం డనుజోత్తముండు జన సంభావ్యుండు సాంకాశ్య నా
నిజ దివ్యేక్షుమతీ నదీ తట పురిన్ నిత్యమ్ము పాలించు నో
జ జలంబే తగ మేర కా నిలువ ద్రాక్షావ్రాతమే యాతనిన్ 2.

ఆ.వె. చూడ నిచ్చగింతు సుచరిత్రు యజ్ఞ ర
క్షకు నిట మునివర్య! సంతసమ్ము
నతఁడు నన్ను గూడి యనుభవింపఁ దగును
డెంద మందుఁ దేజ మందు ఘనుఁడు 3.

కం. అనుచుండ నా శతానం
దు నెదుట నట్లు జనకుండు తూర్ణం బేతెం
చ నచలితులు కొంద ఱటకు
జను లాదేశించె వారి జనకుం డెలమిన్ 4.

కం. వడి నేఁగు గుఱ్ఱములపై
నొడయుని యాజ్ఞఁ దలఁ దాల్చి యుర్వీశునిఁ దే
నడరుచు వా రేఁగిరి వడి
బిడౌజు పంపునను విష్ణుఁ బిల్చిన భంగిన్ 5.

కం. చని సాంకాశ్యాఖ్య పురము
కని రాజు కుశధ్వజు జనక సహోదరు నం
త నివేదించి జరిగినది
జనకుని చింతనముఁ దెల్పఁ జక్కఁగ నంతన్ 6.

ఆ.వె. వీర దూత వరులు వినిపించినది యెల్ల 7.

విని కుశధ్వజుండు విభుని యాజ్ఞ
జనక భూరమణునిఁ గను కుతూహలమున
నేఁగుదెంచె మిథిల కెలమి వేగ

తే.గీ. వచ్చి గాంచి మహాత్మునిఁ బరమ ధర్మ
పరుని యన్న శతానందు వందనము లి
డి యుభయులకు నమ్రుఁ డయి భక్తి యుతముగ వ
రాసనమ్మున నాసీనుఁ డయ్యె నంత 8.

తే.గీ. అమిత తేజులు నతి వీరు లన్నదమ్ము
లట్లు కూర్చుండి యుచితంపు టాసనముల
మంత్రి వర్యు సుదామను మనుజ వర్యు
నాదరమునఁ బంపి రని వాక్యముల నిట్లు 9.

తే.గీ. వెడలి మంత్రివరేణ్య దుర్భేదు నిన కు
లేశు నిక్ష్వాకు దశరథు నెలమి పుత్ర
సహిత మింక విప్రామాత్య సహిత మిటకు
గౌరవమ్ముగఁ గొనితెమ్ము కాంతిమంతు 10.

ఆ.వె. చని గుడారములకు సాకేతపుర నాథ
వరుని రఘు కుల ఘన వర్ధను గని
వందనము లొసంగి వంచి శిరస్సును
బన్నుగ వచనములు పలికె నిట్లు 11.

తే.గీ. పరమ వీర! యయోధ్యాధిప! మిథిలాధి
పుండు వైదేహుఁడు పురోధ పుంగవ సహి
తమ్ము మఱి యుపాధ్యాయ యుతమ్ము మిమ్ముఁ
గాంచ నుపవిష్టుఁ డై యుండె నంచితముగ 12.

ఆ.వె. విని యమాత్య వరు వచనములు ముద మంది
బంధు సర్వ మంత్రి పటల యుతము
జనకుఁ డున్న దేశమున కేఁగుదెంచెను
రాఘవుఁడు దశరథ రాణ్మణి వడి 13.

కం. నరపతి సబంధు మంత్రి స
గురు గణము విదేహపతినిఁ గూర్మి నరసి స
ద్గిర లెఱిఁగిన శ్రేష్ఠుండు మ
ధురమగు వాక్యమ్ము ల ననెఁ దూర్ణం బిట్లున్ 14.

కం. రాజేంద్ర! నీ పెఱుంగుదు
రాజుల కిక్ష్వాకులకుఁ బరమ దైవత మీ
తేజస్వి వసిష్ఠుఁడు తా
భాజనుఁ డగు మాకు మాఱు పల్కఁగఁ బనులన్ 15.

తే.గీ. అనుమతింప విశ్వామిత్రుఁ డఖిల ముని ని
చయము ధర్మాత్ముఁడు వసిష్ఠ సంయమీంద్రుఁ
డు వచియించును దగ మా పటుతర వంశ
వృక్షమును యథాక్రమమున సుక్షితీశ! 16.

తే.గీ. పలికి దశరథుం డిట్టులు సలలితమ్ము
మౌన మూనె నరేంద్రుఁడు ఱేని గమికి
నడుమ నంత వసిష్ఠుఁడు దొడఁగె వాక్య
విదుఁడు స పురోహిత నృపతి కెదుటఁ జెప్ప 17.

తే.గీ. నలువ యవ్యక్త తేజుఁడు నలినజుండు
శాశ్వతుండు నిత్యావ్యయ విశ్వసృజుఁడు
వాని కుద్భవించె మరీచి వాని సుతుఁడు
కశ్యపుఁడు వివస్వంతుఁ డంగజుఁ డతనికి 18.

తే.గీ. మనువు వైవస్వతుండు దాఁ దనరి మును ప్ర
జా పతిగఁ బ్రసిద్ధుండు ప్రజా పతికిఁ గు
మారుఁ డిక్ష్వాకుఁడు మొదటి మగఁడు పుర మ
యోధ్య కతని కింపుగఁ గుక్షి యుద్భవించె 19.

సీ. కుక్షికిఁ బుట్టె వికుక్షి శ్రీమంతుఁడు నతనికి బాణుం డమిత బలుండు
బాణునకుఁ బ్రతాపవంతుఁ డగు ననరణ్యుండు తేజస్వికి నుద్భవించెఁ

బృథు వాతని సుతుండు వీర త్రిశంకువు దుందుమారుండు సుతుం డతనికి
యువనాశ్వు డాతఁడె యుర్వీధవుండు మాంధాత యతని కయ్యెఁ దనయుఁ డెలమి
తే.గీ. ఘనుఁడు మాంధాతకు సుసంధి తనయుఁ డాయె
నతనికి ధ్రువసంధి ప్రసేనజితుఁ డనంగ
నిద్దఱు సుతులు ధ్రువసంధి కెలమిఁ బుట్టె
భరతుఁ డసితుఁడు నందన వరుఁ డతనికి 20.

చం. అసితున కైరి శత్రువులు హైహయు లా శశిబిందు తాళ జం
ఘ సహిత శూర పుంగవులు కానలు సేరి పరాజితుండు నా
యసితుఁడు మంచుకొండ దరి కల్పబలుండు సభార్య మంత్రి వ
ర్గ సహిత ముండె నా పుడమి కాంతుఁడు భీతి భృగూత్స వాటినిన్ 21.

తే.గీ. దార లిద్ద అపుడు గర్భ ధారిణు లని
విదిత మొక సతి సవతికి విష మొసంగెఁ
జ్యవన నాముఁడు భార్గవుఁ డవని సురుఁడు
హిమనగం బాశ్రయించి యుండె ముని వరుఁడు 22.

కం. ఒక సతి దారల లోన సు
త కాంక్ష భార్గవు సురనిభుఁ దపసి మహా భా
గ కొలువ మృగలోచన య
న్య కాంత కాళిందియు సుతు నందఁగఁ గొలిచెన్ 23.

చం. ముని యనె దేవి తోడ వగపుం గొన కమ్మ మహా బలుండు దా
జననము నొందు శీఘ్రమున సన్నుత శూరుఁడు నీకు నా వ రా
నన పతి శోక తప్త ఘన నందను బట్టపు రాణి దాఁ గనెన్
ఘన విష సంయుతమ్ముగ సుఖమ్ముగఁ దాపసి పల్కి నట్టులన్ 24.

ఆ.వె. సవతి యీయ విషము చంపఁ బిండమ్మును
గరము తోడఁ బుట్ట వరసుతుండు
సగరుఁ డంచు నామ సార్థకంబును గాంచె
రాజ సుతుఁడు ఘన పరాక్రముండు 25.

సీ. అసమంజసుఁడు సగ రాత్మజుం డంశుమంతుఁ డతని సుతుఁడు పుత్రుం డతనికి

నా దిలీపుఁడు దిలీ పాత్మజుఁడు భగీరథుండు కాకుత్స్థుఁ డుద్దండ సుతుఁ డ
తనికిఁ గాకుత్స్థుని తనయుఁడు రఘువు నరాదక కల్మాషపాదుఁడు రఘు
నందనుం డతని తనయుఁడు శంఖణుఁ డితనికి సుదర్శనుఁ డితనికిఁ గుమారుఁ

తే.గీ. డగ్నివర్ణుఁడు శీఘ్రగుఁ డతని సుతుఁడు
శీఘ్రగు సుతుఁడు మరువు ప్రసిద్ధుఁ డితని
పుత్రుఁడు ప్రశుశ్రుకుఁ డితని పుత్రుఁ డంబ
రీషుఁ డితనికి నహుషుఁడు రిపు దమనుఁడు 26.

తే.గీ. నహుషునకు యయాతి జనించె నందనుఁడు య
యాతి పతికి నాభాగుఁడె యాతని తన
యుం డజుఁ డజునకు దశరథుండు రామ
లక్ష్మణు లితని తనయులె రాజముఖ్య! 27.

తే.గీ. కులమున మొదలు నుండియు గొప్ప ధర్మ
రతులు రాజు లిక్ష్వాకులు సతత సత్య
వాదు లెల్ల వీర వరులు భాస్క రాన్వ
యులు విమల చరితులు నృవ రోత్తములును 28.

కం. నృవరా నీ తనయ లుభయు
ల వరులుగ వరించు రామలక్ష్మణుల నిఁకం
బ్రవరులకు నీయ నుచితము
ప్రవరలను నరేంద్ర యెంచ వైదేహ నృపా! 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బదవ సర్గము.

## బాలకాండము

## సర్గము 71.

జనకుఁడు తన వంశ వృక్షమును వినిపించుట. రామలక్ష్మణులకు సీత నూర్మిళల నిత్తు నని

మూడవ దినమున నుత్తరఫల్గునీ నక్షత్రమున వివాహము జరిపింపు మని దశరథుని వేఁడుట.

కం. విని యా వసిష్ఠు పలుకులు
జనకుఁడు వినయమ్ముతో వచనములు దగ ని
ట్లనియెన్ నిజ వంశక్రమ
ము నుడివెద వినుండు భద్రము దనరు మీకున్ 1.

కం. కన్యా దానంపుఁ దఱి వ
దాన్యునకు మునీంద్ర! ప్రీతిఁ దన వంశ గతిన్
ధన్యత నుడువంగ వలయు
మాన్యచరిత్ర! యన నాదు మాటలు వినుఁడీ 2.

తే.గీ. స్వీయ కర్మగణమ్ముల విశ్రుతుండు
ముజ్జగమ్ముల నిమి విభుఁ డజ్జన పతి
యగ్రగణ్యుఁడు సత్త్వ జనాళి యందుఁ
బరమ ధర్మాత్ముఁ డుత్తమ పార్థివుండు 3.

తే.గీ. వాని కంతఁ బుట్టెను మిథి వాని చేత
నిర్మితమ్ము మిథిల యని నెగడు పురము
జనకు లందు మొదటి వాఁడు జనకుని తన
యుం డుదావసుఁ డన సద్గుణుండు ఘనుఁడు 4.

ఆ.వె. నందివర్ధనుండు నందనుఁ డగు నుదా
వసువునకు సుకేతు వసుమతీశుఁ
డతని సుతుఁడు తనయుఁ డగు దేవరాతుఁడు
పతి సుకేతువునకు బల్లిదుండు 5.

తే.గీ. దేవరాతుని సుతుఁడు క్షితి వినుతుండు
రాజఋషి నాఁ బరగి బృహద్రథుఁ డతనికి
వీరుఁడుఁ బ్రతాపుఁ డగు మహావీరుఁ డనెడు
వాఁడు సంభవించెను దగ వేడుకగను 6.

తే.గీ. సత్యవిక్రముఁడు సుధృతి జనన మందె 7.

నంత నా మహావీరున కతఁ డతి ధృతి
మంతుఁడు సుధృతికిఁ దనయుఁ డంతఁ బుట్టె
దృష్టకేతువు ధార్మికుఁ డిష్ట మడర

ఆ.వె. దృష్టకేతువునకుఁ గృతమతి హర్యశ్వుఁ
డుదితుఁ డయ్యె నాతఁ డుత్తమముగ
రాజఋషి యనంగ రాజిల్లె నతనికిఁ
బుట్టె మరు వనంగఁ బట్టి యంత 8.

ఆ.వె. స్థిరుఁడు మరువునకుఁ బ్రతింధకుఁడు జనించెఁ
గీర్తిరథుఁడు వానికి జనియించె
ధర్మచిత్తుఁ డతఁడు ధరణి విభుఁడు దేవ
మీఢుఁ డతని సుతుఁడు గాఢ బుద్ధి 9.

ఆ.వె. దేవమీఢ తనయుఁ డా విబుధుఁడు మహీ
ధ్రకుఁడు విబుధు సుతుఁ డితనికిఁ గీర్తి
రాతుఁడు తనయుఁడు బలము మిక్కుటము మహా
రోముఁ డతని సుతవరుండు ఋషియు 10.

తే.గీ. ఆ మహారోమున కతి ధర్మాత్ముఁ డైన
స్వర్ణరోముఁడు రాజర్షి జనన మందె
నతని కుదయించెఁ బన్నుగ హ్రస్వరోముఁ
డితనికి సుతద్వయము పుట్టె నెలమి మీఱ 11.

తే.గీ. రాజు హ్రస్వరోమునకు ధర్మజ్ఞునకు జ
నించితిమి జ్యేష్ఠుఁడను నేను మించి తమ్ముఁ
డైన యీ కుశధ్వజుఁడు మహాపరాక్ర
ముండు వీరుండు సద్గుణ మండితుండు 12.

కం. నను రాజ్యమున నిలిపి మా
జనకుండు కుశధ్వజు ననుజవరుని భార
మ్మును నా పై మోపి వన
మ్మున కేఁగెను భూవరుండు మునిగణ ముఖ్యా! 13.

కం. దివ మేఁగ జరా భార
మ్ము వహించి జనకుఁడు స్నేహము దనరఁ గడు నా
యవరజుఁ గుశధ్వజుని దే
వ వరాభుని ధర నరయుచు వచ్చితి దేవా! 14.

తే.గీ. అంతఁ గొంత కాలమునకు నరుగుదెంచి
పురము ముట్టడించె సుధన్వ నరవిభుండు
వీర్యవంతుఁడు సాంకాశ్య విశ్రుత పుర
వరము నుండి మిథిలను సబలము మీఱి 15.

కం. పరమ శివ ధనుస్సు మఱియు
వర కన్యామణిని సీతఁ బద్మదళాక్షిన్
సురుచిరముగఁ దన కిమ్మని
నరనాథుండు గిర లంపె నా కుద్వృత్తిన్ 16.

కం. ఈ కున్నను బ్రహ్మర్షి! మ
హా కలహం బయ్యె నంత నాతని తోడన్
భూకాంతుఁడు నా చేతను
భీకరముగఁ జచ్చె నాజి విప్రవరేణ్యా! 17.

కం. నరనాథు నిహతుఁ జేసి స
మరమ్మునఁ గుశధ్వజుని సముంచిత రీతిం
బుర మా సాంకాశ్య కనువు
గ రాజుఁ జేసితి మునీంద్ర గారవ మొప్పన్ 18.

తే.గీ. ఆతఁడు కనిష్ఠ సోదరుఁ డన్న నేను
ముదము చెలఁగ నెడఁద నిత్తు మూరి సీత
ను దగ రామున కూర్మిళను మఱి లక్ష్మ
ణునకు భద్ర మగును మీకు మునివరేణ్య! 19.

ఆ.వె. వీర్యశుల్క సీత వీరుండు రామున
కిత్తు నూర్మిళ నిఁక నిత్తు లక్ష్మ 20.

ఱునకు శంక యేల నుడివెద ముమ్మారు
సంతసమ్ము దనర సంయమీంద్ర!

తే.గీ. ఇత్తు వధువుల రఘువీర! యెలమి రామ
లక్ష్మ ణార్థమ్ము నిండు నాల నధికమ్ము
గాను బిత్ృ కార్యము లొనర్పుఁడీ నయముగ
భద్ర మగుఁ జల్పుఁ డంత వివాహ మడరి 21.

తే.గీ. నేఁడు మఖ మహాభాహు వీ మూడవ దిన
మందు నుత్తర ఫల్గుని యందు రాజ!
తగ వివాహము జరిపింపఁ దగును మీకుఁ
దనయుల కయి దానములు కర్తవ్యము లగు 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది యొకటవ సర్గము.

## బాలకాండము

## సర్గము 72.

విశ్వామిత్రుఁడు జనకునితో భరత శత్రుఘ్నులకుఁ గుశధ్వజుని కుమార్తెల నిచ్చి వివాహము సేయ నుత్తమ మని సూచింప సంతోషముగ జనకుఁ డంగీకరించుట, పిదప దశరథుఁడు నిలయమునకుఁ బిత్ృ కార్యములకుఁ బుత్రార్థము దాన కార్యాదులకై పెడలుట.

కం. అన నట్లు జనకుఁడు నృపతి
ముని విశ్వామిత్రుఁ డంత మూరి వసిష్ఠుం
డును దోడుండఁగ నవ్వీ
రుని వీక్షించి పలికెను గురుతర వచనముల్ 1.

తే.గీ. అప్రమేయములును ననూహ్యమ్ము లీ కు
లములు పుడమి నిక్ష్వాకుల లలితతర వి 2.

దేహుల కులమ్ము లెంచ విదేహ రాజ!
వీనికి సమము లరయము విశ్వ మందు

చం. తగుదురు రామలక్ష్మణులు ధారుణి సీతకు నూర్మిళా సతీ
మృగ సదృశాక్షికిం గరము మేటి కులమ్మున రూప సంపదం
దగుదురు వీరు వారికిని౯ దథ్యముగా౯ బరికించి చూచినన్
జగములఁ గాంచ మిట్టి వర సంగమ మెందును రాజపుంగవా! 3.

ఉ. చెప్పఁ దగుం దిరమ్ముగ విశేషము నొక్కటిఁ దప్పకుండగా
నొప్పుగ నీ కుశధ్వజుని యుత్తమ కన్యక లిద్దఱిం దగం
జొప్పడు గోర నింపుగను సువ్రత! దారలు గాఁగ రూప మం
దిప్పుడమిం గనంగ సరి యిద్ధరణీపతి పట్టి జంటకున్ 4.

తే.గీ. భరత శత్రుఘ్నుల కొఱకుఁ బద్మ నయన
లిద్దఱిని నరేంద్ర! మహాత్ము లిరువురకును
దశరథాత్మజులు సుర సదృశ మహా ప
రాక్రములకు విశ్వప సముల కడిగెదము 5.

తే.గీ. పుణ్య కర్ము లిక్ష్వాకులు పుడమి నాథ!
మీ కులమ్ము నట్టులఁ జుమ్ము మీ రుభయులు
వియ్య మందుఁడు చక్కఁగ విగత చింత
రెండు కులములు వర్ధిల్ల మెండుగాను 6.

కం. అన విని విశ్వామిత్రు వ
చనమ్ములు వసిష్ఠు మతియు జనకుఁడు వినయ
మ్మునఁ బ్రాంజలి వాక్యమ్ములు
మునిద్వయము గాంచి పల్కె మోదం బలరన్ 7.

కం. మీ రిట్లానతి నీయఁగ
గారవమున సదృశ వంశ ఘన సంగమ మే
పారఁగఁ దలంతు నా కుల
మీ రీతిగ ధన్య మయ్యె నిద్ధర నంచున్ 8.

ఆ.వె. అట్ల యగును భద్ర మగును మీకుఁ గుశధ్వ
జుని తనయలు వీరు తనరి నలిన
నేత్ర లింక భరత శత్రుఘ్నులను భజిం
చెదరు సతులుగ విలసిల్లి ప్రీతి 9.

తే.గీ. రాజ పుత్రులు నల్వురు నోజ నొక్క
దివసమున రాజకన్యల దీప్తముఖుల
నల్వుర కరపద్మమ్ములఁ జెల్వముగ గ్ర
హింతురు మహాబలులు సంయమీంద్రు లార! 10.

తే.గీ. ఫల్గునుల నుత్తరంపు దివసము నందు
దేవ! భగుఁడు ప్రజాపతి తా వెలయఁగఁ
బరిణయమునకు మేలండ్రు పలికి యిట్లు
నంజలించి లేచి మునుల కనియె నిట్లు 11.

ఆ.వె. ఉత్తమంపు ధర్మ మొప్పుగ నా కొన
రించితిరి పరమ మునీంద్రులార!
నిత్య శిష్యుఁడ నని నే నెంతు మీకు వ
రాసనమ్ము నందు నలరుఁ డిచట 12.

తే.గీ. దశరథున కయోధ్య విధమ్ము తలఁప మిథిల
యగును నాకుఁ బాలనమున నార్యులార!
వలదు శంక మీ కిట నర్హ పథ మనంగఁ
దోఁచినది యెల్లఁ జేయుఁడు తోరముగను 13.

కం. సంతసము నంది మాటల
కంత జనకుఁ డనఁగ నట్లు కరము పలికె స్వీ
యాంతఃకరణమ్మున భూ
కాంతుం డా దశరథుండు కమనీయముగన్ 14.

తే.గీ. అన్నదమ్ము లిద్దఱు మిథిలాధిపతు ల
మిత గుణ నిధాను లెంచఁగ మించి మీరు
ఋషుల రాజన్యులను నిత్య మెలమిఁ బూజ 15.

సేయుదురు భక్తి మీఱంగ రాయలార

తే.గీ. స్వస్తి కల్గు భద్రమ్మగు విస్తృతముగ
మీకుఁ బోయివచ్చెద మింక మీటి శ్రాద్ధ
కర్మములు సలుపఁగ నౌపకార్యల కని
పల్కి దశరథుఁ డిక్ష్వాకు పార్థివుండు 16.

కం. ఆమంత్రణము గొని నృపతి
యా మిథిలాధిపతి నుండి యనురాగముతో
నా ముని వరేణ్యు లిద్దఱఁ
దా ముం దిడి వేగమ చనె దశరథుఁ డంతన్ 17.

ఆ.వె. చని నిలయము రాజు శ్రాద్ధము జరిపించి
శాస్త్ర విధిని నంత శ్రద్ధతోడ
నుదయ మందు లేచి యుత్తమముగను గో
దానముల నొసంగె దశరథుండు 18.

చం. కులుకుచు లక్ష లక్ష వర గోవుల దాన మొసంగె వేద వి
ప్రుల కట నొక్క యొక్క వర పుత్రున కై తగ రాఘవుండు వా
రల కిల క్షేమ మేర్పడ ధరాపతి బంగరు కొమ్ము లుండ వ
త్సల సహితమ్ము ప్రీతిని నొసంగెను బాలకుఁ గాంస్యపాత్రలున్ 19.

తే.గీ. పుత్రుల కొఱకు నింపుగఁ బుత్ర వత్స
లుండు గోదాన సహితమ్ము మెండుగ ధన
ము నితరమ్ముల నొసఁగె విప్రులకు రాఘ
వుండు దశరథుం డవని ధవుండు వెండి 20.

కం. కృత గో దానుఁడు నందన
వృత దశరథ రాజు వెలిఁగెఁ విశ్వేశ గణా
వృత హర్షిత ప్రజాపతి
గతి ముది తాత్ముం డయి యధికమ్ముగ నచటన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది రెండవ సర్గము.

# బాలకాండము

# సర్గము 73.

సీతారాముల కల్యాణ ఘట్టము.

కం. ఏ దిన మందు దశరథుఁడు
గో దానమ్మును ద్విజులకుఁ గూర్మిఁ జలిపెనో
యా దినముననె యుధాజితుఁ
డాదరముగ నేఁగుదెంచె నాపురమునకున్ 1.

ఆ.వె. భరతునకు స్వయముగఁ బరగెడు మేన మా
మయును గేకయపతి ప్రియ తనయుఁడు
గాంచి యడిగి యాతఁ డంచితముగ మహా
రాజు క్షేమ మంత నోజఁ బలికె 2.

కం. కేకయ దేశాధీశుఁడు
మీ కుశలం బడిగె రాజ! మీఱిన ప్రేమన్
మీ కోరు వారును గుశల
మే కాకుత్స్థ యిపుడు వసుధేశ్వర భృశమున్ 3.

ఆ.వె. మేన యల్లుఁ గాంచ మేదినీశ! జనకుఁ
డా మహీధవుండు ప్రేమ నిచ్చ
గింప నేఁగితి వడి నెలమి నయోధ్యాపు
ర వరమునకు నేను రాగ మడర 4.

చం. వినితి నయోధ్య లోన నృప! పేడ్క సుతాలి వివాహ కార్యముల్
ఘన మిథిలా పురమ్మునను గ్రన్ననఁ జేయఁగ నేఁగి రంచు నే
విని కన మేనయల్లు నిట పే యరుదెంచితి నంచుఁ బల్కు నా
విని తగ గౌరవించెఁ బతి ప్రీతి వరాతిథి గౌరవార్హునిన్ 5.

ఉ. అంత వసించి రాత్రి యట నాత్మజు లెల్లరఁ గూడి ప్రీతి రా
త్ర్యంతము నందుఁ గృత్యముల నందఱు వేగమ యాచరించి వే
దాంతులు మౌని పుంగవుల నందఱ ముం దిడి చేరి రంత య
జ్ఞాంతిక వాటికా తటికి నాదర మొప్పఁగ సంభ్రమమ్మునన్ 6.

ఉ. చేతికిఁ దోరణమ్ములను జెల్వపు టాభరణమ్ము లుండఁగా
భ్రాతలఁ గూడి యా విజయ పాటవ యుక్త ముహూర్త మందు సం
ప్రీత మనస్కుఁ డార్యుఁడు వివేకుఁడు సేరి వసిష్ఠ తాపస
వ్రాతము ముందు నుంచి తగ రాముఁడు నిల్చెను దండ్రి చెంతనున్ 7.

ఉ. ఏఁగి వసిష్ఠుఁ డంత మిథిలేశుని పాలికి భూవరేణ్యుతో
వాగమృతమ్ము లొల్క ననెఁ బార్థివ! మంగళ యుక్తుఁడై మహా
భాగుఁడు రాఘవుండు క్రతు వాటికఁ జేరి సుతాళి తోడుతన్
బాగుగ వేచి యుండె నటఁ బంక్తిరథుండు ఘనార్థ దాతకై 8.

ఉ. దాతయు గ్రాహకుండు సతతమ్మును నన్నిట వెల్గు చుండ్రు సూ
ప్రీతి స్వధర్మ మింపుగను వేగమ సేయుమ యీ వివాహముల్
భూతల నాథ! నాఁ బలుకఁ బుణ్యతముండు వసిష్ఠుఁ డింపుగా
నాతత ధర్మవేదుఁ డసె నా జనకుండు మహాత్ముఁ డిట్టులన్ 9.

ఉ. ఎవ్వఁడు ద్వార రక్షకుఁడ యెవ్విధి మిమ్ముల నడ్డగించె మీ
రెవ్వరి యాజ్ఞ గోరుటయు సేల స్వవేశ్మమ యంచుఁ దల్చుఁడీ
యివ్వర దేశ మెంచ సత మింపుగ మీ ఘన దేశ రీతినిన్
నివ్వటిలంగఁ దల్పఁ డెద నిత్యము రాఘవ! రాజపుంగవా! 10.

ఉ. మంగళ కృత్యముల్ వరుస మా సుత లెల్ల రొనర్చివేదికిన్
ముంగలఁ జేరి రింపుగను బుణ్యమునీశ్వర! వహ్నికీల ల
బ్బంగిని వేచు చుంటి నిటఁ బార్థివ! సిద్ధము సేసి యన్నిటిన్
భంగ విహీన మిచ్చట వివాహము సల్పుఁడు జాగు లేకయే 11.

కం. జనకుని యా మాటలు విని
ముని సహితమ్ము దశరథుఁడు పుత్రుల నెల్లన్ 12.

ఘనులను బ్రవేశ పెట్టెను
మనమున హర్షం బొదవ సమంచిత రీతిన్

తే.గీ. అంత వైదేహులు నృపులు సంతసమునఁ
గని వసిష్ఠుని ధార్మిక! మునివరేణ్య!
రాము పెండ్లి పనుల నభిరాముని వీఁకఁ
జేయుఁడు ఋషివరులఁ గూడి శీఘ్ర మనిరి 13.

కం. అన విని వసిష్ఠుఁ డట్టులె
యని విశ్వామిత్రు నింక నడరి శతానం
దుని ముందుంచి ముని వరులఁ
దనరెను సురనిభుఁడు సేయఁ దగు కార్యములన్ 14.

సీ. చలిపందిరి నడుమఁ జక్కగ నిర్మించి వేది మహాముని విధిని గంధ
పుష్పాదు లెల్లెడ మూరి జల్లి యలంకరించి సువర్ణము యేద్ధ పాలి
కా తతి ఛిద్రంపు ఘటము లంకుర సంయుతమ్ముల నుంచి స్రువమ్ము లింక
స్రుక్కులు మూకుళ్లు చుట్టు నుంచి యగరు ధూపంపు పాత్రలు ధూప యుతము
తే.గీ. శంఖ పాత్రలు పాత్రలు సజలముల న
లంకరించె లాజాక్షతలను ఘటముల
నించి సంస్కృతముల వేది నంచితముగ
సంతసమ్మున నింకను సంయముండు 15.

తే.గీ. సమపు దర్భలను బఱచి చక్క మంత్ర
పూర్వకము వేది నగ్ని సముచిత మంత్ర
వాచ్యముల నుంచి వెలిఁగించి భవ్యముగను
వ్రేల్చె నేతి వసిష్ఠుండు వేదవిదుఁడు 16.

తే.గీ. అంత సర్వాభరణ భూషి తాంగి సీత
నగ్ని యెదుట రామునకు ముం దలరఁ జేసి
వడినిఁ గౌసల్య కానంద మడరఁ జేయు
రామునిఁ గని జనక మహారాజు మురిసి 17.

కం. ఆతత గుణ జిత నారీ 18.

వ్రాతన్ భూజాత వస్త్ర వర సంవీతన్
భూతల నాథుఁడు పల్కెను
సీతా సంజాతఁ జూపి  సీతన్ నాతిన్

ఉ. రామ! కడింది భద్ర మభి రాముఁడ! నీ కగు రమ్ము లెమ్మిఁకన్
రామ పతివ్రతాగణ లలామ మదాత్మజ సీత కేలు కెం
దామర నీ కరాబ్జమునఁ దద్దయుఁ బ్రీతి గ్రహింపు మిత్తజిన్
రామను ఛాయ నా నడచు రమ్యను నీ సహధర్మచారిణిన్ 19.

చం. అని జనకుండు మంత్ర విమలాంబువు లల్లనఁ జల్ల మెల్లఁగన్
మునులును నిర్జరౌఘమును ముచ్చట పల్కిరి సాధు సాధు వం
చు నలరి దేవ దుందుభులు చోద్యముగా వినిపించె మ్రోగఁగా
ఘనముగఁ బుష్ప వర్ష మట గ్రద్దన పాతిత మయ్యెఁ జెంతనున్ 20.

ఆ.వె. ఒసఁగి మంత్ర సలిల యుత మట్లు సీతను
సంతసమ్ము నంది యంతరంగ
మందు జనకుఁ డా మహారాజు పల్కెను
లక్ష్మణుఁ బరికించి లక్ష ణాంగు 21.

తే.గీ. లక్ష్మణా రమ్ము భద్ర మలరును నీకు
నూర్మిళా కరాబ్జమును నీ యుత్తమంపు
హస్త నలినమ్ము చేఁ గొను మసవస యిసు
మంత లేక పరమ హర్ష మడర హృదిని 22.

ఆ.వె. పలికి యట్లు గాంచి భరతు ననియె నిట్లు
రఘుకుమార నీ కర నలినమున
సంగ్రహింపు మయ్య! చయ్యన మాండవీ
హస్త పద్మ మీవు హర్ష మడర 23.

ఆ.వె. జనకుఁ డంతఁ గాంచి శత్రుఘ్నునిఁ బలికె
నో మహా భుజయుగ యొప్పుగ శ్రుత
కీర్తి హస్త సుమము కృతమతి నీ హస్త
పద్మమున గ్రహింపు భద్రముగను 24.

తే.గీ.	మీర లెల్లరు సౌమ్యులు వీర వరులు
సచ్చరిత్రులు దారల సంయుతమ్ము
దనర వలయు నాలస్యము తగదు మీకు
నింకఁ గాకుత్స్థులార! నిశ్శంక నిపుడు	25.

చం.	జనకుని నాలకించి మునిచంద్రు వసిష్ఠు ననుజ్ఞ నల్వురున్
వనితల హస్త పద్మములు పాణుల నంత స్పృశించి యింపుగా
ననలము చుట్టు తిర్గి రట నాలుల తోడుత రాజు సంయముల్
తనరిరి వారితో విధి యుతమ్ముగఁ జేసిరి పెండ్లి యచ్చటన్	26.

తే.గీ.	అంతరిక్షము నుండి మహాద్భుతముగ
రాఘువులు గ్రహింప మృదు కరమ్ములను గు
రిసిరి పుష్ప వర్షమును మురిసి యమరులు
వెల్గు లీన మిక్కుటముగ నాల్గు దిశల	27.

తే.గీ.	దివ్య దుందుభి స్వనములు భవ్య వాద్య
గీతముల నచ్చరలు చెలఁగిరి కరమ్ము
నృత్యములఁ బాడ గంధర్వ నిచయ మడరి
రాఘువుల పెండ్లి నయ్యపూర్వ మగపడెను	28.

ఆ.వె.	చెలఁగఁ దూర్య ఘోషము లట ముమ్మారు ల
గ్నికిఁ బ్రదక్షిణమ్ము నెమ్మిఁ జేసి
బల పరాక్ర మోన్నతులు పరిణయమాడి
రంత రాఘువులు వరాంగనలను	29.

కం.	చని రంత గుడారములకు
ఘను లా రఘుతనయులు నిజ కాంతల తోడం
గని సర్షి సబాంధవ మల
రి నృపుఁ డనుసరించి వారి లెస్సగ వెడలెన్	30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది మూడవ సర్గము.

# బాలకాండము

## సర్గము 74.

విశ్వామిత్రుఁడు హిమాద్రి కేఁగ దశరథుఁడు సపరివార మయోధ్యకుఁ బయన మగుట, జనకుఁడు కన్యా ధనము నొసఁగుట, ప్రయాణములో దశరథునకుఁ బరశురాముఁడు కనిపించుట.

తే.గీ. రేయి గడవ విశ్వామిత్ర ఋషివరుండు
రాజుల యనుజ్ఞఁ గైకొని రాఘవులకు
దీవన లొసంగి ప్రీతినిఁ దిరిగి యుత్త
రాద్రి కేఁగెను వేగ బ్రహ్మర్షి యంత 1.

కం. చన విశ్వామిత్రుఁడు జన
క నృపతి యామంత్రణమునఁ గాకుత్స్థుం డం
త నిజ నగరం బయోధ్యకుఁ
జనం దొడఁగె హర్ష మడర స్వగణము తోడన్ 2.

తే.గీ. వెడలు రాజు ననుగమించెఁ బుడమి ధవుఁడు
జనకుఁడు విదేహ నాథుఁడు సమధికముగ
నిచ్చి కన్యాధనమ్ముఁ లనేక రూప
ముల నెలమి వేరు వేరుగఁ బుత్రికలకు 3.

ఉ. గోవులు వందవేలు మఱి కోటుల సంఖ్యను బట్టు వస్త్రముల్
పే వర కంబళమ్ములను బ్రీతి గజాశ్వ పదాతి కూబరుల్
వావిరి దాస దాసులను భవ్య సురూపల భూషితాంగులన్
భూవరుఁ డిచ్చెఁ దోరముగ ముత్యము లభ్రమ విద్రుమమ్ములన్ 4.

తే.గీ. ఇచ్చి హెచ్చుగ విత్తమ్ము సచ్చరితుఁడు
మిథిలకుం బతి తా దశరథు ననుజ్ఞఁ
గైకొని నరేశ్వరుం డంత వీడ్క స్వీయ
నిలయమున కేఁగె సంతస మలర నెడఁద 5.

ఆ.వె. బలము లనుగమింప నెలమి సాకేత ధ
వుఁడు మహాత్ములు వర పుత్రుల సహి
తమ్ము సకల ముని గణమ్ము ముందు నడువ
బయలు దేరె మూరి పార్థివుండు 6.

మ. చనుచుండంగ సపుత్ర సర్వి తతి యా సాకేత నాథుం డటుల్
వినిపించెం బటు ఘోర రావములు ద్యోవీథిన్ విహంగధ్వనుల్
దనరెన్ జంతు ప్రదక్షిణమ్ము లదరన్ ధాత్రీ తలం బెల్లయుం
గని ప్రశ్నించె వసిష్ఠు రాఘవుఁడు భూకాంతుండు విభ్రాంతుఁడై 7.

తే.గీ. పక్కి కూతలు రోతలై పిక్కటిల్లెఁ
దిరుగు చున్నవి మృగములు గిరగిర వడి
నుత్త లమ్మహో చెలరేఁగెఁ జిత్త మందు
నేమి యిది ఝల్లు మన గుండె లెల్ల దేవ! 8.

కం. నా విని పల్కె వసిష్ఠుఁడు
దేవ నిభుఁడు మునివరుండు తియ్య నయిన వా
చ్యావలి దీని ఫలమ్మును
భూవర వాక్రుచ్చెద వినుము రఘు వరేణ్యా! 9.

తే.గీ. రాజ! సూచించు చున్నవి రావములు వి
హగ ముఖముల వెలువడి భయంకరంపు
దివ్య ఘటనము మృగముల తిరుగుడు తగు
శాంతిఁ గాన తాపము వీడఁ జనును నీకు 10.

కం. వా రట్లుండం బలుకుచు
ఘోరమ్ముగ గాలి లేచెఁ గుదుపుచు ధాత్రిన్
భూరుహముల సకలముల న
వారిత విధిఁ గూల్చు చుండి వరుస శుభములన్ 11.

చం. తనరెను జీఁక టెల్లెడల దామర సాప్తునిఁ గప్పి దిక్కులుం
దనరవు కాంతి పుంజములఁ దద్భల మెల్లను బూది చేత న 12.

య్యెను బరివేష్టితం బట నహీనము మోహిత మయ్యె మూర్ఛలో
మునులు వసిష్ఠుఁ డా నృపతి పుత్రులు దక్క మునింగి రెల్లరున్

కం. అట భస్మచ్ఛన్నమ్మగఁ
బటు సైన్యం బెల్ల నుండఁ బడి ధరఁ బెం జీఁ
కటి క్రమ్మఁగ నల్దిశలన్
జటాధరుఁడు భీమ నిభుఁడు చయ్యన రాఁగన్ 13.

మ. కనెఁ గాకుత్స్థుఁడు జామదగ్న్యు ఘన భూకాంతఘ్ను దుర్ధర్షునిం
ఘన కైలాస నిభమ్ము దుస్సహ తనుం గాలాగ్నిసాదృశ్యునిం
ఘన దేజో జ్వలి తాంగు నల్ప జన వీక్షా దూరు స్కంధస్థి తా
రి నిరో ధోగ్ర కుఠారు భార్గవు ధనుర్విద్యోత బాహూత్తమున్ 14.

ఆ.వె. త్రిపుర నాశ శివుని రీతి ముఖ్య శరము
నూని వచ్చు వాని నుజ్జ్వలు నన
లాభముగ వసిష్ఠు నాదిగ మును లెల్లఁ
గాంచి యొండొరుల వచించి రిట్లు 15.

తే.గీ. నిజ జనకు వధింప నలిగి నృపుల నెల్ల
మున్ను హింసించి విగత కోపుండు విగత
తాపుఁ డెంచఁడు గద రాజ దమన మిపుడు
దిరిగి క్షత్రియ వధ తగ దరయ నంచు 16.

తే.గీ. పలికి యర్ఘ్యము గొనితెచ్చి భార్గవు నతి
భీమ దర్శను మును లెల్లఁ బ్రీతిఁ గాంచి
యొసఁగి రామ రామ యనుచు నొయ్యనఁ బలి
కిరి మధుర వచనమ్ములు కేలు మొగిచి 17.

కం. కొని యర్చ ఋషు లొసంగఁగ
ఘన విక్రమ జామదగ్ని కాంచి దశర థా
వని నాథ సుతుని రాముని
నిన కులవర్ధనునిఁ బలికె ని ట్లాతనితో 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది నాల్గవ సర్గము.

# బాలకాండము

## సర్గము 75.

పరశురాముఁడు దశరథుని ప్రార్థనము గ్రహింపక దశరథ రామునితో శివ వైష్ణవ ధనువుల
మహిమలను దెలిపి విష్ణు ధనుస్సు నెక్కుపెట్ట మని యట్లు సేయఁ గలిగిన రామునితో ద్వంద్వ
యుద్ధము సేయఁ గలనని వచించుట.

కం. రామా! దాశరథీ! నీ
యీ మగఁటిమి మేము వింటిమే యద్భుతమున్
భీమ ధనుర్భంగ మహో
యా ముచ్చట వింటి మయ్య! యఖిలము రామా! 1.

ఆ.వె. అద్భుతము ననూహ్య మా ధనుర్భంగము
సేయ నీవు రామ! పే యిట కరు
దెంచితిఁ గొని నితర దివ్యంపు విల్లును
శుభతరమ్ము నేను జూడ నిన్ను 2.

కం. ఇది యా విల్లు కనుమ జా
మదగ్న్య మిది ఘోర నిభము మహి తాస్త్రమ్మే
కుదురుగఁ గూర్పుమ శరమును
బెదరక నీ బలముఁ జూపు పృథ్వీశ సుతా! 3.

తే.గీ. విల్లు నెక్కిడ నీ దైన వీర్య మరసి
వీరవరులకుఁ దగినట్టి ఘోర మైన
నాదు ద్వంద్వ యుద్ధము నిత్తు మేదినీశ
నందన! రఘుప్రవర! నీకు విం దనంగ 4.

కం. అన విని యా వచనమ్ముల
ను నృపుం డా దశరథుండు నొచ్చి భృశమ్మున్
ఘన దీన వదనుఁ డంజలి
ననె శోకాక్రాంతుఁ డిట్లు నాతని తోడన్ 5.

చం. విడువుము క్షత్ర రోషమును విప్రవరేణ్య! మహాయశస్క! నా
కొడుకులు బాలు రెల్లరకుఁ గూర్మిని నీ యభయమ్ము నిమ్ము నీ
వడరెడు భార్గ వాన్వయము నందు మహాధ్యయనుల్ వరవ్రతుల్
బెడఁగిన వంశ మందు బలభేదిఁ దలంచుచు వీడి తస్త్రముల్ 6.

తే.గీ. అట్టి నీవు ధర్మపరుఁడ పై యొసఁగితి
భూమి కశ్యపునకు వనమునకు నేఁగి
భార్గవ మహేంద్ర సన్నామ పర్వతమున
నింపుగ నిలయ మ్మరసితి సొంపు మీఱ 7.

ఆ.వె. నాదు విలయమున కనంగ వచ్చితి వీవు
మునివరేణ్య! ఘనుఁడు పుత్రు లందు
రాముఁ డొక్కఁ డకట లయమంద జీవింప
నేర మెల్లర మిఁక నీదు కతన 8.

కం. విని పలుకులు లక్షింపక
ముని భార్గవుఁ డా నృపతిని మూరి వచించెన్
ఘను రఘురాముని వీక్షిం
చి నిశితముగ విక్రముండు శీఘ్రమ యిట్లున్ 9.

ఉ. ఈ ధను యుగ్మ ముద్ధతి మహీతల విశ్రుత కార్ముకమ్ములన్
బాధల కోర్చి చేసె దృఢ భద్ర బలాన్విత రాజితమ్ములన్
క్ష్మాధర సన్నిభమ్ములను గార్య విశారద విశ్వకర్మయే
భూధవ పుత్ర రత్నమ! యపూర్వ విధమ్ముగ నైపుణమ్మునన్ 10.

తే.గీ. సుర లొసంగి రందొక్కటి హరున కా త్రి
నయనునకు నుత్సహింపంగ నరవరేణ్య!
త్రిపుర సంహర్తకుఁ జెలఁగి తివిరి నీవు 11.

విఱిచిన యది యచ్చోట నా విల్లె చుమ్ము

తే.గీ. రెండవ దిది హరి కొసఁగిరి సుర లలరి
విల్లు దుర్ధర్ష మియ్యది వెలయు వైష్ణ
వ ధను వనఁగఁ గాంతి యుతము పరిగణమ్ము
సేయ శివ ధనుస్సదృశమ్ము చేవ లోన 12.

తే.గీ. హరి హర బలాబలమ్ముల నరయ నమరు
లంత నాసక్తి చెలఁగంగ నరిగి వినతి
నలినసంభవు నడిగిరి నరవరేణ్య!
పరమ కౌతుకమునఁ దెలుప వలయు నని 13.

కం. అమరుల భావంబు నెఱిఁగి
సముచితము సరోజభవుఁడు సత్వరము విరో
ధముఁ గల్పించెను వారికిఁ
బ్రముఖుఁడు సత్యవచనుల నరయ మోదమునన్ 14.

చం. నెరప విరోధ మిద్దఱికి సేర్పున యుద్ధము రోమహర్షమై
జరిగెను విష్ణుశంభులకు స్తంభితుఁ డయ్యెను జంద్రమౌళి యా
హరి వడి హుంకరింప హరు నా ధను వత్తఱిఁ జాఁగె మిక్కిలిన్
గరువము విక్రమమ్ము చెడఁ గల్మష కంఠున కింక వింటికిన్ 15.

ఆ.వె. చారణ సుర తాపస వర సంఘు మపుడు
కలసి వచ్చి చక్కఁగ సుర ముఖ్యు
లిద్దఱిఁ గని యనునయించి శాంతింపఁగఁ
జేసి రంత వారిఁ జెలువముగను 16.

ఆ.వె. జృంభితమ్ము కాఁగఁ జేవ తఱిఁగి శివు
విల్లు భీమ విష్ణు విక్రమమున
నట్లు గాంచి యెంచి రమరులు విష్ణు వ
ధికుఁ డనఁగ నిరువురఁ దెల్లముగను 17.

కం. అలుక నొసంగెన్ రుద్రుఁడు 18.

విలు బాణముతో విదేహ విభువరునకు భూ
తల మందు దేవరాతున
కల దాఁపఁగ భద్రముగ మహాత్ముం డంతన్

కం. ఇది వైష్ణవ కార్ముకము ప
ర దమన విశ్రుతము రామ! రమ్యము దీనిం
బదిలముగ భార్గవ ఋచీ
కు దరిని నా విష్ణు వుంచెఁ గూర్మి చెలంగన్ 19.

తే.గీ. పుత్రునకు జమదగ్ని కమ్ముని యొసంగె
నాదు తండ్రి కప్రతికర్మ నైపుణునకు
జప తపోబలుఁ డుంచఁగఁ జాప వరము
నర్జునుండు దుర్మతి చంపె నమ్మహాత్ము 20.

చం. విని యతి దారుణంపు మృతి విప్రుని నా పితృ దేవు ఘోర హ
త్యను భువి రాజు లందఱిని నంతము చేసి యనేక వారముల్
ఘనముగ భూమినిం బడసి కశ్యప సంయమి కిచ్చి దాన రీ
తి నవభృథం బొనర్చి తగ దివ్య మహేంద్ర నగమ్ముఁ జేరితిన్ 21.

తే.గీ. తగు తపోబ లాన్వితమునఁ దనర నచట
రామ! వీర్య మడర ధనుర్భంగ మీవు
సేయుట విని మహాబల! శీఘ్రమ యరు
దెంచితి నిటకు వీక్షింప నెంచి నిన్ను 22.

కం. ఇది యా వైష్ణవ ధనువు ల
సదుత్తమము క్షత్రధర్మ సంచారివియై
యిది పితృ పైతామహము బె
డిదంపుఁ గార్ముకము సుమి వడి గొనుమ దీనిన్ 23.

కం. పూరింపుమ యీ చాపం
బారవ మెసఁగంగఁ బర పురాలిఘ్నమ్మున్
పూరించి తేని రామా!
పోరాటము ద్వంద్వ మిత్తు మూరి భయదమున్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది యేనవ సర్గము.

# బాలకాండము

## సర్గము 76.

రఘు రాముఁడు విష్ణు చాపము నెక్కు పెట్టి యది వ్యర్థము కాఁ గూడదు కానఁ బరశు రాముని
కోరికపై నాతఁడు తపస్సుచే నార్జించిన లోకములను బాణము విడిచి లయము చేయఁ
బరశురాముఁడు మహేంద్రగిరికిఁ దిరిగి వెడలుట.

కం. భార్గవ రాముని దర్పా
నర్గళ గిరలు విని మన్నన జనకునకు నౌ
మార్గము నెంచి యెడఁద నా
భార్గవుతో రాముఁ డనియెఁ బన్నుగ నిట్లున్ 1.

కం. వింటిని భార్గవ పుంగవ!
తొంటిని మీ చేసి నట్టి తోరపుఁ బనినిం
గంటివి పితౄణము వె
న్నంటి నృపులఁ జంపఁ దీర నందుమ నుతులన్ 2.

కం. అవమాన పఱచితివి భా
ర్గవ! నన్నిట వీర్యహీన రాజాన్వయ సం
భవ యుక్తపుఁ బనులకుఁ జా
ల వని కనుమ నా బలం బలర నీ విచటన్ 3.

చం. పలికి రఘూత్తముం డిటుల భార్గవు వింటి గ్రహించి క్రుద్ధుఁడై
ములికినిఁ గూడి యంత మునిపుంగవు చేతుల నుండి యల్లెకుం
జులుకనఁ బూన్చి బాణమును జోద్యము మీఱఁగఁ బల్కె నంతటం
జెలువపు భాషణమ్ములను శీఘ్రము భార్గవు తోడ నివ్విధిన్ 4.

తే.గీ. బ్రాహ్మణుండవు గావునఁ బరమ పూజ
నీయుఁ డవు నాకు మఱి దలపోయ నన్య
కారణమ్ము విశ్వామిత్రు కతనఁ గలదు
ప్రాణ హర శరమును వేయ రాదు నాకు 5.

తే.గీ. నీ నడచు శక్తిని నయిన నీ తపంపు
మహిమఁ బొందిన యప్రతిమంపు లోక
సంచయమ్ముల నైనను సంయమీంద్ర!
నే హరింపఁ జేయుదుఁ బల్కు నీదు వాంఛ 6.

కం. పరపుర భంజన వైష్ణవ
శరమ్ము దివ్యమ్ము వ్యర్థ శరముగ భువిలోఁ
బరఁగఁ దగదు వీర్యమ్మునఁ
బర దర్ప వినాశి విష్ణు వర ధను వెంచన్ 7.

మ. కర పద్మస్థ మహోన్న తాయుధ నృపుం గాంచంగ సర్వప్రజా
సుర సబ్రహ్మ సురాలి సిద్ధగణ సచ్ఛుద్ధాత్మ గంధర్వ కి
న్నర సిద్ధావలి యప్సరోగణ మహా నాగాలి సచ్చారణుల్
వర రక్షస్సులు నేఁగుదెంచి రల సంభావ్యుల్ మహాశ్చర్యమున్ 8.

ఆ.వె. నిశ్చలమ్ము గాఁగ నిల్చె లోకమ్ములు
ధనువు నెత్తి నంత నినకులేశుఁ
డడరి వీర్యహీనుఁ డయ్యె నా జామద
గ్ని కనుచుండె రాముని వదనమ్ము 9.

కం. మెల్లఁగఁ బల్కెను వీర్యము
డుల్ల నతని తేజపుం బటుత్వమ్మున న
బ్బల్లిదుఁడు జడుం డయి తాఁ
దల్లడిలుచు నిల్చి జామదగ్ని యతనితో 10.

తే.గీ. కశ్యపున కిచ్చితిని మును గాశ్యపి వర
దానముగ రఘురామ! యధ్వరపు టంత 11.

మందు నిందుండ వలదంచు నమ్మహాత్ముఁ
డానతి నొసంగెఁ గైకొని దాన మలరి

తే.గీ. భూమి నెల్ల నొసఁగి కశ్యపునకు నపుడు
ప్రతినఁ దగ నూని కాకుత్స్థ! పరమ నియతి
ఘనుఁడు గురువర్యు మాటకుఁ గట్టుపడుచు
రాతిరి వసుధ వసియింప రాదు నాకు 12.

చం. గమనపు శక్తి వీరవర! కావున నాకు లయంబు సేయ రా
దు మనుజముఖ్య! హర్షమునఁ దూర్ణము వోవ మహేంద్ర శృంగికిన్
సముచిత రీతి లోకముల సత్య తపఃఫలితమ్ము లయ్య జం
పుమ వడి జాగు సేయకుమ మూరి శరమ్మునఁ బద్మలోచనా! 13.

తే.గీ. నిన్నెఱిఁగితి ధనుస్స్పర్శ నీరజాక్ష!
యక్షయుఁడవు నిర్జర పతి వంచు మధు ని
షూదనుఁడ వంచు నెమ్మది క్షుణ్ణముగను
స్వస్తి నీకుఁ బరంతప! సదమలాత్మ! 14.

కం. సురవరులు చూచు చుండిరి
గురు కర్మ ధురంధరుండ! కూడి సమర మం
దరి వీరోగ్రుఁడ వప్రతి
వర విక్రముఁడవు గుణాభివంద్యుని నిన్నున్ 15.

కం. లజ్జింపంగ ననర్హుఁడ
నిజ్జగతి రఘూద్వహుండ నే నోడంగన్
ముజ్జగముల విభునకు నా
యుజ్జ నరయ రఘువరేణ్య! యుద్ధము నందున్ 16.

కం. విడువుమ బాణము వేగమ
తడ వేమిటి కింక రామ తామర సాక్షా!
కడు వడి నేఁగెద గిరికిం
దడఁబడక మహేంద్రమునకుఁ దద్దయుఁ బ్రీతిన్ 17.

కం. అన జామదగ్ని రాముఁడు
విని రాముఁడు దాశరథి సువిక్రముఁ డంతన్
ఘనశిత శరమ్ముఁ పే విడి
చెను శ్రీమంతుం డపుడు విశేషపు మహిమన్ 18.

కం. శరఘాత లోకములు నిజ
పరమ తపోలబ్ధములను భార్గవుఁ డీక్షిం
చి రయమున మహేంద్ర గిరికిఁ
దరలెను బ్రీతి వర పర్వతమునకు నంతన్ 19.

ఆ.వె. అంత నంధకార మణఁగె దిశోప ది
శలను సర్షి సుర నిచయము పొగిడె
నుద్యదాయుధుని సముచితముగ రఘు రా
ము నెలమి భృశముగ నపూర్వ కర్మ 20.

కం. రాముండు జామదగ్ని మ
హా ముని విభుఁడు నుతియించి యద్దాశరథిన్
రామునిఁ బ్రదక్షిణం బభి
రామున కొనరించి యేఁగె రతి నిజ గతికిన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది యాఱవ సర్గము.

## బాలకాండము

## సర్గము 77.

పరశురాముఁడు శాంతిఁ బడసి వెడలి నంత రఘురాముఁ డా గొప్ప ధనుస్సును వరుణుని చేతి కిచ్చుట, యంత నందఱు నయోధ్యకుఁ జేరు కొనఁగఁ గౌసల్యాది రాణు లందఱు కోడండ్ర నంతః పురమునకుఁ గొనిపోవుట, భరత శత్రుఘ్నులు మేనమామ యుధాజిత్తునితోఁ గేకయ రాజ్యమున కేఁగుట, రామ లక్ష్మణులు తండ్రికి రాజ కార్యములఁ దోడుండుట, సీతారాము లానందముగ

విహరించుట.

కం. చన భార్గవుం డెడఁద శాం
తినిఁ బొంది తగ రఘువంశ తిలకుం డంతన్
ఘనమౌ యా ధనువును వరు
ణుని హస్తం బందు నుంచెను ముదం బారన్ 1.

చం. వినయముతో వసిష్ఠ ముఖ విజ్ఞ మునీంద్రుల కెల్ల మ్రొక్కి తం
డ్రినిఁ గని విహ్వలాత్ము ననె శ్రీరఘు రాముఁడు భార్గవుండు పే
చనెఁ జతురంగ సైన్య మిఁకఁ జక్క నయోధ్యకు నేఁగ నిండు మీ
రనుమతి సేనకుం బతిగ నందఱ మేఁగఁగ సమ్మదమ్ము నన్ 2.

కం. నిలిచెను ధ్వజిని యనుమతికి
జలార్థ మా చాతకముల సరణి నరేంద్రా!
లలితముగ నిచట గనుఁడీ
కలవర మేల యొసఁగుఁడు తగ ననుజ్ఞ వడిన్ 3.

ఉ. రాముని భాషణమ్ములను రమ్య తరమ్ముల నాలకించి యా
రామునిఁ కౌగిలించియు శిరమ్మున ముద్దిడి సంతసమ్మునన్
రాముని వోక నవ్విధి కరమ్మిడ హర్షము తల్చె నిట్టులన్
రాముని గూడి నే నిట వరమ్మన గాంచితి జన్మ మన్యమున్ 4.

ఆ.వె. సేన కంత నిచ్చె నానతిఁ గదలంగ
వేగ పురికి రాజు ప్రీతి మీఱ
దశరథుండు కదలఁ ద్వరితమ్ము సైన్యమ్ము
కని రయోధ్య నెదుటఁ గన్ను లలర 5.

చం. ఎగురఁ బతాకముల్ వరుస నిమ్ముగ మ్రోగఁగ వాద్యఘోషముల్
తగఁ బథ పంక్తిఁ జల్లఁగ నుదమ్ము ఘనమ్ముగఁ బుష్ప రాశియే
యగపడ నెల్లెడం జెదరి యప్పుర వాసులు మంగ ళార వా
ళి గిరల స్వాగతింపఁగ సలీల నరేంద్రుఁడు సేరె నప్పురిన్ 6.

తే.గీ. నగర వాసులు పౌర జనమ్ములు ద్విజ 7.

గణ యుతం బెదురు చనఁగ ఘనులు తనయు
లనుగమింప శ్రీమంతుఁడు నవని ధవుఁడు
సేరె హిమవన్నగ నిభ విశిష్ట గృహము

తే.గీ. రాజు స్వజనముఁ గూడి కరమ్ము సంత
సించె నిజ మనోరథములు చెలఁగి తీర
వధువులఁ గొనిరి కౌసల్య వడి సుమిత్ర
సుదతి కైక యన్య సతులు సురుచిరముగ 8.

తే.గీ. సీతను సుమహాభాగను నాతి యూర్మి
ల నిఁక మాండవి శ్రుతకీర్తుల ననునయము
గ నలువురను బ్రీతిఁ గొనిరి కాంత లెల్ల
నృప సతీమణు లా రాజ గృహములకును 9.

తే.గీ. మంగళద్రవ్యములు గొని యంగనా మ
ణు లిఁకఁ బట్టు వస్త్రమ్ములను ధరియించి
భక్తి దేవాలయము లందు భవ్యముగను
బూజలు సలిపి రెల్లరు ముదము మీఱ 10.

చం. ప్రమదలు మ్రొక్కి మ్రొక్కఁ దగు వారికి నమ్రత రాజనందనల్
తమ తమ యిండ్ల కేఁగి వనితామణు లంతఁ గుబేర వేశ్మ తు
ల్యములకు గోవులన్ ధనములం దనియంగ ద్విజాళిఁ జేసి స
వ్యముగ నిజాత్మ నాథులను బన్నుగఁ గూడి సుఖించి రింపుగన్ 11.

చం. సుతులు ఘనుల్ మహాత్ము లతి శూర వరేణ్యుల నుత్తముల్ భువిన్
సతులను గల్గి యస్త్ర సువిశారదు లెల్లరు విత్త వంతులున్
నుత సఖ సంచయాన్వితులు నొవ్వు లెఱుంగక తండ్రి నింపుగన్
సతతము కొల్చు చుండి నర సత్తము లుండిరి రాజనందనుల్ 12.

చం. కడవఁగఁ గొంత కాలము సుఖమ్ముగ భూతల నాథుఁ డింపుగాఁ
గొడుకునిఁ గాంచి యా భరతుఁ గూర్మినిఁ బల్కెను గైకయీ సుతున్
వడిఁ గొనిపోవ నిన్నటకు వచ్చెను నెమ్మి యుధాజితుండ యి
క్కడకుఁ ద్వదీయ మాతులుఁడు గాంచుమ కేకయ రాజపుత్రుఁడే 13.

తే.గీ. మిథిల లోన నన్నర్థించె మేనమామ
ఋషుల మధ్య నట్లు నతని కింపు కొలుపఁ
దగుదు వీవు పుత్రక! సమ్మదముగ ధర్మ
విదుఁడ వట్లు దొడఁగు మింకఁ బదిలముగను 14.

మ. విని యా మాటలు వల్కఁ దండ్రి భృశ సంప్రీతిం గుమారుండు స
ద్వినయుండౌ భరతుండు రాముఁ బరిరంభించెం దమిన్ లక్ష్మణుం
దన తండ్రిన్ మఱి తల్లి నన్ని నట యుక్తంబౌ యనుజ్ఞం దగం
గని యర్థించి చనంగఁ జాగె ననుజుం గాంక్షించి శత్రుఘ్నుతో 15.

ఆ.వె. చన భరతుఁడు రామచంద్రుఁడు లక్ష్మణుం
డతి బలుండు నిరువు రతి వినయము
తోడఁ దండ్రి సతము తోరము సేవించు
చుండి దేవ నిభుని నుండి రెలమి 16.

కం. జనకుని యాజ్ఞ వహించి త
గిన రీతి రఘూత్తముండు కెరలుచు మిగులం
బనులను బౌరజన హితము
లను బ్రియములఁ జేయు చుండె రాముం డెలమిన్ 17.

ఆ.వె. మాతలకు సతమ్ము మాతృ కార్యము లొన
రించుచు వినయమున నంచితముగ
గురువులకుఁ జెలంగి గురుకార్య కాయము
నెమ్మి పర్యవేక్షణమ్ము సేయు 18.

కం. ఇవ్విధ మగు రఘురాముని
యవ్వర వృత్తమ్ము గాంచి యవనీశుండున్
దవ్వుల దేశ నివాసులు
నవ్విప్ర పురజను లుండి రానందమునన్ 19.

కం. సకల ప్రాణి సమూహము
నకు భువన చయమ్మునందు నలినజు భంగిన్ 20.

ప్రకటిత సత్యపరాక్రముఁ
డు కన్పడె నినకుల రాముఁడు పురజనులకున్

కం. కడపెను బెక్కు ఋతువులును
బడతిన్ సీతను మనస్విఁ బన్నుగ నిడి తా
నెడఁదన్ నిత్యము రాముఁడు
కడు ముద మూని విహరించెఁ గాంతామణితో 21.

తే.గీ. సీత మదిలోనఁ గాంతుఁడు ప్రీతి ద్విగుణ
మై విరాజిల్లు చుండు వా రంతరాత్మ
లోనఁ బొడఁజూపి నవియును లోన నుంచ
కుండ నుందురు జెప్పుచు నండఁ జేరి 22.

తే.గీ. రాము నాత్మ లోన నిలిచి భూమితనయ
సీత దేవతా సన్నిభ శ్రీసతి వలె
రూప మందుఁ జెలంగెడి నా పడఁతుక
కరము ప్రీతయై నిత్యము పరఁగు చుండు 23.

తే.గీ. అతఁడు రాజర్షి నందనుఁ డామె యుత్త
మంపు రాజకన్యామణి యింపు మీఱ
వారు కలసి వెలింగిరి శ్రీ రమా స
తీ మతల్లి విష్ణువు లన దివ్యముగను 24.

మ. రణ దుర్భేధ్య మహాస్త్ర శస్త్ర చయ పూర్ణ జ్ఞాన వన్నిత్య ల
క్ష్మణ సంసేవిత తృప్త చిత్త! కరుణా సంవీత సంవీక్షణా!
గుణ టంకార పరాజి తారి! సత తాక్షో భ్యాంతరంగా! లస
ద్గుణ ధారా విలసచ్చరిత్ర! రిపు జిత్కోదండ రామప్రభూ! 25.

కమల విలసితము. దశరథ తనయ! సదమల చరిత్రా!
కుశలవ జనక! సుగుణ గణ ధామా!
శశినిభ ముఖ! హరి సదృశ సుమధ్యా!
దశముఖ విదళన! ధరణిజ నాథా! 26.

మాలిని. సకల సుగుణ ధామా! శత్రు సంహార కార్యా!
సకల కలుష విధ్వంసా! దయాంభోధి రామా!
సకల విబుధ సంరక్షా! స కోదండ హస్తా!
సకల భువన రక్షాసక్త చిత్తా! నరేంద్రా! 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున బాలకాండ మందు డెబ్బది యేడవ సర్గము.

శ్రీమదాంధ్ర రామాయణము నందు బాలకాండము సమాప్తము.